సెప్టెంబరు 2012
రూ. 10/-

# చతుర



వారెవ్వా!

# పీతల వలస!

ఆస్ట్రేలియాకు చెందిన క్రిస్మస్ దీవిలో దాదాపు ఆరుకోట్ల ఎర్రపీతలు సృష్టికార్యం కోసం సముద్ర తీరానికి తరలిపోతున్న దృశ్యమిది. అవి ఏటా ఇలా ఐదురోజుల పాటు ఎనిమిది కిలోమీటర్లు నడుస్తాయి. పీతల దండు వెళుతున్నప్పుడు ఆ వైపు వాహనాలు రాకుండా రహదారుల్ని మూసి వేస్తారు. అక్కడివారికి ఈ పీతల సంరక్షణపై గల మక్కువకు ముచ్చటేస్తుంది కదూ? ఇన్‌సెట్‌లో రోడ్డు మూసివేత బోర్డును చూడవచ్చు.

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్ సెన్స్ ఉంటే చాలు..
మీ అభిమాన విపుల / చతురకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా- పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ :** ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.
ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.

★ ఫొటోలు పంపేవారు విధిగా తమ మరియు తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.

★ మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ను పంపుతాం.

★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజి స్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్- 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









సంపుటి -35
సంచిక - 8
416వ సంచిక, పేజీలు : 132
సెప్టెంబరు 2012

# చతుర





'పరం నాతో చాలా వెకిలిగా ప్రవర్తిస్తుంటాడు?' అంది ఇందు, సహోద్యోగి రంజితతో.
'అతనంతే. అతని ప్రవర్తన అందరికీ తెల్సిందే' అంది రంజిత.
'దీని గురించి మా ఆయనకు చెబుతాను' అంది ఇందు.
'చెప్పకు. భార్యను ఎవడో ఎక్కడో తాకాడనేది ఏ భర్తా భరించలేడు' అంది రంజిత.
'పోనీ.. మేనేజ్‌మెంట్‌కు కంప్లయింట్ చేస్తే?' అంది ఇందు.
'అదో పెద్ద న్యూసెన్స్ అవుతుంది. దాంతో నీ ఉద్యోగమే తీసేస్తారు' అంది రంజిత.
ఆ తర్వాతేం జరిగింది? ఇందూ ఈ సమస్యను పరిష్కరించుకుందా? ఉద్యోగం చేసే గృహిణులు ఎదుర్కొనే సమస్యలను అద్భుతంగా చిత్రించిన

**ఎం. లక్ష్మీరమణ కుమారి**

విలక్షణ నవల

**తోకచుక్క**

6వ పేజీలో

బొమ్మలు : బాలు



# 2012 లో వేద నిలయము వారి
# భారతదేశంలోని తీర్థయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4,500/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6,
13/7,10/8,14/9,9/10,9/11,14/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర , రూ. 12500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6,13/7,10/8,14/9,9/10,9/11,14/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6,
13/7,10/8,14/9,9/10,9/11,14/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరినాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 12/1,9/2,8/3,12/4,10/5,7/6,12/7,10/8,14/9,9/10,9/11,13/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ.14,000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
17/1,7/2,21/2,6/3,20/3,3/4,17/4,8/5,22/5,5/6,19/6,3/7,
24/7,7/8,21/8,4/9,25/9,9/10,23/10,6/11,27/11,11/12,25/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6,8/7,12/8,9/9,7/10,11/11,9/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,5/2,19/2,11/3,1/4,22/4,13/5,27/5,10/6,24/6,8/7,
22/7,5/8,19/8,9/9,23/9,7/10,21/10,4/11,25/11,12/12,23/12

## అయోధ్య యాత్ర

కాన్పూరు, నైమిశారణ్యం
9 రోజుల యాత్ర Rs 16,000/-
11/9, 18/9, 25/9, 2/10, 16/10, 23/10, 30/10, 6/11,
13/11, 20/11, 27/11, 4/12,11/12,18/12, 25/12

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 12/1,9/2,8/3,12/4,10/5,7/6,12/7,10/8,14/9,9/10,9/11,13/12

## కాశీ - 5,500/-
## కాశీ, గయ, ప్రయాగ :

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 7,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## మహాకుంభమేళా

మహాకుంభమేళా Jan 22 నుండి 45 రోజులు. ప్రతిరోజు యాత్ర
144 సంవత్సరాలకు ఒకసారి వచ్చే మహాకుంభమేళాకి
4 రోజుల యాత్ర (అలహాబాద్ ఒక్కటే) - Rs 5,500/-
అలహాబాద్, కాశీ, గయ, ప్రయాగ - Rs 9,500/-
★ 120 రోజుల ముందు అనగా సెప్టెంబరులో టికెట్లు బుక్ చేసుకోవాలి

## వేద నిలయము జ్యోతిష్య కేంద్రము

నిష్ణాతులైన జ్యోతిష్య శాస్త్ర వేత్తలచే జాతకము క్షుణ్ణంగా పరిశీలించి మీకు అవసరమైన
పరిష్కార మార్గాలు సూచిస్తారు. విద్యా, ఉద్యోగము, వివాహము, సంతానము, ఆర్థిక,
ఋణబాధలు, కుటుంబ విషయాలు, విదేశీ ప్రయాణాలు, వ్యాపారాభివృద్ధి మరియు
ఏ సమస్యలకైనా ఖచ్చితమైనపరిష్కార మార్గాలు సూచించగలిగిన కేంద్రము .
ముషీరాబాద్, హైదరాబాద్ నందు, బి.హెచ్.ఇ.ఎల్., ఎం.ఐ.జి. -1536 (ఫేజ్ - 1) నందు
ఫోన్: 27547708 / 09, 98850 89092

వివరాలకు :




# టెంపుల్ టూరిజం

ఎ.పి. టూరిజం ప్లాజా, పర్యాటక భవనం, గ్రీన్‌లాండ్స్, హైదరాబాద్ - 16
ఫోన్ : 040 – 27547708 / 27547709 / 9885089092

ఉద్యోగం చేయలేననే కండిషన్‌తోనే పెళ్లి చేసుకున్నా భర్త, మామల వత్తిడితో ఉద్యోగంలో చేరింది చంటి పిల్లల తల్లి ఇందు. ఉద్యోగ జీవితంలో ఎదురయ్యే సమస్యలను భర్తతో చెప్పుకున్నా ఆమెకు అతని నుంచి ఓదార్పు లభించలేదు. దాంతో సున్నిత మనస్కురాలైన ఇందు ఈ లోకంలో తను ఒంటరిదాన్నని బాధపడింది. అప్పుడే ఆమెకు తనతోపాటు పనిచేసే హేలీ పరిచయమయ్యాడు. కొద్దిరోజుల్లోనే మంచి మిత్రుడయ్యాడు. అతడి ఆసరాతో ఉద్యోగంలో ఆమె బాగా నిలదొక్కుకుంది.

వెంటవెంటనే మారిన పరిస్థితులలో ఆమె వ్యక్తిగత జీవితం అనేక మలుపులు తిరిగి చివరికి ఏ తీరానికి చేరింది? మానవ సంబంధాలలో ఎదురయ్యే చిక్కుముడులను అత్యద్భుతంగా విశ్లేషించిన ఎం. లక్ష్మీరమణ కుమారి విలక్షణ నవల

# తోడమ్మ

- ఎం. లక్ష్మీ రమణ కుమారి

అది ఒక పల్లెటూరు.

రాత్రి ఏడు గంటల సమయం.

కిందటిరోజు ఇందు ఆడపడుచు పెళ్ళి జరిగింది. పెళ్ళికూతురు అత్తవారింటికి వెళ్ళిపోయింది. దూరపు బంధువులంతా వెళ్ళిపోయారు. దగ్గర బంధువులు మాత్రం ఇంకా వెళ్ళలేదు. పెళ్ళికోసం ఇందు, భర్త హరీష్ తమ చంటిపాపతో హైదరాబాద్ నుంచి వచ్చారు.

పెళ్లిఇల్లు కావడంతో మల్లె, లిల్లీ, గులాబీ పూల వాసనలు, రకరకాల సెంట్ల పరిమళాలతో కలిసిపోయి గుప్పుమంటున్నాయి. వెనక పెరట్లో వంటలు చేస్తున్నారు. వంటల వాసన కూడా గుమాయిస్తోంది.

ఆడవాళ్ళు వంటపనీ, ఇతర పనులూ చేసుకుంటూ కబుర్లాడుతున్నారు. మగవాళ్ళంతా ఒక గదిలో చేరి టీవీ చూస్తూ జోరుగా పేకాడుతున్నారు. ఏదో సినిమా వస్తోంది. పాత కథే. ప్రేమా, అపార్థాలూ, పరీక్షలూ.

"అబ్బ! బోర్ కొడుతోంది. ఎప్పుడు చూసినా అవే కథలు. మార్చరాదూ?" అన్నాడు బాబాయ్.

"అవే కథలు కాక కొత్తవి ఎక్కడ్నుంచి వస్తాయి? నీకు తెలుసా? గ్రీక్ దేశంలో ఏడు కథలుంటాయిట. ప్రపంచంలో ఏ కథ రాసినా ఆ ఏడు కథలతో పోలిక లేకుండా ఉండదుట" అన్నాడు ఇంకో బాబాయ్.

"ఇది తెలీదు గానీ, ప్రపంచంలో మనిషిని పోలిన మనుషులు ఏడుగురుంటారుట" అన్నాడు బాబాయ్.

ఇంతలో మామయ్య లేచి రిమోట్ అందుకుని, వార్తల ఛానెల్ పెట్టాడు.

స్క్రోలింగ్ అవుతున్న వార్తల్ని బిగ్గరగా చదువుతూ ఆ బృందం పేకాడుతోంది.

"ప్రియుడికి అడ్డు అని కన్నకూతుర్ని కడతేర్చిన తల్లి"

"సాయినగర్‌లో వ్యక్తి దారుణ హత్య. అక్రమ సంబంధమే కారణం"

"అక్రమ సంబంధం ఉందని భార్యను చంపిన భర్త"

"ఇంకో స్త్రీతో తిరుగుతున్న భర్తను రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్న భార్య. భర్తకు దేహశుద్ధి"

ఒక్కో వార్తనూ పైకి చదువుతున్నారు.

"ఏంటి బావా? రానురానూ ఈ పవిత్ర దేశంలోనూ అక్రమ సంబంధాలు ఎక్కువై పోతున్నట్లున్నాయే?" అన్నారు ఒకరు.

"అవి సృష్ట్యాది నుంచీ ఉన్నాయి"

"ఏమైనా ఈ మధ్య మరీ విజృంభించారులే. ఏ పేపర్ చదివినా, ఏ న్యూస్ ఛానెల్ చూసినా ఇవే వార్తలు"

"పూర్వం.. అంటే చాలా పూర్వం, ఏదన్నా రాయాల్సివుంటే శిలాఫలకాల మీద రాసేవాళ్ళుట. గూఢచారులు ఏదన్నా దేశ రహస్యాలు చేరవేయాలంటే ఆ శిలాఫలకాల మీదే రాసి, మోసుకుని పోయేవారట. తర్వాత ఎన్నో మార్పులు వచ్చాయి. కొన్నాళ్ళకు పాపిరస్ కనిపెట్టాక జనం గుండెలు బాదుకున్నారట"

"ఎందుకని?"

"పాపిరస్ మీద రాస్తే, తేలిగ్గా రహస్య సమాచారాన్ని ఒక దేశం నుంచి మరో దేశానికి చేరవేయవచ్చని వాళ్ళ భయం. తర్వాత పేపర్‌ని కనిపెట్టారుట. ఆ తర్వాత టేప్‌లూ, చిప్స్ వచ్చాయి. ఇప్పుడు అవి కూడా అక్కర్లేదు. ఎక్కడి వాళ్ళక్కడ కూర్చునే చేస్తున్నారుట. అంత తేలికైపోయింది గూఢచర్యం"

"అయితే?" బాబాయ్ అర్థంకాక అడిగాడు.

"అంటే రాళ్ళు మోయటం, తర్వాత పాపిరస్, ఆ తర్వాత చిప్స్, క్యాసెట్స్ ఇప్పుడు ఇంటర్నెట్, ఏదన్నా కాని సమాచారాన్ని దాటించాలనుకున్నవాళ్ళు దాటించేశారు"

"దీనికీ నేనన్న దానికీ సంబంధం ఏమిటి?"

"ఉంది. చెయ్యాలనుకున్నవాడు ఎట్లాగైనా చేస్తాడు. అక్రమ సంబంధాలు కూడా అంతే. అన్ని కాలాల్లోనూ ఉన్నాయి. అంతెందుకు? అదేదో దేశం మహారాణి..." మామయ్య ఉత్సాహంగా ఆ రాణీ గుట్టు విప్పబోయాడు.

"ఆపండిరా వెధవ కబుర్లు. శుభమా అని పెళ్ళింట్లో చేరి ఆ పాడు మాటలేంటి?" ఒక పెద్దాయన అరిచాడు.

అంతా మౌనంగా పేకాడుతున్నారు.

ఇంతలో భోజనాలకు పిలుపు వచ్చింది. ఇంట్లో వాళ్ళు తప్ప బంధువులంతా భోజనాలకి లేచారు.

"ఇందూ, ఇటు రా" హరీష్ పిలిచాడు.

పాపను నిద్రపుచ్చుతున్న ఇందు లేచి వెళ్ళింది.

హరీష్ పక్కగదిలోకి వెళ్ళాడు. ఆ గదిలో ఇందు అత్తమామలు కూర్చుని ఉన్నారు.

"కూర్చో అమ్మాయ్" అంది అత్తగారు.

ఇందు ఆశ్చర్యపోతూ కూర్చుంది. అత్తగారు ఆ మాత్రం సామరస్యంగా మాట్లాడటం చాలా అరుదు.

ఒక నిమిషం పాటు మామూలు మాటలు మాట్లాడి, మామగారు అసలు విషయం బయటపెట్టాడు.

"పెళ్ళికి చాలా ఖర్చయింది. అప్పు చెయ్యాల్సి వచ్చింది" అన్నారు మామగారు.

ఇందు తల ఊపింది.

"ఉన్నవాటితో అప్పుతీర్చటం కష్టం. అందుకని నువ్వు ఏదన్నా ఉద్యోగంలో చేరితే వెసులుబాటుగా ఉంటుంది" అన్నారు మామగారు.

ఇందు గుండెల్లో రాయిపడింది. ఆమె చాలా మెత్తటి మనిషి. అర్భకురాలు కూడా. సంసారం, ఉద్యోగం రెండూ సంబాళించుకోవటం కష్టం. ఇవన్నీ ఊహించిన ఇందు తల్లిదండ్రులు కట్నం ఎక్కువ ఇస్తాం కానీ ఉద్యోగం మాత్రం చెయ్యమనకూడదని కండిషన్ పెట్టారు. హరీష్‌వాళ్ళు దానికి ఒప్పుకున్నారు. పెళ్ళయి రెండేళ్ళవుతోంది. ఇప్పుడు ఉద్యోగం చెయ్యమంటున్నారు. చంటిపాపతో తనకు కుదిరే పనేనా? ఇందు ఏం అర్థంకాక అయోమయంగా చూసింది.

"ఏం అనుకోకు. భర్తకి ఏ అవసరం వచ్చినా తీర్చటం భార్య ధర్మం. ఇప్పుడు అతనికి డబ్బు అవసరం. అందుకని ఉద్యోగం చెయ్యి" మామగారు సతీధర్మం బోధించారు.

"నేను చెయ్యలేనండీ. పోనీ పాపకి మూడేళ్ళు రానివ్వండి. అప్పుడు చేస్తాను" అంది ఇందు.

"ఎక్కడో చదివిన ఒక సంఘటన గుర్తుకొస్తోంది. అవి రెండో ప్రపంచయుద్ధం రోజులు. ఫ్రాన్స్‌లో అదేదో పేరు గుర్తురావటం లేదుగానీ ఒక గొప్పకవి ఉండేవారుట. ఆయన్ని ఆ దేశ ప్రెసిడెంట్ కూడా సన్మానించాడుట. అంత గొప్పవాడైన ఆయన్ని శత్రువులు ఖైదు చేసి, కొన్ని వందల మందితో కలిపి ఒక బిల్డింగ్‌లో ఉంచారుట. అంతమందికీ కలిపి ఒకటో రెండో టాయ్‌లెట్స్ మాత్రమే ఉండేవిట"

మామగారు ఆపి, అందరివంకా చూశారు. అంతా శ్రద్ధగా వినటం చూసి, సంతోషించి పొడిగించారు.

"ఒకసారి పాపం మన కవిగారికి పొద్దున్నే అర్జెంట్‌గా టాయ్‌లెట్‌కి అవసరం వచ్చిందిట. అక్కడ పెద్ద క్యూ ఉంది. ఆయన ముందు బోలెడంత మంది ఉన్నారు. తనవంతు వచ్చిందాకా ఆగాలంటే కష్టం. ఆయన అట్లాంటి స్థితిలో ఉండగా రెండో నెంబర్లో నించున్న వ్యక్తి

ఆయన్ని గుర్తుపట్టి, 'అయ్యా తమరు ఫలానా కవిగారు కదూ! నేను మీ అభిమానిని' అని చెప్పి, 'మీరు అట్లా వెనక నిల్చోవటం ఎందుకు? రండి నా స్థానంలో నిల్చోండి, నేను మీ స్థానంలో నిలబడతాను' అన్నారుట. వెంటనే కవి గారు 'బతుకు జీవుడా!' అని టాయ్‌లెట్‌కి వెళ్ళి తిరిగి వచ్చాక తన అభిమానిని కౌగిలించేసుకుని, 'ఇవాళ నీ సత్కారానికి నాకు చాలా సంతోషంగా ఉందయ్యా, స్వయంగా దేశాధ్యక్షుడు గారు సన్మానించిన రోజు కూడా ఇంత ఆనందం కలుగలేదు' అని సంతోషించారుట. ఎందుకు చెప్తున్నానంటే సమయానికి చేసిన సాయమే సాయం. నువ్వు ఇప్పుడు ఉద్యోగం చేస్తేనే మాకు ఉపయోగం. ఎప్పుడో చేస్తే ఏంలాభం? " మామగారు తన చమత్కారాన్నీ, విజ్ఞానాన్నీ చాటారు.

ఇందు మౌనంగా ఉండిపోయింది.

"పోనీ, మీ వాళ్ళకి ఫోన్‌చేసి, రెండులక్షలు అడుగు, ఊరికే వద్దు. అప్పుగానే ఇమ్మను. నువ్వు మూడేళ్ళ తర్వాత ఉద్యోగం చేసి సంపాదించే జీతంతో అప్పు తీర్చేద్దాం" అన్నాడు హరీష్.

ఇందుకి ఏడుపొచ్చింది. 'నువ్వు ఇంకాస్త అందంగా ఉంటే, కాస్త తక్కువ కట్నంలోనే పోయేది' అని తల్లి విసుక్కోవటం గుర్తుకొచ్చింది. తల్లికి ప్రేమలేక కాదు. కానీ డబ్బుకి అన్నిటినీ మింగేసే శక్తిఉంది.

"ఇవ్వరు" అంది.

"అందుకే మరి. ఒకళ్ళని ఇబ్బంది పెట్టకుండా మన తిప్పలేవో మనం పడదాం" హరీష్ తన ఉదారభావాన్ని చాటాడు.

ఇందు కొంచెంసేపు మౌనంగా ఉండిపోయి, ఆ తర్వాత 'సరే' అన్నట్లు తల ఊపింది.

★ ★ ★

ఇందు కిటికీలోంచి చూసింది.

ఇంటిముందు చక్కటి మామిడి చెట్టు ఉంది. రోజూ దానివైపు చూడటం ఇందుకి అలవాటు. నిండా ఆకులు, కాయలు ఉండి, చూస్తేనే కడుపు నిండిపోయినట్లుంటుంది. కళకళలాడే చెట్టుని చూసి సంతోషించని వాళ్ళెవరుంటారు? ఇందు అట్లాగే చూస్తోంది. ఇంతలో ఆ చెట్టు కిందికి వాలిపోతున్నట్లనిపించింది. 'అదేమన్నా మాయా లేక తన కళ్ళే తనని మోసగిస్తున్నాయా? ' అయోమయంలో పడిందామె.

"అయ్యో, మామిడి చెట్టు పడిపోతుంది" ఎవరో అరిచారు. చుట్టుపక్కల వాళ్ళంతా పరుగున వచ్చారు.

పచ్చటిచెట్టు, నిండా పూలు, ఆకులతో కళకళలాడిన చెట్టు, నిలువుగా కూలిపోయింది. అంతా నివ్వెరపోయి చూస్తున్నారు. అంతలోనే ఎక్కడి వాళ్ళక్కడ అప్రమత్తమయ్యారు. ఎక్కడో అటకెక్కి దాక్కున్న కత్తూలూ, కొడవళ్ళూ ఒక్కసారిగా చేతుల్లోకి వచ్చి చేరాయి. ఎవరికి వారు ఆ కాయల్నీ, కొమ్మల్నీ నరికి తీసుకునే పనిలో పడ్డారు.

ఇందు చెట్టు దగ్గరకు వెళ్ళి చూసింది. చెట్టు బయటికి నిండుగానే ఉన్నా లోపల ఏదో పురుగు తినేసింది. కాండం మొత్తం పుచ్చిపోయింది.

"ఏం పురుగులు? ఎప్పట్నుంచీ తినేశాయో, నిండు చెట్టు నిలువునా కూలిపోయిందాకా ఎవరూ గమనించనే లేదే? " ఇందు ఆశ్చర్యపోయింది.

యుద్ధప్రాతిపదికన ఆ చెట్టుమీదికి లంఘించిన మనుషుల ధాటికి కాయలూ, ఆకులూ, కొమ్మలూ అన్నీ నిమిషాలమీద మాయమైపోయాయి. కాస్సేపటికి పుచ్చుపట్టిన బోలు కాండం తప్ప ఏం మిగలలేదు.

'ఏం మనుషులు? ఏదన్నా చేసి చెట్టుని రక్షిద్దామన్న ఆలోచన ఎవరికీ రాలేదేం? ' ఇందు ఆశ్చర్యపోయింది.

# ముద్దాయి పక్షం ప్రజానీకం!

ఉక్రెయిన్‌లో పుట్టిన డెమెజన్ జెక్ రెండో ప్రపంచ యుద్ధంలో సోవియట్ సైన్యంలో పని చేస్తూ జర్మనీ మీదకు యుద్ధానికి వెళ్లాడు. అక్కడ ట్రెబ్లింకా డెత్‌కేంప్‌లో జర్మన్ గార్డుగా పనిచేసాడన్న నేరంమీద 1986లో అతన్ని ఇజ్రాయిల్ కోర్టులో విచారించారు. నేరం రుజువైంది. కాని ఇజ్రాయిల్ పోలీసులు తెచ్చిన ముద్దాయి ఆ నేరం చేసినవ్యక్తి కాదని చివర్లో తేలడంతో అతనికి శిక్ష పడలేదు. అప్పటికే అమెరికా పౌరసత్వం తీసుకున్న డెమ్‌జన్‌జెక్ క్లీవ్‌లాండ్‌కు వెళ్లిపోయాడు. తర్వాత ట్రెబ్లింకాలో కాక మరో డెత్ కేంప్ అయిన సోబిబోర్‌లో అతను పని చేసాడన్న కొత్తసాక్ష్యం దొరకడంతో తిరిగి జర్మనీలో విచారణ సాగింది. ట్రావెంకీ అనేచోట సెప్టెంబరు 1941లో ఐదువేల మంది శత్రు సైనికులకు స్పెషల్ గార్డులుగా నాజీలతో శిక్షణను ఇచ్చారు. శిక్షణ పొందిన వారిలో డెమ్‌జన్‌జెక్ సంఖ్య 1627 అని, వేలమంది యూదుల మరణానికి అతను కారణమని జర్మనీలో అతని మీద కేసు నడిచింది. ఆరోగ్యం బాగాలేక వీల్‌ఛెయిర్‌లో, ఒక్కోసారి స్ట్రెచర్ మీద పడుకుని అతను కోర్టుకు హాజరయ్యేవాడు. తొంభైఒక్క ఏళ్ల డెమ్‌ను ఏనాడో జరిగిన నేరంమీద చాలా ప్రజాధనం ఖర్చు చేసి విచారించడాన్ని జర్మన్ ప్రజలు వ్యతిరేకించారు. ఆయన స్వీయ రక్షణకోసమే ట్రావెంకీలో శిక్షణపొంది ఉంటాడని లేదా మిగిలిన ఇరవైవేల మంది సోవియట్ సైనికుల్లా అతన్ని కూడా కాల్చి చంపేసి ఉండేవారని, ఆత్మరక్షణ నేరం కాదనీ, వారు ఈ విచారణను నిరసించారు.




★ ★ ★

ఇందుకి ఉద్యోగం కోసం ఒక కన్సల్టెన్సీని సంప్రదించారు. వారంరోజుల్లో వాళ్ళు ఒక ఉద్యోగం చూపించారు.

జీతం ఏడువేలు. పొద్దున్న తొమ్మిదిన్నర నుంచి సాయంత్రం ఆరుగంటల దాకా ఉండాలి. ఇందుకి అందులో నచ్చిన అంశమేమంటే అక్కడ ఇందుకి ఆఫీసర్ కూడా స్త్రీనే. ఆడవాళ్ళ దగ్గర పని చెయ్యటం కాబట్టి బెరుగ్గా ఉండదు, ఫ్రీగా పని చేసుకోవచ్చు అనిపించింది ఇందుకు..

హరీష్ లెక్కలు వేశాడు. పాపకి బేబీకేర్ సెంటర్ చూశాడు. పదిహేను వందలు కట్టాలి. ఇతర ఖర్చులు మరో వెయ్యి వేసుకున్నా నెలకు నాలుగున్నర వేల దాకా మిగులుతుంది. హరీష్ ఉద్యోగంలో టూర్లు కూడా వెళ్ళి రావచ్చు వేరే ఊరు వెళ్ళి వస్తే అలవెన్స్ బాగా ఉంటుంది. ఒక్కో నెలలో నాలుగు వేలదాకా మిగుల్చుకోవచ్చు. ఫర్వాలేదు, తండ్రికి బాగానే పంపవచ్చనుకుని నిట్టూర్చాడు.

ఇందు కూడా ఉద్యోగం చెయ్యటానికి మానసికంగా, శారీరకంగా సిద్ధమైపోయింది. 'ఈమాత్రం జాబ్ దొరక్క ఎంతో మంది కష్టపడుతున్నారు. దేవుడిచ్చిన ఉద్యోగం! కష్టపడి, నిజాయితీగా పనిచేసి, మంచిపేరు తెచ్చుకోవాలి' అనుకుంటూ ఎన్నో ఊహించుకుంది.

ఉద్యోగం ఎంత బాగా చెయ్యాలో అని కలలు కన్న ఇందు, పని చెయ్యాల్సింది షీనాదేవి కింద.

షీనాదేవి గురించి తెలియాలంటే మూడు దశాబ్దాల వెనక్కు వెళ్లాలి.

ముప్పైఏళ్ళ క్రితం ఇంటర్ పాసై, గుమాస్తా ఉద్యోగంలో చేరింది షీనాదేవి. ఆవిడ అసలు పేరు సింహాచల నర్సమ్మ.

స్టైల్‌గా ఉండాలని షీనాదేవి అని మార్చుకుంది. దిగువ మధ్య తరగతికి చెందిన షీనాకి మేకప్‌అంటే మొదట్నుంచీ ప్రాణం. కానీ ఉద్యోగం దొరికే వరకు తన మోజు తీర్చుకోలేకపోయింది. ఉద్యోగం వచ్చాక ఆమె ఊహలకు రెక్కలు వచ్చాయి.

ఇంట్లో సగంజీతం ఇచ్చి మిగతా సగాన్ని తన ఖర్చులకి ఉంచుకునేది. కావల్సిన బట్టలూ, అలంకరణ సామాగ్రీ కొనడం, బ్యూటీపార్లర్‌కి రెగ్యులర్‌గా పోయిరావటం లాంటి వాటితో ఆమె హఠాత్తుగా మొత్తం మారిపోయింది. పల్చటి జుత్తుని ఇది వరకు జడవేస్తే పూర్వకాలం చైనా మగవాళ్లు వేసుకునే జడలా సన్నగా ఉండేది. అది ఆమె ఆకర్షణని సగం తగ్గించేది. దాన్ని అందమైన బాబ్డ్ హెయిర్ చేయించింది. కనుబొమ్మలు షేప్ చేయించింది. బుగ్గలకి రంగు, పెదవులకి లిప్‌స్టిక్, మంచి బట్టలూ ఆమె అందానికి మెరుగులు దిద్దాయి. ఎక్సర్‌సైజ్ చేసి నిటారుగా నిలబడటం కూడా నేర్చుకుంది. సీతాకోకచిలుకలా రూపాంతరం చెందింది. చూడగానే ఆకర్షణీయంగా, అందంగా కనిపిస్తోంది. ఆ మార్పు ఒక అద్భుతం.

**కొత్తగాలి...**

**విద్య, వేదాంతాలనల్లి**
**విశ్వకీర్తి గడించె సర్వేపల్లి**
**పుట్టడంతటి ఘనుడు మళ్లీ**
**భారతావని కనకగర్భాన తల్లీ!**

*– నండూరి నాగేశ్వరరావు,*
హైదరాబాద్

షీనా చేరిన సమయంలోనే ఆ ఆఫీసులో మరో ముప్ఫై మంది అమ్మాయిలు చేరారు. కానీ అంతా యావరేజ్ కన్నా తక్కువ అందగత్తెలే. అదీగాక వాళ్ళకి మేకప్ మీద శ్రద్ధలేదు. షీనా ధరించే లో కట్ బ్లౌజ్‌లూ, బొడ్డు కింద చీరా వాళ్లకి లేవు. అందుకని ఆఫీసులో మగాళ్ళు మొత్తం షీనాకి ఆరాధకులుగా మారిపోయారు. మగాళ్ళు షీనా వైపు అదోలా చూస్తుంటే, ఆడవాళ్ళు ఆమెని భూతంలా చూడటం మొదలు పెట్టారు. మగవాళ్ళ పిచ్చి చూపులు షీనాకి బాగా తెలుసు. పైకి కనుబొమ్మలు ముడి వేసి చూసినా, లోలోపల చాలా ఆనందించేది. ఏదీ గమనించనట్లు నటించేది.

ఆ ఆఫీసులో క్రమశిక్షణ తక్కువ. మగ ఉద్యోగులు ఆడవాళ్ళని భౌతికంగా ఏం చెయ్యలేకపోయినా, మనసుల్లో మాత్రం అన్నీ ఊహించుకుని ఆనందించేవాళ్ళు. ఆ రోజుల్లో సి.సి. కెమెరాల్లాంటివేవీ ఆఫీసుల్లో లేవు. అందుకని ఉద్యోగులు నిర్భయంగా, స్వేచ్ఛగా మాట్లాడుకునేవాళ్ళు.

ఆనందాన్ని వ్యక్తీకరించటానికి అంతా తలా ఒకమార్గం ఎంచుకుంటారు. కొందరు కవిత్వం రాస్తారు. కొందరు బొమ్మలు గీస్తారు.

ఆ ఆఫీసు ఉద్యోగులు స్వేచ్ఛగా తమ భావాలని, ఆనందాన్ని వ్యక్తం చేసుకోవటానికి ఎంచుకున్న వేదిక, ఆ ఆఫీసులో మగవాళ్ళ టాయ్‌లెట్. దాంట్లో వాళ్ళు షీనా మీద అశ్లీల కవిత్వం రాశారు. ఆమె అంగాంగాన్నీ పచ్చిగా వర్ణించే కవిత్వంతో ఆ గోడలు నిండిపోయాయి.

కొన్నాళ్ళయ్యాక అదీ వాళ్ళకి తృప్తి నివ్వలేదు. కుడ్య చిత్రాలు మాత్రమే తమకి ఆనందం ఇస్తాయని తెలుసుకున్నారు.

వాళ్ళల్లో ఒక పెద్దమనిషి షీనా నగ్న చిత్రాన్ని టాయ్‌లెట్ గోడమీద చిత్రీకరించాడు. మరో పెద్దమనిషి దాన్ని చూసి, ఉప్పొంగి, కొన్ని మార్పులు చేశాడు. స్టాఫ్ మొత్తం పిచ్చి పట్టినట్లు దానికి ఎన్నో

మార్పులు చేశారు. వాళ్ళకి బోలెడంత ఆనందం, థ్రిల్ దొరికాయి. దానిని త మకు చేతనైనంత అసభ్యంగా, అశ్లీలంగా మార్చి ఆనందిస్తున్నారు.

అక్కడ అందరూ పెద్దమనుషులే. కానీ అదునూ, అవకాశం వాళ్ళలోని సహజ తత్వాన్ని బయటపెట్టాయి. షీనాకి కూడా ఆ చిత్రాల సంగతి తెలిసింది. మేనేజ్‌మెంట్‌కి ఫిర్యాదు చేసింది. వాళ్ళు ఒక ఆఫీసర్ని ఎంక్వైరీకి వేశారు.

పాపం ఆ ఆఫీసర్ ఎన్నడూ సామాన్య ఉద్యోగుల టాయ్‌లెట్లలోకి ప్రవేశించిన వాడు కాదు. తన కింద అంతటి టాలెంట్ ఉన్న ఉద్యోగులు పని చేస్తున్నారని ఆయన ఎంతమాత్రం ఎరగడు. ఆ కవితలూ, కుడ్యచిత్రాలూ చూసి ఆయన అచ్చెరువూ, ఆనందం ఏక కాలంలో పొందాడు. ఇన్నాళ్ళు ఇవన్నీ పోగొట్టుకున్నానని బాధపడ్డాడు. తన్నుకుని వస్తున్న నవ్వునీ, సంతోషాన్నీ లోలోపలే అణిచి, పైకి గంభీరంగా కనిపించటానికి చాలా కష్టపడాల్సి వచ్చింది. చివరికి విశ్వప్రయత్నం మీద విషాద గంభీర ముద్ర దాల్చి, అవన్నీ శుభ్రంగా చెరిపి, కడిగి, సున్నం కొట్టించమని ఆర్డరు వేశాడు.

ప్రతీ కళకీ ఒక ప్రయోజనం ఉండి తీరుతుందంటారు పెద్దలు. ఆ టాయ్‌లెట్ విషయంలో అది నిజమైంది. దాన్నిండా కిళ్ళీ మరకలూ, ఇతర మచ్చలూ ఉండి ఎంతో వికారంగా కనిపించేది. 'కాస్త సున్నం కొట్టించండి మహాప్రభో!' అన్నా ఎవరూ వినిపించుకోలేదు. కానీ ఇప్పుడు అవన్నీ చెరపటానికి ముమ్మారు సున్నం కొట్టించాల్సి వచ్చింది.

ఇంకెప్పుడన్నా ఇట్లాంటి రాతలు, చిత్రాలూ పునరావత్రృతమైతే కఠిన చర్యలు తీసుకోబడతాయని సర్క్యులర్ పంపారు.

ఆ వెధవ కవితలూ, బొమ్మలూ ఎవరు మొదట రాశారో ఎవరికీ తెలియదు. షీనా పాపులారిటీ, మగవాళ్ళు ఆమెకి మానసికంగా బానిసలుగా మారటం, అక్కడి ఉద్యోగినులకి చిర్రెత్తించిందనీ, కొందరు ఆమెని చూసి అసూయ పడుతున్నారనీ జనం తెలుసుకున్నారు. అట్లా అసూయ పడ్డ ఉద్యోగినుల్లోనే ఎవరో ఒకరు, అంతా ఇళ్ళకి వెళ్ళిపోయాక, మగవాళ్ళ టాయ్‌లెట్లో దూరి, ఆ బొమ్మలు వేశారని కూడా పుకార్లు చెలరేగాయి. ఏది నిజమో దేవుడికే తెలియాలి.

షీనా అశ్లీల కవిత్వాన్నీ, చిత్రాల్నీ మాత్రమే ద్వేషించింది, కానీ మగాళ్ళు తనని చూసి పిచ్చివాళ్ళై పోవటం చూసి మాత్రం సంతోషించింది. సెక్సీ దుస్తులూ, పిచ్చెక్కించే అలంకరణా మానలేదు.

కొందరు మగాళ్ళు షీనాకి చేరువ కావాలని చూసేవాళ్ళు. వాళ్ళు ఆమె అందాన్ని మాత్రమే పొగిడితే లాభం లేదని తెలుసుకున్నారు. ఆమె దగ్గర చేరి, ఆమె తెలివిని కూడా పొగడటం మొదలు పెట్టారు. నీ అంత మేధస్సు ఎవరికీ లేదన్నారు. ఆరాధకుల సంఖ్య పెరుగుతున్న కొద్దీ షీనా దాహం కూడా పెరగటం మొదలుపెట్టింది. ఇంకా ఇంకా ఆరాధించాలని అనుకునేది. వాళ్ల మాటల్ని నమ్మింది. తను ఎక్కడో పెద్ద పొజిషన్‌లో ఉండాల్సిన దాన్నని మూర్ఖంగా నమ్మింది. పై చదువులు చదవాలని బి.ఏ. కట్టింది. ఆఫీసు పనిలో ఎప్పుడూ వెనకబడే ఉండేదికానీ దాన్ని బాగు చేసుకుందామని మాత్రం ఎన్నడూ ప్రయత్నించలేదు. కొన్ని డిప్లొమాలు కూడా సంపాదించింది.

ఇంటర్వ్యూల్లో ఆమె అందాన్నీ, ఉన్న డిప్లొమాలనీ చూసి, వెంటనే సెలక్ట్ చేసే వాళ్ళు. కానీ ఎక్కడా ఆమె తన ప్రతిభని ప్రదర్శించలేదు. ప్రతిచోటా ఆఫీసుకి ఒక తెల్ల ఏనుగుగానే మారింది.

ఇంతలో కాలం గిరగిర తిరిగింది. ఆమెకి వయసు పెరిగింది. కోలమొహం ముందుగా నలు చదరంగా మారి ఆ తర్వాత గుండ్రంగా ఒక గ్లోబ్ సైజుకి మారింది.

ముప్ఫై దాటాక ఆకర్షణ తగ్గుముఖం పట్టింది. నలభై దాటాక స్థూలకాయం కూడా వచ్చింది.

షీనా ఒక పత్రికలో ఒకవ్యాసం చదివింది. దాని ప్రకారం ఒక స్త్రీ ఇక ఏమాత్రం ఆకర్షణీయంగా లేదని ఎలా తెలుసుకోవాలి? అవి వేరేవాళ్ళ పొగడ్తలతోనే. 'నీకీ చీరె అద్భుతంగా ఉంది' అనే పొగడ్త కాస్తా 'ఈ చీరె చాలా బాగుంది' లోకి మారిందంటే, తాను మగాళ్ళని ఆకర్షించటం లేదని స్త్రీ తెలుసుకోవాలి.

ఏ వయసుకి ఉండే హుందాతనం ఆ వయసుకుంటుంది. కానీ ఎప్పుడూ యవ్వనంలో ఉన్నట్లే కనబడాలని యత్నించే స్త్రీలు ఆ యవ్వనాన్ని ఎక్కడినుంచైనా బలవంతాన లాక్కుని వద్దామని ప్రయత్నిస్తారు. షీనా భారీ అలంకరణ, వస్త్రాలు వెగటుగా కనిపించటం మొదలుపెట్టాయి.

ఇన్నాళ్ళూ ఆమెకి తనని జనం ఆరాధించటం మాత్రమే తెలుసు. తనని కళ్ళు తిప్పుకోకుండా చూసే జనం ఇప్పుడు కన్నెత్తి కూడా చూడకపోవటంతో ఆమె అహం దెబ్బతింది. ఆమె మనసు గాయపడింది. చివరికి ఆమె అసహనంగా మారింది. జనం తనని మళ్ళీ రెప్పవాల్చకుండా చూడాలి. దానికోసం ఆమె ఏమైనా చెయ్యటానికి సిద్ధంగా ఉంది. ఆ పాతరోజులు మళ్ళీ రావాలని తీవ్రంగా తపిస్తోంది. ఆఖరికి ఆ టాయిలెట్ కవితలూ, చిత్రాలూ మళ్ళీ ప్రత్యక్షం అయినా ఫర్వాలేదు. జనం తనకోసం తపించాలని ఆమె తపిస్తోంది.

గడిచిపోయిన రోజులు తిరిగిరావు. నలభై ఏళ్ళుదాటాక మగవాళ్ళల్లో కూడా పూర్వపు ఉత్సాహం ఉండదు. డబ్బు సంపాదన, పిల్లల పెంపకం లాంటి కార్యక్రమాల్లో పడి షీనా పూర్వ ఆరాధకులు కూడా కనీసం మర్యాదకైనా ఆమెని పొగడటం లేదు.

షీనా అసహనంతో చిరాగ్గా, గయ్యాళిగా మారింది. తనకేదో గొప్ప అన్యాయం జరిగినట్లు ఫీలైపోతుంది.

అందరి మీదా ద్వేషం పెరిగిపోయింది. ఆ ద్వేషానికి ఆమెకింద పనిచేసేవాళ్ళే బలైపోతుంటారు. ఒకవేళ అమ్మాయిలు గనక ఆమెకింద పని చెయ్యాల్సి వస్తే ఆమె పీడనకు అంతం ఉండదు.

ఇవేవీ తెలియని ఇందు ఆమెకింద ఆ రోజే చేరేందుకు వచ్చింది.

ఇందు ఆ ఆఫీసులోకి ప్రవేశించింది. షీనాకి తాను ఉద్యోగంలో చేరుతున్నట్లు లెటర్ ఇచ్చింది.

షీనా ఇందుని ఆపాదమస్తకం పరీక్షగా చూసింది. అటూ చూసి చూసి హఠాత్తుగా చూపులు తిప్పుకుంది. అటెండెన్స్ రిజిష్టర్‌ని ఇందు ముందుకి తోసింది.

"నీ పేరు రాసి, సంతకం పెట్టు" అంది ఎటో చూస్తూ. అంత ఉదాసీనంగా ఒక ఆఫీసర్ ఎలా ఉంటుందో ఇందుకి అర్థం కాలేదు.

"పరం, ఆమెకి పని వివరించు" షీనా అక్కడ కూర్చున్న ఒక పెద్దాయనకి చెప్పింది. అతని పేరు పరంజ్యోతి.

అతను వెంటనే లేచి నిలబడ్డాడు.

"ఎస్, మేడమ్" అన్నాడు షీనాతో మర్యాదగా, నమ్రతగా.

ఇందుకి ఒక టేబుల్ చూపించాడు.

"ఇదే నీ సీట్" అన్నాడు. ఆ సీట్ సరిగ్గా షీనా ఎదురుగా ఉంది.

పరం వయసుకి పెద్దవాడు. పెద్దమనిషి లాగా కూడా కనిపిస్తున్నాడు. ఇందుకి అతని దగ్గర పని నేర్చుకోవటం సంతో

# సైనికులకు నివాళి!

వాషింగ్టన్‌లోని అమెరికన్ మెరైన్ కార్ప్స్ వార్ మెమోరియల్‌ని, 1775 నుంచి అమెరికన్ సైనికుల మరణాలకి గుర్తుగా అంకితం చేసారు. అయితే దీన్ని రెండో ప్రపంచ యుద్ధకాలం తర్వాత ఏర్పాటు చేసారు. టోక్యోకి దక్షిణాన 660 మైళ్ళ దూరంలోని ఓ చిన్న ద్వీపంలోగల మౌంట్ సురీబచీ పర్వతం మీద, తమ విజయానికి చిహ్నంగా దీన్ని మొదట్లో ఏర్పాటు చేశారు. ఒకనాటి ఈ అగ్నిపర్వతం ఎత్తు 550 అడుగులు. 1945 ఫిబ్రవరి 19న అమెరికన్ సైన్యం, జపాన్ సైన్యం మీద డెబ్బైరెండు గంటల పాటు యుద్ధంచేసి, ఫిబ్రవరి 23 ఉదయం ఈ ద్వీపాన్ని గెలుచుకుంది. సెకండ్ బెటాలియన్‌కి చెందిన ఐదుగురు అమెరికన్ సైనికులు మధ్యాహ్నం ఈ కొండ మీదికి ఎక్కి పెద్ద అమెరికన్ జెండాని ఎగరేసారు. జోరో సెంథాల్ అనే ఫొటోగ్రాఫర్ తీసిన ఎగిరే ఈ జెండా ఫొటోకి పులిట్జర్ ప్రైజ్ కూడా లభించింది. యు.ఎస్. నేవీకి చెందిన శిల్పి ఫెలిక్స్ ఆ ఐదుగురు ఈ జెండా ఎగరేసే దృశ్యాన్ని శిల్పంగా మలిచాడు. ఈ విగ్రహాన్ని ఇత్తడి శిల్పంగా నిర్మించడానికి అతనికి మూడేళ్ళు పట్టింది. 1954లో అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్ ఈ ముప్పైరెండు అడుగుల ఎత్తుగల విగ్రహాన్ని వాషింగ్‌టన్ డిసిలో ఆవిష్కరించాడు. ఇందుకోసం 8.5 లక్షల డాలర్లు ఖర్చయింది దీన్ని వాషింగ్టన్ మెమోరియల్ పార్క్‌వేలో ప్రతిష్టించారు. అమెరికన్స్ స్టేచ్యూ ఆఫ్ లిబర్టీతో పాటు దీన్ని కూడా వారి దేశానికి సింబల్‌గా భావిస్తారు.






# జైలు హోటల్!

జైల్లో నిద్రలేస్తే, వెంటనే వచ్చే ఆలోచన ఎలా ఉంటుంది? అనేది శిక్ష అనుభవించే నేరగాళ్ళకే తెలుస్తుంది. అయితే మామూలు వ్యక్తులకూ అలాంటి అవకాశాన్ని కల్పించే వ్యాపారాన్ని ఐకియా, డేవిడ్‌లించ్ అనే ఇద్దరు కలిసి ప్రారంభించారు. జర్మనీ దేశపు జైలులోని సెల్ మాదిరిగానే గదులు గల హోటల్‌ను వీరు అమెరికాలో నిర్మించి, అద్దెకి ఇస్తున్నారు. అయితే జర్మనీ జైలునే దీనికి మాదిరిగా ఎన్నుకోవడానికి కారణం, అక్కడ ఎక్కువ సదుపాయాలు గల 'అప్పర్ క్లాస్ కరెక్షనల్ ఫెసిలిటీ' ఉండటమే. ఈ అప్పర్‌క్లాస్ జైళ్లలో మిగిలిన ఖైదీల సెల్స్‌కన్నా ఎక్కువ సదుపాయాలు ఉంటాయి. సరిగ్గా అలాంటి సెల్స్‌ను గదులుగా నిర్మించి వీరు అద్దెకు ఇస్తున్నారు. గది తలుపుల మీద హేండ్ పెయింట్ చేసిన సెల్ నంబర్ మాత్రమే తాముంటున్నది జైల్ గదిలాంటిదని గుర్తు చేస్తుంది. స్థానికులేకాక, అంతర్జాతీయ వ్యాపారవేత్తలు కూడా ఇందులో బసచేయడం విశేషం. ఓ హంతకుడు లేదా ఓ బ్యాంకు దొంగ నివసించదగ్గ ఖైదులో తాము ఉండటం వారికి ఆనందాన్నిస్తోంది. దీనిపేరు అల్ కార్జ్ హోటల్. శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి కొద్దిదూరంలో ఉన్న ఓ ద్వీపంలోగల జైలుకు ఈ పేరు ఉంది. అందుకే ఈ అమెరికన్ హోటల్‌కు అదేపేరు పెట్టారు. ఇది లాస్‌ఏంజెలెస్‌లో ఉంది.



షంగా అనిపించింది.

ఆ గది చాలా ఇరుగ్గా ఉంది. ఇందు సీట్ కి వెళ్ళేదారి కూడా ఇరుకే. ఇందు కష్ట పడి తన సీట్లోకి వెళ్ళింది.

"ఈమె ఇంకాస్త బొద్దుగా ఉంటే అక్కడికి వెళ్ళగలిగేది కాదు" అన్నాడు పరం.

షీనా నవ్వింది.

పరం పని నేర్పించటం మొదలుపెట్టాడు. ఆఫీసుభాషలో ఏదేదో చెప్తున్నాడు. అతని మొహం ఇందువైపూ, వీపు షీనా వైపు ఉన్నాయి. అతని కళ్ళుచూసి ఇందుకి గుండె ఆగినంత పనైంది. ఆ కళ్ళ నిండా ఆకలి. ఆమె శరీర భాగాలవైపు ఆకలిగా, ఆబగా చూస్తున్నాడు. ఏవేవో వివరిస్తుంటే షీనా మధ్యలో అతన్ని ప్రశ్నలడుగుతోంది. అతను వెనక్కు తిరిగి ఆ ప్రశ్నలకు సమాధానం ఇస్తున్నాడు. అప్పుడు వెంటనే అతని మొహంలో భావాలు నమ్రతగా, మర్యాదతో కూడిన చిరునవ్వుతో సహా మారిపోతున్నాయి. అప్పుడు చాలా పెద్దమనిషిలా కనిపిస్తున్నాడు.

'ఇంత వేగంగా భావాలు ఎట్లా మార్చగలుగుతున్నాడు?' ఇందుకి ఆశ్చర్యం వేసింది. ఒక ఊసరవెల్లి కూడా తన రంగులు మార్చటానికి కొన్ని క్షణాలు సమయం తీసుకుంటుందేమో గానీ, పరం మాత్రం క్షణంలో హావభావాలు మార్చేస్తున్నాడు. ఇంతవేగంగా ఏ నటుడు కూడా ఎంత ప్రాక్టీస్ చేసినా మార్చలేడేమో. ఒక పెద్దమనిషి, ఒక వెధవ పాత్రల్ని పరం ఏమాత్రం కష్టలేకుండా పోషించేస్తున్నాడు.

'పై వేషం చూసి మోసపోకూడదు' ఇందుకి అర్థమైంది. ఆమె అట్లా ఉక్కిరిబిక్కిరవుతుండగానే పరం ఆమెకి సీట్లో పని వివరిస్తూపోయాడు.

అతను అక్కడ్నుంచి వెళ్ళిపోయాక ఇందు తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

ఆ షాక్ నుంచి తేరుకోవటానికి ప్రయత్నిస్తూ అక్కడ ఉన్న మిగతావాళ్ళని పరిచయం చేసుకుంది. అక్కడ ఇంకో అమ్మాయి రజిత ఉంది. అంజన్ అనే అబ్బాయి ఉన్నాడు. అతడు ఆ కంపెనీ ఓనర్ కు బంధువుట. అమెరికా పోవాలని ప్రయత్నిస్తున్నాడు. అనుభవం కోసమే ఈ ఆఫీసులో పనిచేస్తున్నాడు. తలిదండ్రులకి గారాబు కొడుకు. బాగా డబ్బుందిట.

పరం వెకిలి నవ్వులూ, ఆకలి చూపులూ చూశాక ఇందుకి ఏ మగవాడిని చూడాలన్నా భయం వేస్తోంది. కానీ అంజన్ ప్రవర్తన చాలా మృదువుగా ఉంది. అతను ఉన్నంతసేపూ వాతావరణం ఆహ్లాదంగా ఉంది. అతను చాలా మంచివాడని ఇందుకి అర్థమైంది.

ఒక గంట గడవగానే అంజన్ వెళ్లిపోయాడు. షీనా మధ్యమధ్యలో ఇందువైపు అసహ్యం నిండిన కళ్ళతో చూస్తోంది. ఆ చూపు ఇందుని క్రుంగదీసింది.

లంచ్ టైమ్ కాగానే పరం లంచ్ బాక్స్ తీసుకుని ఎటో పోయాడు. షీనా ఇంకాస్త ముందే లంచ్ కి వెళ్ళిపోయింది.

రజిత, ఇందు కూర్చుని లంచ్ చేశారు.

పరం లంచ్ చేసి తిరిగివచ్చాడు. బాగా తిని, అతని శక్తి రెట్టింపయినట్లుంది.

కాస్సేపయాక షీనా వచ్చింది. అట్లాగే ద్వేషపూరిత నయనాలతో ఇందువైపు చూస్తోంది. ఎందుకలా చూస్తోంది? ఈ ఆఫీసులో చేరిందాకా ఇద్దరూ అపరిచితులు. మరి ఆమె తనని ద్వేషించే కారణమేంటి? మనిషి చిన్న నవ్వుతోనో లేక మొహం చిట్లించుకునో ఎదుటివారి ఆలోచనల్లో ఎంత చోటు చేసుకుంటాడో ఇందుకి అర్థమైంది. ఆందోళన, ఇబ్బంది, భయం ఆమెని చుట్టుముట్టాయి.

'దేవుడా! ఈ ద్వేషపూరిత దృక్కుల్ని తప్ప దేన్నయినా భరిస్తా' అనుకుంది.

"ఇవ్వాళ ఏం పని చేశావు? " షీనా కను

బొమలు ముడిచి అడిగింది.

ఇందు తను చేసిన పని చూపించింది.

"నాకు నేరుగా సబ్మిట్ చెయ్యకు. పరం.. కాస్త అన్నీ వెరిఫై చెయ్యి" అంది.

"ఎ2 సెక్షన్‌కి వెళ్ళి ఫిగర్స్ తెచ్చావా? " షీనా అడిగింది.

"ఏం ఫిగర్స్? "

"భగవంతుడా? నన్ను ప్రశ్నలు అడక్కు. పరం ఆమెకి గైడ్ చెయ్యి. అంతే కాదు, మనం ఆమెని ఉండనివ్వాలా వద్దా కూడా నువ్వే నిర్ణయించాలి" అంది షీనా.

పరం నవ్వాడు.

"పద ఎ2 సెక్షన్‌కి వెళ్ళి ఫిగర్స్ తెచ్చుకుందాం" అన్నాడు ఇందుతో.

'ఇంకా ఇక్కడే నిలబడ్డావేం? ' అన్నట్లు షీనా కోపంగా చూస్తోంది. ఇందు ధైర్యం కూడగట్టుకుని అడుగులు వేసింది.

సెక్షన్ దాటి నాలుగు అడుగులు వేశారు. కారిడార్లో నాలుగు అడుగులు వేశారో లేదో, పరం చాలా చాకచక్యంగా, ఏదో వివరిస్తున్నట్లు ఆమెని నిమిరాడు.

ఇది పొరపాటున చేసిన పని కాదని ఇందుకి కచ్చితంగా తెలుసు. కావాలని జిత్తులమారిలా చేశాడు. ఇందుకి బిగ్గరగా ఏడవాలనిపించింది.

అతని వైపు కోపంగా చూసింది. ఆ మొహంలో ఒక వెకిలినవ్వు. వెంటనే అది మాయమై ఏమీలేని భావంతో ఉండిపోయాడు. ఆమెకి కళ్ళనీళ్ళు తిరిగాయి. తిన్న తిండి కూడా వాంతి అవుతుందేమో అనిపిస్తోంది. రుమాలుతో కళ్ళు అద్దుకుంది. అతన్ని ఎట్లా ఎదుర్కోవాలో తెలీక, చివరికి కాస్త ఎడంగా నడిచింది.

★ ★ ★

ఆ తర్వాత చాలాసార్లు పరం ఆమెని కావాలని తాకాడు. వెకిలి నవ్వులు నవ్వాడు. ఏ మాత్రం ఏమరుపాటుగా ఉన్నా ఆమెకి డాష్ కొడదామనో, చేతులు తగిలిద్దామనో చూస్తున్నాడు.

ఇందుతో రజిత కాస్త మామూలుగానే మాట్లాడుతుంది. అందుకే ఆమెకి చెప్పుకుని బాధపడింది ఇందు.

"అతనంతే" అనేసింది రజిత.

"మరి నీతో బాగానే ఉంటాడు"

"మా మామయ్య పెద్ద పోలీస్ ఆఫీసర్" అంది రజిత గర్వంగా.

"ఇంతకు ముందు ఇక్కడ కొందరు పని చేశారు. వాళ్ళతో కూడా పరం ఇట్లాగే చేశాడు" అంది మళ్ళీ.

"మరి వాళ్లు రిపోర్ట్ చెయ్యలేదా? " అడిగింది ఇందు.

"లేదు. నాతో నీలాగే కొందరు చెప్పారు. అంతే"

"మా ఆయనకి చెపుదామనుకుంటున్నాను" అంది ఇందు.

"చెప్పకు. తన భార్యని ఎవడో ఎక్కడో తాకాడని తెలుసుకోవడం ఏ మగవాడికీ ఇష్టం ఉండదు. ఆ కోపం నీ మీదే చూపిస్తాడు"

"మేనేజ్‌మెంట్‌కి కంప్లయింట్ చేస్తే? "

"ఇదొక ఇష్యూ అయి వాళ్ళకి న్యూసెన్స్ అవుతుంది. అది వాళ్ళకిష్టం ఉండదు. నిన్నే తీసేయవచ్చు. ఒకవేళ తీసేయకపోయినా పరం శాంతంగా బతకనివ్వడు"

ఇందు తల ఊపింది.

"అది కోరి కొరివితో తల గోక్కున్నట్లవుతుంది. పరం ఊరుకునే మనిషి కాడు. నీ రికార్డులు తారుమారు చేస్తాడు. ఇంపార్టెంట్ ఫైల్స్ ఎత్తుకునిపోయి నిన్ను బాధ్యురాల్ని చేస్తాడు"

తను కంప్లయింట్ ఇస్తే, అదెక్కడ పెద్ద న్యూసెన్స్ అవుతుందోనని మేనేజ్‌మెంట్‌కి భయం. రజిత లాగా తనకి పోలీస్ అంకుల్స్ లేరు. భర్తకి ఇవన్నీ మేనేజ్ చేసే కెపాసిటీ లేదు. ఏం చెయ్యాలి?

"నువ్వేదన్నా గొడవ చేస్తే ఇక్కడ

ఉద్యోగం పోవటం మాత్రమేకాక ఇంకో చోట దొరకటానికి కూడా ప్రాబ్లం అవుతుంది" రజిత బెదిరిస్తున్నట్లు అంది.

ఇందుకి భోరుమని ఏడవాలనిపించింది. తను ఒంటరినైనట్లు అనిపించింది.

★ ★ ★

సాయంత్రం నాలుగు గంటలవుతోంది. అంజన్ మూడున్నరకి ఆఫీసుకి వచ్చాడు. ఒక పదిహేను నిమిషాలపాటు ఏదో పని చూసుకున్నాడు. ఆ తర్వాత హఠాత్తుగా అదృశ్యమయ్యాడు. యథాప్రకారం షీనా ఏదో మిష చూపి తిట్టిపోసింది. పరం గట్టిగా నవ్వాడు. షీనా అరుపులూ, పరం వెకిలి నవ్వూ చూసి ఇందుకి ఏడుపు వచ్చేసింది. ఇక పనిలో ఏ మాత్రం లీనం కాలేననిపించింది. కాస్సేపు విశ్రాంతి తీసుకుంటే? వెంటనే సీట్లోంచి లేచి బయటకు నడిచింది. ఎటుపోవాలో అర్థం కాలేదు. టీ బ్రేక్, స్నాక్స్ తినటం అంటూ ఆఫీసులోవాళ్ళు కాస్సేపు బయట తిరిగి వస్తుంటారు. ఇందు మాత్రం ఎటూ కదలదు.

ఆఫీసు వెనక అందమైన గార్డెన్ ఉంది. చిన్నసైజు పర్వతంలాంటి రాయి ఉంటుందక్కడ. దానిచుట్టూ పచ్చటి చెట్లూ, పూల మొక్కలూ పెంచారు. అటువైపు కూర్చుంటే ఎవరూ కనిపించరు. పచ్చటి గడ్డి అందమైన తివాచీలా పరుచుకుని ఉంటుంది. ఎందుకో ఎవరూ అక్కడ కూర్చోరు. ఆ తర్వాత గోడ ఉంటుంది.

ఇందు ఆ గడ్డివైపు నడిచింది. గడ్డి మీద కూర్చోబోతుండగా హఠాత్తుగా ఆమె చూపు ఆ పెద్దరాయి మీద పడింది. దానికి ఆనుకుని ఎవరో నిల్చుని ఉన్నారు. ఆ వ్యక్తి అటువైపు తిరిగి నిల్చుని ఉండటం వల్ల ఆమెకి అతనెవరో తెలియలేదు. హఠాత్తుగా వెక్కిళ్ళు వినిపించాయి. ఎవరో ఏడుస్తున్నారు. ఎవరో కాదు, ఆ వ్యక్తే. అతను కాస్త రిలాక్స్ అవుదామని ఆ రాతికి ఆనుకుని నిల్చున్నాడేమో అనుకున్న ఇందు అభిప్రాయం తప్పయింది. అతను ఆ రాతికి ఆనుకుని నిలబడి ఏడుస్తున్నాడు. అతని శరీరం మొత్తం ఆ వెక్కిళ్ళ ధాటికి కంపించిపోతోంది.

ఇందుకి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఆ వ్యక్తి ఎవరోగానీ ఇక్కడే పనిచేస్తుండవచ్చు కానీ ఎవరు? ఎందుకంతలా ఏడుస్తున్నాడు? వెళ్ళి అడిగితే? బాగుండదు.

ఇందు కూడా ఈ ఆఫీసులో ఎన్నోసార్లు ఏడ్చింది. కానీ అది రహస్యంగా, టాయిలెట్ లోనో, ఎవరూ లేని సమయంలో లంచ్ రూమ్‌లోనో. కానీ ఎంత ఏడ్చినా ఇంత ఘోరంగా మాత్రం ఎన్నడూ ఏడవలేదు. పాపం ఏమయింది అతనికి?

హఠాత్తుగా అతను వెనుతిరిగాడు. కన్నీటి చారికలతో ఉన్న అతని మొహం ఎర్రబడింది. అతన్ని చూసి ఇందు నిర్ఘాంతపోయింది. తన కళ్ళని తానే నమ్మలేకపోయింది. అతను అంజన్.

అంజన్ అన్నివిధాలా అదృష్టవంతుడు. అతనికి ఏమైంది? ఎందుకేడుస్తున్నాడు?

ప్రేమలో విఫలమయ్యాడా? ఆమెకి జాలేసింది. అంజన్ ఇంకా బాధపడుతూనే ఉన్నాడు. కన్నీళ్ళు జలజలా రాలిపోతున్నాయి.

"అంజన్? ఏమైంది? " ఇందు బాధగా అడిగింది.

అంజన్ మాట్లాడలేదు

"నేనేమన్నా సాయపడగలనా? " అడిగింది ఇందు.

"లేదు" అన్నాడు అంజన్ ఏడుస్తూనే.

ఇందు గుండె ద్రవించిపోయింది.

"పర్సనల్ ప్రాబ్లమా? " ఇందు మృదువుగా అంది. అతను ఏడుస్తూనే తల ఊపాడు. మళ్ళీ వెనక్కు వెళ్ళిపోయి, రాతికి ఆనుకుని నిలబడి ఏడుస్తున్నాడు.

ఇందు అతన్ని ఆ స్థితిలో ఎన్నడూ

చూడలేదు. అసలు ఊహించను కూడా లేదు. అతనెప్పుడూ జాలీగా ఉంటాడు. అట్లాంటి మనిషి ఎందుకేడుస్తున్నాడు? ఏంటి సమస్య అసలు?

"నా జీవితం నాశనమైపోయింది" అతను మళ్ళీ గట్టిగా ఏడ్చాడు.

"ప్లీజ్, ఏం జరిగిందో చెప్పు" ఇందు లాలనగా అడిగింది.

"అయిపోయింది. అంతా అయిపోయింది"

"అట్లా అనుకోకు. ప్రతీ సమస్యకీ ఏదో ఒక పరిష్కారం ఉంటుంది. కనీసం నీ సమస్యేంటో చెపితే సలహా ఇస్తాను"

"లేదు. ఎవళ్లూ ఏం చెయ్యలేరు. ఎంతో మంది ఎన్నో చెప్పారు. కానీ దేవుడా... నా జీవితం ఎట్లా?"

అతను తన సమస్య ఏంటో చెపుతాడని ఇందుకి నమ్మకం కలిగింది.

"ప్లీజ్, నాకు చెప్పు" అంది.

అతను నెత్తిమీద చేత్తో బాదుకున్నాడు.

"అయ్యో. అట్లా చెయ్యకు. సమస్యేంటో చెప్పవూ?" ఇందు మళ్ళీ అడిగింది.

"చూపించానుగా" అన్నాడతను విచారంగా.

"నాకర్థం కావటం లేదు"

అతను మళ్ళీ తలమీద కొట్టుకున్నాడు.

"ఇదే నా ప్రాబ్లం" అన్నాడు.

"అర్థం కాలేదు" ఇందు విచారంగా అంది. అతను రెండుసార్లు సైగచేసి చెప్పినా అర్థం కానందుకు బాధ, సిగ్గు కూడా కలిగాయి.

"ఇంకా అర్థం కాలేదా? నా నెత్తివైపు చూడండి. మీరొచ్చి నెల అవుతోంది. తేడా తెలియటం లేదా?" అతను అడిగాడు.

"లేదు. ఏమిటా తేడా?" ఆమె అడిగింది.

"ఇంకా ఏం చెప్పాలి. నా వెంట్రుకలు చూడండి. ఎలా రాలిపోతున్నాయో? ఘోరంగా రాలిపోతున్నాయి" అతను ఏడుస్తూ చెప్పాడు.

"జుట్టు రాలిపోతోందని ఏడుస్తున్నావా?" ఇందు నిర్ఘాంతపోయింది.

"ఏం? ఏడవకూడదా? ఎన్నో నూనెలు రాశాను. షాంపూలు మార్చాను. మందులు తీసుకున్నాను. డాక్టర్లు చెప్పినవన్నీ చేస్తున్నాను. అయినా రాలిపోతూనే ఉంది. మా నాన్నకీ, తాతకీ కూడా బట్టతల ఉంది. అటు అమ్మవైపు మామయ్యలకి కూడా ఉంది. నాకు తప్పకుండా బట్టతల వస్తుంది. అటో, ఇటో పోలిక వచ్చి తీరుతుంది. అయ్యో దేవుడా! మా వాళ్ళకి బట్టతల ఎందుకిచ్చావు?" అంజన్ ఏడుపు గొంతుతో అన్నాడు.

ఇందుకి అతడ్ని ఓదార్చే ధోరణిలో "భయపడకు. ఇప్పుడు బట్టతలకి చాలా మంచి ట్రీట్‌మెంట్ దొరుకుతోంది" చిన్నగా అంది.

"ఏం ట్రీట్‌మెంట్! నేను ఎన్నో క్లినిక్‌లకి వెళ్ళాను. ఎంతోమందికి చూపించాను. అయినా జుట్టు రాలటం తగ్గలేదు. ఏది దారి?"

"బాధపడకు. పోనీ హెయిర్ వీవింగ్‌కి వెళ్ళవచ్చు కదా?"

"అది సహజంగా ఉంటుందా? ఉండదు"

"అయినా కానీ, జుట్టు రాలటం కూడా అంత గొప్ప సమస్య అంటావా?" ఇందు అనేసింది.

జుట్టు రాలిపోతున్నదని ఏకంగా తలే తెగిపోతున్నట్లు అతను ఎందుకు బాధపడుతున్నాడో ఇందుకి అర్థం కాలేదు.

"నాకింకా పెళ్ళి కాలేదు. కనీసం గర్ల్ ఫ్రెండ్ కూడా లేదు. బట్టతల వస్తే నన్నెవరు ప్రేమిస్తారు? నన్నెవరు పెళ్ళి చేసుకుంటారు? అది పెద్ద సమస్య కాదా?" అంజన్ తీవ్రంగా అడిగాడు.

ఇందు జవాబు చెప్పలేదు. కానీ జుత్తు రాలిపోవటం ప్రపంచంలో ఇంకా ఎన్నో సమస్యలలాంటి తీవ్రమైన సమస్యా?

మౌనంగా సెక్షన్‌కి వచ్చింది. ఇంతవరకూ అంజన్ ప్రవర్తన చూస్తే ఒకలాంటి గౌరవం ఉండేది. అంత డబ్బున్నా క్రమశిక్షణతో ఉంటాడు. చెడు అలవాట్లు లేవు. తన భవిష్యత్తును చక్కగా మలచుకుంటున్నాడు. కానీ జుట్టు రాలిపోతోందని ఇలా ఏడుస్తాడని ఎన్నడూ ఊహించలేదు.

ఏది ఏమైనా అంజన్ తీవ్రంగా ఆవేదన చెందుతున్నాడన్నది మాత్రం స్పష్టం. ఎవరి బాధ వాళ్లకే తెలుస్తుంది. బయటివాళ్లు బయటనుంచి మాత్రమే చూస్తారు. ఎవరి కష్టం, సుఖం వారివే. బాధ తీవ్రత ఆ బాధ పడుతున్నవాడికే తెలుస్తుంది.

★ ★ ★

ఆ నెల జీతంలో షీనా మూడు వేలు తగ్గించింది. "రోజూ లేట్‌గా వస్తున్నావు. ఒక్కో లేట్‌కీ అర్థపూట కట్ చేస్తున్నాను" అంది.

ఇందు రోజూ టైమ్‌కే వస్తోంది.

"నేను రోజూ టైమ్‌కే వస్తున్నానుగా? "

"బుకాయించాలని చూడకు" అంది షీనా కఠినంగా.

ఇందుకి ఏడుపు వచ్చేసింది. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. షీనా ఇందు మొహం వైపు చూసింది. ఆ కన్నీళ్ళు చూసి అదో మాదిరి ఆనందం షీనా మొహంలో కదలాడింది. ఆమె పెదాలపై వెటకారపు చిరునవ్వు చూసి ఇందు బాధ రెట్టింపయింది.

★ ★ ★

అంజన్ దిగులుగా కూర్చున్నాడు. పరం అతనివైపు చూసి చిన్నగా నవ్వాడు. అంజన్‌కి ఆ నవ్వు చూసి కోపం వచ్చింది.

"నీకు నవ్వెందుకు వస్తోంది? " అడిగాడు.

"నీ దిగులు మొహం చూసి"

"నీకు అన్నీ ఉన్నాయి. నీలా ఉంటే నేనూ నవ్వేవాడ్ని" అన్నాడు అంజన్.

"సరే. నాకున్నవి నీకు లేనివీ ఏంటో? " అన్నాడు పరం.

"ముసలాడా? నీకు ఒత్తయిన జుట్టుంది" అన్నాడు అంజన్ ఒక్కోమాట ఒత్తి పలుకుతూ.

ఆ మాటలకి పరంకి బాధ, కోపం, ఏడుపు తన్నుకుని వచ్చాయి. అదీ ఇందు ముందు. అంజన్‌కి ఆ ఆఫీసులో ఉన్న స్థాయి మనసులో పెట్టుకుని, అదంతా దిగమింగుకున్నాడు.

"సంతోషంగా ఉండు. లేకుంటే జుట్టు ఇంకాస్త రాలిపోతుంది" అన్నాడు చిన్నగా.

అంజన్ లేచి వెళ్ళిపోయాడు.




**ఇం**దు దిగులుగా కూర్చుంది. షీనా ఎక్కడికో వెళ్ళింది. అంజన్ ఆఫీసుకి రాలేదు. ఇందుతప్ప సెక్షన్లో ఎవరూ లేరు.

ఇంతలో పరం ఆఫీసులోకి అడుగుపెట్టాడు. ఇందు ఒక్కత్తే ఉండటం చూసి అతనికి బ్రహ్మానందం కలిగింది. ఏదో బూతుపాట పాడుకుంటూ అటెండెన్స్ రిజిస్టర్‌లో సైన్ చేశాడు. ఇందువైపు తిరిగి కన్నుకొట్టాడు.

ఇందు హడలిపోయింది.

పరం నేరుగా వచ్చి ఇందు డెస్క్ ముందు నిలబడ్డాడు. కొన్ని క్షణాలు అట్లా

నిలబడి తన సీట్ దగ్గరికి పోయి కూర్చుని కంప్యూటర్ తెరిచాడు.

ఇందు 'హమ్మయ్య' అనుకుంది.

పరం తన కంప్యూటర్లో ఏదో చూస్తున్నాడు. షీనా ఇప్పుడప్పుడే రాదని రూఢీ అయిపోయినట్లుంది. లేచి గట్టిగా నవ్వాడు. ఇందు తలెత్తి చూసింది. అతను ఆమె తనవైపు చూడటం కోసమే వేచి ఉన్నట్లుంది.

"ఎందుకంత భయం? నేనేం భూతాన్ని కాదు. మనిద్దరం కొలీగ్స్. ఫ్రెండ్లీగా ఉండాలి" అన్నాడు.

అతను అట్లా స్నేహపూర్వకంగా మాట్లాడటం చూసి ఇందు ఆశ్చర్యపోయింది.

"రా.. రా.. నీకోటి చూపించాలి" అన్నాడు.

ఇందుకి భయం వేస్తోంది.

"రా.." పరం నవ్వాడు.

ఇందు అంగుళం కూడా కదల్లేదు.

"సరే, రావటం నీకిష్టం లేకపోతే నేనే వస్తానులే" అన్నాడు నవ్వుతూ.

ఇందు సీట్ దగ్గరకి వచ్చాడు.

సెల్ ఫోన్ తీసి చూపించాడు.

"చూడు, దీన్ని చూడు" ఇందు కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు. అదో సెక్సీఫోటో!

ఇందుకి భయంతో గుండె ఆగిపోయినంత పనయింది.

"చూడు, చూడు" అంటున్నాడు పరం. ఇందుకి శరీరం మొత్తం గడ్డకట్టిపోతోంది. భయంతో నోరు పెగలట్లేదు. అసహ్యం, కోపం, భయం ఆమెని కుదిపేస్తున్నాయి.

"నా కంప్యూటర్లో అయితే పెద్ద బొమ్మ ఉంటుంది" పరం నవ్వాడు. కోరిక నిండిన కళ్ళతో చూస్తున్నాడు.

"రా.. చూద్దాం" అన్నాడు.

ఇందుకి కొయ్యబారిన స్థితి పోయి, భయంకరమైన కోపం వచ్చింది. రక్తం మరిగిపోయింది. పెదవులు కోపంతో వణికిపోయాయి. పరంని కసితీరా తన్నాలనిపించింది. ఒక రాయి తీసి తల బద్దలుకొడదామనిపించింది. కత్తి తీసుకుని ముక్కలు ముక్కలుగా నరకాలనిపించింది. పరం మీదికి దూకి, జుట్టుపట్టి లాగి, చెంపలు ఛెళ్ళుమనాలనిపించింది. చెప్పు తీసుకుని కొడదామనిపించింది.

ఎన్ని చెయ్యాలనిపించినా, మెల్లగా తన అసహాయ స్థితి గుర్తుకువచ్చి కోపం మెల్ల మెల్లగా తగ్గిపోయింది.

ఆమెలో చెలరేగుతున్న అన్ని భావాల్నీ పరం గమనిస్తున్నాడు. చివరకు ఏ భావమూ లేకుండా మిగిలిపోవటం కూడా చూశాడు. అతని పెదవులు వంకర తిరిగాయి. విజయపూర్వకమైన నవ్వు ఒకటి అతని పెదవుల మీదికి వచ్చింది.

అతను చుట్టూ చూశాడు. ఎ. టూ సెక్షన్ మనిషి ఒకరు లోనికి వస్తూండటం చూశాడు. అంతే, క్షణాల మీద రంగులు మార్చాడు.

"సరే, అది తర్వాత డిస్కస్ చేద్దాం" అంటూ ఏదో ఆఫీసు పని గురించి చర్చిస్తున్నట్లు మొహం పెట్టి తన సీట్లోకి పోయి కూర్చున్నాడు.

తనక్కావాల్సిన ఫైల్ తీసుకుని, ఎ. టూ సెక్షన్ మనిషి వెళ్ళిపోయాడు.

ఇందు హడలిపోతోంది. ఎవరన్నా వస్తే బాగుండునని దేవుణ్ని ప్రార్థిస్తోంది.

అంతలో అంజన్ సెక్షన్‌లోకి వచ్చాడు.

★ ★ ★

"అక్కడ నేను పని చెయ్యలేను" ఇందు భర్తతో చెప్పింది.

"ఎందుకని? "

"కష్టంగా ఉంది"

"ఏమిటా కష్టం? ప్రతిదాంట్లోనూ కష్టాలుంటాయి"

"మా బాస్ ప్రతిదానికీ వంకలు పెడుతుంది. ఎంత పని చేసినా ఆవిడ్ని మెప్పిం

చలేం. అదీగాక అదోలా చూస్తుంది"

"బాస్ అంటే అట్లాగే ఉంటారు. అయినా ఆడదానివై ఉండి మరో స్త్రీతో ప్రాబ్లం అంటావేం? "

"అక్కడ పరం అని ఒకతను ఉన్నాడు. అతని ప్రవర్తన బాగుండదు" అంది.

"అంటే ఏం చేస్తాడు? "

ఇందు మౌనంగా ఉండిపోయింది. ఏం చెప్పాలి? పరం ఏం చేశాడు? తనని అనవసరంగా తాకాడు. తన శరీరం వైపు కాంక్షగా చూస్తాడు. కన్ను కొడతాడు. వెకిలి నవ్వు నవ్వుతాడు. ఎన్నో ఉన్నాయి. కానీ ఏ ఒక్కటీ చెప్పలేకపోయింది.

'నీ ప్రవర్తన బాగుంటే అంతా బాగానే ఉంటారు' అని, మామూలుగా ఏ భర్త అయినా అనే రీతిలో సమాధానమిస్తే?

ఇందు మౌనంగా ఉండిపోయింది.

హరీష్ ఆమెని మళ్ళీ అడగలేదు.

అతను వేరేలా అనుకున్నాడు. ఉద్యోగం అన్నది కొత్తల్లో కష్టంగానే ఉంటుంది. ఎవరైనా కాస్త చనువుగా మాట్లాడితే ఇందు అపార్థం చేసుకుని ఉంటుందనుకున్నాడు. అతని ఆఫీసులో కూడా అట్లాంటి అనవసర అపార్థాలు జరిగిన సంఘటనలు కొన్ని ఉన్నాయి.

హరీష్ కొలీగ్ రాబర్ట్‌కి ఈ మధ్య అట్లాగే జరిగింది. రాబర్ట్, ఇంకొక సహోద్యోగినీ ఒకే బిల్డింగ్‌లోని వాటాల్లో ఉంటున్నారు. ఆవిడ రాబర్ట్‌తో బాగానే మాట్లాడుతుండేది. ఇంతలో ఇద్దరి పిల్లలకీ చిన్న పోట్లాట జరిగి, ఆవిడ మాట్లాడటం మానేసింది. రాబర్ట్ విషయమేమిటో తెలుసుకుని, మళ్ళీ స్నేహపూర్వక వాతావరణం ఏర్పడాలనుకున్నాడు. ఆవిడ ఇంటి తలుపు తెరిచి ఉంది. తలుపు దగ్గర నిలబడి కాలింగ్‌బెల్ కొట్టాడు. అంతే! ఆవిడ ఇల్లె గిరిపోయేట్లు కేకలు పెట్టింది. చుట్టుపక్కలవాళ్ళంతా పోగయ్యారు. ఇంట్లోకి బలవంతంగా రాబోతున్నాడనీ, తనకి భయం వేస్తోందనీ ఆవిడ అందరికీ చెప్పింది. ఇరుగూ పొరుగూ అంతా రాబర్ట్‌ని బయటికి నెట్టి తిట్టిపోశారు. ఆ సంఘటన గుర్తుకొస్తే రాబర్ట్ ఇప్పటికీ వణుకుతాడు.

"ఆడవాళ్ళని నమ్మకూడదు. పిల్లలమధ్య చిన్న పోట్లాట జరిగితే, ఆవిడ నామీద పగ తీర్చుకుంది. నేనో వెర్రి వెధవని కాబట్టి ఆవిడకి నచ్చ చెబుదామని అక్కడికి వెళ్ళాను. చివరికి అక్కడ ఒక దుర్మార్గుడిలా నిలబడాల్సి వచ్చింది" అంటాడు.

ఇంకో స్నేహితుడికి మరో అనుభవం అయింది. అతను ఒకసారి సిటీ బస్సులో ప్రయాణం చేస్తున్నాడు. ఆ రూట్ జేబు

> **కొత్తగాలి...**
>
> **మొగ్గలపై**
> **మోయలేని భారం**
> **కొన్ని వాలిపోతూ..**
> **కొన్ని రాలిపోతూ..**
>
> *- కందేపి రాణీప్రసాద్*

దొంగలకి ప్రసిద్ధి. రెండుసార్లు అతని జేబు కొట్టేశారు కూడా. వాళ్ళు బస్సు వెనకవైపు నుంచి ఎక్కి, వెనకవైపు నుంచే దిగిపోతారని ఇతని నమ్మకం. అందుకే బస్సు మధ్యలో నిల్చున్నాడు. అతనిముందు ఇంకొక స్త్రీ నిల్చుని ఉంది. బస్సు కిక్కిరిసిపోయి ఉంది. బస్సు కదిలింది. ఏం జరిగిందో తెలీదు. హఠాత్తుగా అతనిముందు నిల్చున్న స్త్రీ వెనక్కు తిరిగి ఇతని చెంపలు టపటపా వాయించేసింది. ఆ తొక్కిడీ, తోపులాటల బస్సులో ఎవరో ఆవిడ్ని గిల్లినట్లున్నారు. అగ్నికి ఆజ్యం పోసినట్లు తోటి ప్రయాణికులంతా కిసుక్కున

నవ్వారు. హరీష్ మిత్రుడికి ఒళ్ళంతా చచ్చుబడినట్లు అయిపోయింది. కొయ్య బారి, చేష్టలుడిగి నిల్చున్నాడు.

"జేబు దొంగలతో పాటు నిల్చుంటే పర్సొకటే పోతుంది. కానీ ఆడవాళ్ళ పక్కన నిల్చుంటే అన్నీ పోతాయి" అని చెప్పుకుని బాధపడ్డాడు.

"ఏం చేస్తాం.. రూల్సన్నీ ఆడవాళ్ళకి అనుకూలంగా ఉంటాయి. మన కాలం కాదు" మరో మిత్రుడు ఓదార్చాడు.

హరీష్ ఇంకో మిత్రుడు శ్యామ్‌కి మరో చేదు అనుభవం ఎదురైంది. అతను మార్కెట్ దగ్గర నిలబడి, ఒక దుకాణం వైపు చూస్తున్నాడు. హఠాత్తుగా కాస్త దూరంలో నిలబడ్డ స్త్రీ కాస్తా ఒక్క దూకున అతని ముందుకి వాలి, తన చేతిలో ఉన్న గొడుగుతో అతడ్ని కొట్టేసింది. అసలు గొడుగు మొనతో అతని కన్ను కూడా పొడవబోయింది. గానీ, అతను తెలివిగా అవతలకి దూకి తప్పించేసుకున్నాడు.

'ఈ వెధవని చూడండి. నాకు కన్ను కొట్టాడు' అని చుట్టూ చేరినవాళ్ళకి చెప్పింది. అంతా కలసి అతన్ని తన్న బోయే లోపల అతను తనకున్న శక్తినంతా కాళ్లలోకి తెచ్చుకుని పరుగుతీశాడు.

'ఆడవాళ్ళు మగవాళ్ళని తొందరగా అపార్థం చేసుకుంటారు. మొగవాడనగానే వాళ్ళకి అత్యంత ప్రమాదకరమైన జీవిలా కనిపిస్తాడు. వాడిలో తన తండ్రినో, అన్ననో చూసేందుకు ప్రయత్నించరు. మగవాడిలో వాళ్ళకి గోచరించేది కేవలం అవకాశవాదం, శృంగారం మాత్రమే. మగ వాడూ ఒక మనిషేననీ, వాడికీ ఒక మంచితనం ఉంటుందని అనుకోరు. అందుకని మనమే వాళ్ళతో జాగ్రత్తగా వ్యవహరించాలి' ఇట్లాంటి సంభాషణలు మిత్రబృందంలో జరుగుతూనే ఉంటాయి.

అందుకే హరీష్‌కి ఇందు అనవసరంగా బాధ పడుతున్నట్లనిపించింది. తన స్నేహితుల అనుభవాలు ఇందుకి చెప్పాడు.

"నేను అతన్ని అనవసరంగా నిందించటంలేదు. బాగా చూశాకే చెప్తున్నాను. సెక్షన్లో ఇంకో ఇద్దరు ఉన్నారు. కానీ వాళ్ళు ఏ రోజన్నా రాకపోతే నాకక్కడ రక్షణ ఉన్నట్లు ఏమాత్రం అనిపించటం లేదు. అదీగాక మా బాస్ కూడా ప్రాణాలు తోడేస్తున్నది. ఆమె మనిషి కాదు, రక్తం తాగే పిశాచం. నా జీతం అనవసరంగా కట్ చేసింది. పిచ్చి కామెంట్స్ చేస్తుంది. నేను ఇక ఏమాత్రం భరించలేను" అంది ఇందు.

హరీష్ మెల్లగా మెత్తబడ్డాడు.

"సరే, ఇంకేం చేస్తాం? రిజైన్ చెయ్యి" అన్నాడు.

'జీతం కూడా కట్ చేస్తుంటే ఇంక చేసి కూడా ఏం లాభం? మరో ఉద్యోగం చూసుకోవచ్చు' అనుకున్నాడు.

ఆఫీసుకెళ్లాక "నేను రిజైన్ చేస్తున్నా" అంది ఇందు షీనాతో.

ఆవిడ కనుబొమలు ముడివేసి, క్రూరంగా చూస్తూ, "ఎందుకని? " అంది.

"నాకిక్కడ బాగా లేదు"

"ఏం కష్టం అనిపించింది ఇక్కడ? "

పరం అయితే మొహం పూర్తిగా ఇటే

## కొత్తగాలి...

**నేలమీద చీమలు**
**ఆకాశంలో పక్షులు**
**పయనిస్తాయి ఓ పద్ధతిగా**
**మనమేమో గుంపులుగా.. తలవంపులుగా**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

తిప్పేసి, ఆసక్తిగా వింటున్నాడు. ఇందు జవాబు చెప్పలేదు.

"అసలు మీలాంటి వాళ్లు ఉద్యోగాలకి ఎందుకొస్తారో అర్థంకాదు. నువ్వెప్పుడూ పని సరిగ్గా చేసిన పాపాన పోలేదు. నేను చేరినప్పుడు ఎలా ఉండేదాన్నో తెలుసా? తల కూడా ఎత్తేదాన్ని కాదు. పని చేస్తూనే ఉండేదాన్ని" షీనా డాంబికంగా..

"సంస్కృతంలో ఒక సామెత ఉంది" అంది ఇందు.

ఎట్లాగూ రిజైన్ చేస్తున్నప్పుడు ఇంకేంటి భయపడేది? అనుకుందామె.

"ఏంటది? " అంది షీనా అర్థం కాక.

"వృద్ధనారీ పతివ్రతాః"

"అంటే? " షీనా ఎర్రబడ్డ కళ్లతో అంది.

"అంటే ఎన్నో అర్థాలు తీయొచ్చు మీకు కావాల్సిన అర్థం వెతుక్కోండి" అంది ఇందు.

రజిత కంప్యూటర్‌లో ఏదో మహాశ్రద్ధగా చూస్తున్నట్లు నటిస్తోంది. పరం తన నవ్వుని దాచుకోవటంలో విజయవంతం అయి, మొహం గంభీరంగా పెట్టాడు.

"నా అకౌంట్ ఎప్పుడు సెటిల్ చేస్తారు? "

"పదిరోజులయ్యాక కనబడు"

"సరే" అనేసి వచ్చేసింది ఇందు.

మామూలుగానే ఎన్నో కట్స్‌పెట్టి సతాయించే షీనా, ఇంక రిజైన్ అంటే ఏం ఇస్తుంది? ఆ ఆఫీసుతో తనకి రుణం తీరిపోయింది అనుకుంది ఇందు. ఎంతో సంతోషంగా ఉందామెకు.

★ ★ ★

"అప్పులు తీర్చటానికి డబ్బులు పంపుకోవాలి. ఇటు చూస్తే రోజు రోజుకీ ధరలు పెరిగి పోతున్నాయి. ఒక్కళ్ల జీతంతో ఎట్లా బతకాలో అర్థం కావడం లేదు" రోజూ ఇందు భర్త గొణుక్కుంటున్నాడు.

ఇందు మౌనంగా ఉంటుంది. అతనికి ఏం చెప్పాలో ఆమెకి అర్థం కావటం లేదు. అతనికి ఆమె జీతం కావాలి. కానీ ఆమె ఉద్యోగం చేస్తుంటే ఎందులోనూ సహకరించిన పాపాన పోలేదు. ఇంటిపనీ, వంట పనీ, పసిపిల్ల పనీ అన్నీ ఆమె ఒక్కత్తే చూసుకోవాలి. అదంతా ఆమె పనే అని అతని అభిప్రాయం. ఆ పనులన్నీ చేసుకుని, కాలం మారింది కాబట్టి ఉద్యోగం కూడా చెయ్యాలని అనుకుంటాడు. స్త్రీకి ఉన్న అన్ని బాధ్యతలతోపాటు భర్తకి ఆర్థికంగా సాయపడాలనే బాధ్యత మారుతున్న కాలంతోపాటుగా వచ్చి చేరిందనుకుంటాడు.

మళ్లీ జాబ్ కన్సల్టెంట్‌ని కలిశారు.

"కాల్ సెంటర్లో అయితే తొందరగా దొరుకుతాయి. ఒక వారం ట్రైనింగ్ మేమే ఇప్పించి, చేర్పించుతాము. జీతం బాగానే ఉంటుంది. కానీ రాత్రిపూట డ్యూటీ చెయ్యాలి. మరి ఆలోచించుకోండి" అన్నాడు కన్సల్టెంట్.

"అమ్మో! రాత్రిపూట డ్యూటీనా? " అంది ఇందు.

"ఏం ఫర్వాలేదు. పగలు హాయిగా పడుకుని నిద్రపోవచ్చు కొన్నాళ్లయాక వాళ్లు పగలు డ్యూటీకి మారుస్తారు" భర్త తేలిగ్గా అన్నాడు.

"పనిలో నేను సాయం చేస్తానులే" అన్నాడు కూడా.

అది ఒట్టిమాట. ఎన్నడూ జరిగేది కాదు. తనే అన్ని పనులూ చేసుకుని, ఆపైన రాత్రిపూట డ్యూటీ కూడా చెయ్యాలి. ఇందు గుండె జల్లుమంది.

"తను చేరుతుంది. ట్రైనింగ్ ఎప్పట్నుంచో చెప్పండి" అన్నాడు హరీష్.

"ఇప్పట్నుంచే చేరవచ్చు" అన్నాడు కన్సల్టెంట్. అక్కడికి కాస్త దూరంలో ఉన్న ట్రైనింగ్ సెంటర్‌కి ఫోన్‌చేసి ఇందు గురించి చెప్పాడు.

"మాదే ట్రైనింగ్ సెంటర్. వెళ్లండి.

ఇదుగో ఈ కార్డు చూపించండి" అని అడ్మిషన్ కార్డు లాంటిది రాసిచ్చాడు.

వారం రోజుల ట్రైనింగ్ అయ్యాక, మరో వారం పోయాక ఇందుకి పోస్టింగ్ ఆర్డరు ఇచ్చాడు.

ఇందు భయంగానే దాన్ని అందుకుంది.

ట్రైనింగ్ వేరు, ఉద్యోగం చెయ్యటం వేరు. ట్రైనింగ్‌లో ఉచ్చారణలో తేడాలు, ఎవర్ని ఎట్లా డీల్ చెయ్యాలి లాంటివి మాత్రం చెపుతారు. కానీ రాత్రి నిద్రమానుకుని తెల్లవారిందాకా పని చెయ్యటానికి ఎవరికి వాళ్లే అడ్జస్ట్ కావాలి.

హరీష్ మాత్రం సంతోషంగా ఉన్నాడు. జీతం బాగా దొరుకుతుంది కాబట్టి.

రాత్రిపూట కూడా ఒకావిడ 'బేబీ కేర్ సెంటర్' నడుపుతోంది. పాపని అక్కడ దింపేందుకు మాట్లాడి వచ్చారు.

★ ★ ★

ఇందు కాల్ సెంటర్ ఉద్యోగంలో చేరిపోయింది. మొదటిరోజున పగలు నిద్రపోయి, సాయంత్రం లేచి వంట పూర్తిచేసి, స్నానంచేసి, తాను తినేసి, పాపకు పాలుపట్టి, బాస్కెట్ సర్ది, తయారయ్యేసరికి రాత్రి ఎనిమిదయింది. ఎనిమిదింటికల్లా కారువచ్చి ఇంటిముందు ఆగింది. పాపను తీసుకుని కార్లోకి ఎక్కుతున్న ఇందుని వెనుకసీట్లో కూర్చున్న అమ్మాయి 'హాయ్' అని పలకరించింది.

"నా పేరు లూసీ, నీ పేరు? " అంది.

"నా పేరు ఇందు"

"మీ పాపా? "

"అవును, దార్లోనే బేబీకేర్ సెంటర్ ఉంది. అక్కడ దింపాలి" చెప్పింది ఇందు.

కారు డ్రైవర్ స్పీడ్‌గా నడిపిస్తున్నాడు. ముందే చెప్పినట్లున్నారు. ఇందు అడగకముందే కేర్ సెంటర్ ముందు కారు ఆపాడు.

ఇందు పాపని దింపి వచ్చింది.

లూసీ బాగానే మాట్లాడుతోంది. రజిత లాగా కాకుండా ఆప్యాయంగా మాట్లాడుతున్నట్లనిపించింది ఇందుకి. అదేం ఆఫీసో, బాస్ ఎట్లాగో? అంతా అట్లాగే. ఒక్క అంజన్ తప్ప అంతా స్వార్థపరులే. ఈ కాల్ సెంటర్లో ఎట్లా ఉంటుందో?

"మీ వారు పాపని చూసుకోవచ్చుగా? " అంది లూసీ.

"ఆయనకి క్యాంప్‌లు ఉంటాయి. మళ్ళీ అప్పుడు ఎక్కడ ఉంచాలి? అందుకే కేర్ సెంటర్‌లో ఉంటే మంచిదనుకున్నాం"

"అంతేలే"

మాట్లాడుతూ ఉండగానే కాల్ సెంటర్ వచ్చేసింది. దార్లో మరొక అమ్మాయి కూడా ఎక్కింది.

అది పెద్ద బిల్డింగ్.

లూసీతో కలిసి లోపలకు అడుగు పెట్టింది ఇందు. లూసీ పక్కనే కూర్చోవాలన్నారు. ఇందుకి చాలా సంతోషం అనిపించింది. అటుపక్కన హార్డీ కూర్చుంటాడట. లూసీ, హార్డీ ఎవరిపేర్లూ వాళ్ళ సొంతపేర్లు కాదు. లూసీ పేరు లక్ష్మి, హార్డీ పేరు సురేష్. కానీ కస్టమర్లకి పలకటానికి తేలిగ్గా ఉండాలని ఇంగ్లీషు పేర్లు పెడతారట. ఇందు పేరు తేలిగ్గా ఉందని మార్చలేదట.

రెండు నిమిషాల్లో హార్డీకూడా వచ్చాడు. ఇందుని చూసి ఆప్యాయంగా నవ్వాడు.

★ ★ ★

మొదటిరోజునే ఆ ఉద్యోగం తనకి సూట్‌కాదని ఇందుకి అర్థమైపోయింది.

అక్కడి మనుషులు మంచివాళ్ళు. ఎవరి దారినవాళ్ళు పని చేసుకుంటారు. ఫ్రెండ్లీగా మాట్లాడతారు. షీనా ఆఫీసులో పనిచేసి వచ్చాక ఎవరికైనా ఇట్లాంటిచోట చెయ్యటం అదృష్టమనే అనిపిస్తుంది.

ముఖ్యంగా జీతం కూడా బాగుంది. కానీ నిద్రలేకుండా బతకటం ఇందువల్ల

కావటం లేదు.

అక్కడ పనిచేస్తున్న వాళ్ళల్లో పెళ్ళయిన వాళ్ళు ఎవరూ ఉన్నట్లు కనిపించలేదు. ముఖ్యంగా పిల్లల తల్లులు ఎవరూ లేరు. ఇంట్లో పనిచేసుకునే అవసరం ఎవరికీ ఉన్నట్లు కనిపించలేదు. వంట, ఇంటిపనీ, పసిపిల్ల పనీ.. ఇట్లాంటివి ఎవరికీ లేవు. హాయిగా ఇంట్లోవాళ్ళు వండిపెడితే తిని వచ్చేవాళ్ళూ, హాస్టల్‌లో ఉంటూ ఉద్యోగం చేసుకుంటున్నవాళ్ళే అందరూ. వాళ్ళకి తనలాగా బండచాకిరీ, బాదరబందీ లేవు.

'నచ్చినా, నచ్చకపోయినా ఈ ఉద్యోగం చేసి తీరాలి. అన్నీ నచ్చినట్లు కావాలంటే కుదరదు. ఈ ఉద్యోగంలో పనివేళలు తప్ప అన్నీ బాగున్నాయి. ఆ వేళలకి శరీరాన్ని అడ్జస్ట్ చేసుకుంటే సరిపోతుంది' అనుకుంది ఇందు.

నెల రోజులు గడిచిపోయాయి.

★ ★ ★

ఆ రోజు హార్దీ రాలేదు.

ఏమైందో అని అనుకుంటున్నారు.

అంతలో మెసేజ్ వచ్చింది. "హార్దీ ఆత్మహత్య చేసుకున్నాడు"

ఇందూ, లూసీ ఇద్దరూ షాకైపోయారు. అసలు ఏం జరిగిందో అర్థం కాలేదు.

తర్వాత మెల్లగా ఎవరో చెప్పారు.

హార్దీ భార్యకి పెళ్ళికి ముందు ఒకతనితో ప్రేమ వ్యవహారం ఉందిట. కానీ అతను చాలా గొప్ప కుటుంబానికి చెందిన వాడుట. వాళ్ళు పెళ్ళికి ఒప్పుకోలేదు. అంతస్తులు ఇద్దరి మధ్య అడ్డుగోడగా నిలిచాయి. చివరికి ఆమెకి హార్దీని చేసుకోవలసి వచ్చింది.

హార్దీ మృదువైన ప్రవర్తన, ప్రేమతో ఆమె మారిపోయింది. హార్దీకి తన భార్య పెళ్ళికి ముందు ఎవరినో ప్రేమించిందేమో అన్న అనుమానం కూడా రాలేదు. అంతగా ఆమె కలిసిపోయింది. అంత సహజంగా జీవించింది. వాళ్ళకి ఒక కొడుకు కూడా పుట్టాడు. సంతోషంగా సాగిపోతోంది. వాళ్ళ సంసారం, భార్యా కొడుకూ అంటే హార్దీకి ప్రాణంతో సమానం.

ఇంతలో ఆమె ప్రేమికుడి తండ్రి చనిపోయాడు. వ్యాపారం, వ్యవహారం అంతా ప్రేమికుడి చేతిలోకి వచ్చింది. అవన్నీ చక్కబెట్టుకుని, స్థిరపడ్డాక అతనికి తన పాత ప్రేమికురాలు గుర్తుకొచ్చింది. ఆమెకి ఫోన్ చేశాడు.

ఇదివరకు అన్ని దారులు మూసుకుపోయాక హార్దీభార్య అతన్ని మర్చిపోయింది. ఇప్పుడు అతనే తిరిగి ఫోన్ చేశాక పాత ప్రేమ, డ్రాకులా ప్రేతం తిరిగి లేచి వచ్చి

## డా. సంజీవదేవ్ చతురోక్తులు

ఆధునిక తెలుగు రచయితల్లో రసతత్వం మీద ఎక్కువగా రాస్తూ, ఉపన్యసిస్తూ సామాన్యుల్లోనూ లలితకళలపై అభిరుచిని పెంచేందుకు కృషిచేసిన అసాధారణ ప్రతిభాశాలి సంజీవదేవ్. ఆయన మాటల్లో, లేఖల్లో దొర్లిన చతురోక్తులు ఇవీ..

### నాదీ మీ దారే!



ఒక సోదరి సంజీవదేవ్‌తో 'నాకు అన్నలకంటే వదినలే ఎక్కువ ఇష్టం' అన్నారు.

దానికి సంజీవదేవ్ 'మరి నాకూ అంతే. చెల్లెళ్లకంటే బావమరుదులు ఎక్కువ ఇష్టం. అయితే ఇది మీ విషయంలో వర్తించదుగా! బావమరిది ఎక్కడ పుట్టి ఎక్కడ పెరుగుతున్నాడో మీకూ నాకూ కూడ తెలీదుగా! ఒకవేళ మీకు తెలుసునేమో మరి!! మీకు తెలిస్తే నాకు ఆయన అడ్రెస్ ఇవ్వండి. మీ గురించి ఆయనకొక ఉత్తరం రాస్తాను. మీకంటే ఆయన చాలా మంచివారయివుంటారు' అని హాస్యమాడారు. అప్పటికింకా ఆమెకు పెళ్లి కాలేదు మరి! దాంతో ఆమె సిగ్గులమొగ్గ అయింది.

నట్లు, మనసులో తిష్టవేసింది. పాత ప్రేమని పునరుద్ధరించుకున్నారు. మళ్ళీ సినిమాలు, షికార్లు తిరిగాక, పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని అనుకున్నారు. ఆమె కొడుకుని తనతో తెచ్చుకోవటానికి కూడా ప్రేమికుడు పెద్ద మనసుతో అంగీకరించాడు. విడాకులకి హార్డీ గనక ఒప్పుకోకపోతే, ఇంట్లోంచి వెళ్ళిపోయి ప్రేమికుడితో కలసి జీవించాలని ఆమె నిశ్చయించుకుంది. హార్డీకి తన నిర్ణయం చెప్పింది. హార్డీకి ఒక్కసారిగా ప్రపంచం తలకిందులైపోయినట్లు అనిపించింది. భార్య, పిల్లాడు అతనికి సర్వస్వం. వాళ్ళు లేకుండా బతకలేడు. భార్య తన నిర్ణయం మార్చుకోదు.

## కొత్తగాలి...

**ఎల్‌కేజీ టు పిజి**
**అక్షరాల కొనుగోలుకి**
**అక్షర లక్షలు**

– వి. భారతి,
భద్రాచలం

ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి?

అతనికొకటే పరిష్కారం కనిపించింది.

అదే ఆత్మహత్య.

వెంటనే గదిలోకి వెళ్ళిపోయి మౌనంగా కూర్చున్నాడు. 'నువ్వు విడాకులు ఇచ్చినా, ఇవ్వకపోయినా నేను మాత్రం అతనితోనే ఉంటాను' అని చెప్పేసి, భార్య పిల్లాడిని తీసుకుని వెళ్ళిపోయింది.

హార్డీ ఆమె వెళ్ళగానే తలుపులు వేసుకున్నాడు. హార్డీకి ఒక అన్నయ్య ఉన్నాడు. హైదరాబాద్‌లోనే ఉంటాడు. అతనికి ఫోన్ చేసి, ఏడుస్తూ జరిగిందంతా చెప్పి, తను ఆత్మహత్య చేసుకుంటున్నానని చెప్పాడు. అతను వణికిపోతూ, తను వస్తున్నానని చెప్పాడు. కానీ హార్డీ ఈ లోపలే ఫ్యాన్‌కి ఉరి పెట్టుకుని చచ్చిపోయాడు.

డ్యూటీ అయిపోగానే లూసీ, ఇందు ఇద్దరూ మరో కొంతమందితో కలిసి హాస్పిటల్‌కి వెళ్ళారు.

ఎప్పుడూ నవ్వుమొహంతో, అందర్నీ ఆప్యాయంగా పలకరిస్తూ తిరిగే హార్డీ శవమై మార్చురీలో ఉన్నాడు. దూరం నుంచి చూసి, మౌనంగా వెనుదిరిగారు.

ఇందుకి మనసంతా పాడయింది.

"హార్డీ ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి? అతని భార్య హాయిగా తన ప్రేమికుడ్ని పెళ్ళి చేసుకుని, సుఖంగా జీవిస్తుంది. అనవసరంగా హార్డీ తన జీవితం బలి చేసుకున్నాడు" అంది లూసీతో.

"అట్లా అనకు. సున్నితమైన మనసున్న వాళ్ళు ఇంట్లాంటివి భరించలేరు" అంది లూసీ.

ఇందుకి హార్డీభార్యని తల్చుకుంటే అసహ్యం, కోపం కలుగుతున్నాయి.

ఆ ప్రేమికుడి ఫోన్‌కాల్ అందుకున్న మొదటిసారే 'సారీ, నాకు పెళ్ళయిపోయింది కదా?' అని చెప్పేస్తే పోయేది. పెళ్లయ్యాక ఇంట్లాంటివి ఉంటే ఆ సంసారం మొత్తం పాడయిపోతుంది కదా! ఆమె ఎంత దుర్మార్గురాలు! 'ఎవరేమైపోతేనేం, నేను బాగుంటే చాలు' అనుకొనే స్వార్థపరురాలు. అయ్యో! హార్డీ!

ఇందు లోలోపలే కుమిలిపోయింది.

శవాన్ని చూడటానికి ఆఫీసు నుంచి ఇంకా కొంతమంది వచ్చారు. మరి కొంతమంది శ్మశానానికి దహన కార్యక్రమానికి వెళతామన్నారు.

ఇందు, లూసీ కార్లో వెనక్కు బయల్దేరారు. పాపని పికప్ చేసుకుని కారు బయల్దేరింది.

"కమలానగర్ దగ్గర ఆపు" ఇందు డ్రైవ

ర్‌కి చెప్పింది.

లూసీ ప్రశ్నార్థకంగా చూసింది.

"మా ఆంటీ ఢిల్లీనుంచి మొన్ననే ట్రాన్స్ ఫర్‌రై వచ్చింది. వాళ్ళిల్లు కమలా నగర్‌లో ఉంది. ఎటూ మా ఆయన ఊళ్ళోలేరు. కాసేపు అత్తయ్యతో మాట్లాడి రిలాక్స్ అవుతాను" అంది ఇందు.

అసలు నిన్ననే ఆలోచించుకొని బుట్ట సర్దుకుంది. పాపతో లూసీకి 'బై' చెప్పించి కారు దిగింది. పాపని, బాస్కెట్‌నీ మేనేజ్ చేస్తూ, మెల్లగా నడుస్తూ విమల ఇంటిగేట్ తెరచి లోనికెళ్ళింది ఇందు.

కాలింగ్‌బెల్ విని తలుపు తెరచిన విమల ఇందుని చూసి సంతోషించింది.

"రా రా" అంటూ ప్రేమగా ఆహ్వానిస్తూనే, ఇందు మొహం చూసి ఏదో జరిగిందని గ్రహించేసింది.

"ఏంటీ అలా ఉన్నావు? ఏం జరిగింది? ఒంట్లో బాగాలేదా? పాపని ఇట్లా ఇవ్వు" అంటూ పాపని చేతుల్లోకి తీసుకుంటూ, ప్రశ్నల వర్షం కురిపించింది.

ఇందు జవాబు చెప్పలేదు.

"పని ఒత్తిడి కాబోలు. రాత్రి డ్యూటీ అంటే ఎంత కష్టం" అంది విమల.

ఇందు మౌనంగా లోపలకు నడిచింది.

"ముందు నువ్వు నిద్రపో" అంది విమల.

పాప ఏడవటం మొదలు పెట్టింది. ఇందు విమలతోపాటు బెడ్‌రూమ్‌లోకి నడిచి పాపని పడుకోబెట్టింది. పాప నిద్ర పోగానే తనూ కళ్ళు మూసుకుంది. హార్దీ కళ్ళముందు కదిలాడు. మనసంతా కెలికినట్లు అయింది. కళ్ళనీళ్ళు తిరిగి, జలజలా బుగ్గల మీదకి రాలాయి. కళ్ళూ, మొహం తుడుచుకుని నిద్రకుపక్రమించింది.

ఇందు దాదాపు రెండు గంటల తర్వాత నిద్ర లేచింది. అప్పటికి విమల పాపకి స్నానం చేయించి, పాలు పట్టి ఉంచింది. వేడివేడి ఇడ్లీలూ, కాఫీ తయారుగా ఉన్నాయి. అవి తినేసి ఇందు మళ్ళీ నిద్ర పోయింది.

తర్వాత మళ్ళీ లేచేసరికి మధ్యాహ్నాం రెండయింది.

పాప విమలచేతుల్లో కేరింతలు కొడుతోంది.

విమల ఎవరితోనైనా చాలా ప్రేమగా ఉంటుంది. పిల్లలు ఆమె దగ్గర ఎంజాయ్ చేస్తారు. ఆడిస్తుంది. పాడిస్తుంది. విమల పిల్లలు పెద్దవాళ్ళైపోయి, అమెరికాలో ఉన్నారు. అన్ని విధాలా మంచిపేరు ఉంది విమలకి. మంచి భార్య, మంచి తల్లి, మంచి గృహిణి.

ఇందు తన బాస్కెట్‌లోంచి డ్రెస్ తీసుకుని వెళ్ళి, స్నానం చేసింది. విమల వేడివేడిగా వడ్డించిన భోజనం కడుపు నిండా తిన్నాక, ఇద్దరూ కబుర్లలో పడ్డారు. మూడున్నరకి టీ తాగారు.

"సరే. ఇప్పుడు చెప్పు. ఏం జరిగిందసలు? పొద్దున్న బాగా అలసిపోయి ఉన్నావని అడగలేదు. ఎందుకలా ఉన్నావు? " అడిగింది విమల.

"నా కొలీగ్ ఒకతను.." ఇందు హార్దీ కథ మొత్తం చెప్పింది.

"అట్లాంటి ఆడది ఉంటుందని అసలు మనం ఊహించగలమా? అసలు పెళ్ళయ్యాక ఇట్లా మరో మగాడితో సంబంధం ఏర్పరచుకోవటానికి మనసెలా ఒప్పుతోందో? " ఇందు తిట్టేసింది.

విమల మౌనంగా ఉంది.

"పెళ్ళంటే నూరేళ్ళబంధం కదా? ఇట్లాంటి సంబంధాలు ఎట్లా పెట్టుకుంటారో? కనీసం వేశ్య అంటే డబ్బుకి ఆశించి చేస్తుందేమో? వీళ్ళు శారీరక సుఖాన్ని ఆశించి చేస్తున్నారు. కాబట్టి వేశ్యకన్నా హీనం" అంది ఇందు కోపంగా.

విమల మొహం నల్లబడి, ఆ తర్వాత

ఎర్రగా మారి, తర్వాత పాలిపోయింది. ఇంటి కప్పువైపు తదేకంగా చూస్తోంది. హఠాత్తుగా వెక్కివెక్కి ఏడ్వనారంభించింది.

"అత్తా! ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నావు? " ఇందుకి ఏదీ అర్థం కాక తెల్లబోతూ అడిగింది.

విమల వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది. చేతుల్లో మొహం కప్పుకుని ఏడుస్తోంది. తర్వాత తలెత్తి ఇందువైపు చూసింది.

"నా మాట కాస్త వింటావా? " అడిగింది విమల. ఆ గొంతు ఎక్కడో నూతిలోంచి పలుకుతోంది.

"ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నావు? " ఇందు అయోమయంలోంచి తేరుకోలేదు. హార్దీ ఎవరో విమలకి తెలియదు. అతను పోయాడని ఇంత బాధ పడ్తోందా?

"ఇందూ! నా మీద నీ అభిప్రాయం ఏంటి? " అడిగింది విమల.

అర్థంలేని ప్రశ్న. విమలత్త మీద ఎవరి అభిప్రాయం అయినా ఒకటే. చాలా మంచి మనిషని. ఒక ఆదర్శ గృహిణి అని. ఇది వరకు మామయ్య విమలత్తని చాలా కాల్చుకుని తినేవాడుట. అన్నీ తట్టుకుని, ఓర్చుకుని, మౌనంగా భరించి సంసారాన్ని చక్కదిద్దుకుందని అంతా ఎంతో అభిమానిస్తారు.

"నేనెట్లాంటి దాన్ననుకుంటున్నావు? " విమల అడిగింది.

"నిన్ను గురించి ఎవరైనా ఒకటే అనుకుంటారు, ఒక ఆదర్శ గృహిణి అని" అంది ఇందు.

విమల కన్నీళ్ళు తుడుచుకుంది.

"అంతే. అంతా అదే అనుకుంటారు. కానీ నాకు ఒక పరాయి మొగాడితో సంబంధం ఉందనీ, నేను అతని కోసం పరితపించి పోయాననీ ఎవరన్నా అనుకుంటారా? " విమల అడిగింది.

ఇందు నిర్ఘాంతపోయింది. కొయ్యబారిపోయింది. మాటలుడిగి పోయి, విమల మొహం వైపే చూస్తూండిపోయింది.

"అవును ఇందూ, అప్పుడు నాకు ముప్ఫై ఏళ్ళు. నాకు పెళ్ళయి పదేళ్ళు దాటి ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. మీకందరికీ తెలుసుగా. మీ మామయ్య నన్ను కాల్చుకుని తినేవాడు. ఆయన ఎన్నడూ నాతో సరిగ్గా మాట్లాడింది కూడా లేదు. తిట్లూ, తన్నులూ సరేసరి. పిల్లల కోసం అంతా భరించినా, నాలో నేను కుమిలిపోయే దాన్ని. నాకు భర్త అందించే మమతాను రాగాలంటే ఏమిటో బొత్తిగా తెలియవు. పిల్లలు పెరుగుతున్నారు. నెమ్మదిగా నేను ప్రేమకోసం నాకు తెలియకుండానే అర్రులు చాచటం మొదలు పెట్టాను. రెండువాటాల ఇంట్లో ఉండే వాళ్ళం. ఇంతలో మా ఇంటి పక్కకు ఇంకో కుటుంబం వచ్చి చేరింది. ఆ భార్యాభర్తా ఎంతో ప్రేమగా ఒకళ్ళకోసం ఒకరు అన్నట్లుండేవారు. వాళ్ళు అంత ప్రేమగా ఉండటం చూసినప్పుడల్లా నాకు తెలియకుండానే మనసులో ఏదో బాధ! వాళ్ళు మంచి భార్యాభర్తలే కాదు, మంచి పొరుగువాళ్ళు కూడా. మాతో చనువుగా, ప్రేమగా ఉండేవాళ్ళు. ఆ భార్యాభర్తల అనుబంధం చూసి, ఏం పోగొట్టుకున్నానో నాకు స్పష్టంగా అర్థమయింది. ఆమెని నేను ఎన్నడూ ద్వేషించలేదు గానీ, నాక్కూడా అట్లాంటి జీవితం ఉంటే బాగుండుననిపించేది.

అతను చాలా మంచివాడు. మర్యాదస్తుడు. ఆయన నేనంటే అభిమానం చూపించేవాడు. మా రెండు కుటుంబాలూ పక్కపక్కనే కాబట్టి ఆయనకు నా పరిస్థితి తెలుసు. నన్ను చూసి జాలి పడేవాడు. ఎన్నోసార్లు సానుభూతి నిండిన అతని కళ్ళు నన్ను కరిగించేస్తూండేవి. గట్టిగా ఏడ్చెయ్యాలనిపించేది. నేను ప్రేమ, ఆప్యా

యతల కోసం ఎంత తహతహలాడుతు న్నానో అతనికి చెప్పాలనిపించేది. నిజానికి నేనేమీ చెప్పాల్సిన అవసరం లేదు. ఎందు కంటే అతనికి అన్నీ తెలుసు.

ఇట్లా కొంతకాలం గడిచింది..." విమల ఊపిరి తీసుకోవటానికి కాబోలు ఆగింది.

ఇందు శ్రద్ధగా వింటోంది. ఒక అపరి చిత విమల ఆమె ముందు ఆవిష్కృతమై భయపెడుతోంది.

ఆ తర్వాత ఏం జరిగింది?

"ఆ తర్వాత నాలో అనూహ్యమైన మార్పు వచ్చింది. అతను నావైపు చూసిన పుడల్లా నామీద, నా సహనంమీద పొగడ్త తోపాటు నా అందాన్ని చూసి ఒక ఆరా ధనా భావం కదలాడటం గమనించాను. నేను మంచి బట్టలు, అలంకరణతో ఉంటే అతను సంతోషంగా కనిపించేవాడు.

అతడ్ని ఆనందంగా చూడాలనిపించేది.

'నిన్నెప్పుడూ సంతోషంగా చూడాలనిపి స్తుంది' అనేవాడు అతను. సంతోషంగా ఉండటం ఎట్లాగో నాకు తెలియదు. నాకు సంతోషం కలిగించేది కేవలం అతని సమక్షం మాత్రమే. అతను నావైపు ఆరా ధనగా చూసే చూపులు ఆనందాన్నిచ్చేవి.

ఒకరోజు మీ మామయ్య నన్ను అనవ సరంగా గట్టిగా అరుస్తూ తిట్టి, చెంపమీద ఒక్కటి కొట్టి వెళ్ళిపోయారు. అప్పుడు మా పొరుగింటావిడ ఎక్కడికో వెళ్ళింది. మామయ్య బయటకి వెళ్ళిపోగానే అతను మా ఇంట్లోకి వచ్చాడు. నా కన్నీళ్ళు తుడి చాడు. నాకంతవరకూ ఓదార్పు అంటే ఏమిటో తెలియదు. అతను అంత దగ్గ రగా నిలబడి నా కన్నీళ్ళు తుడిచి, జాలిగా నావైపు చూస్తుంటే నా మనసు, శరీరం, మెదడూ అన్నీ అదుపు తప్పిపోయాయి. అతన్ని గట్టిగా కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చేశాను. అతను నావీపు నిమిరి, కన్నీళ్ళు తుడిచి మౌనంగా వెళ్ళిపోయాడు. ఆ క్షణంలో అతను నన్ను తేలిగ్గా లొంగదీసు కుని ఉండేవాడు. కానీ అట్లా చెయ్యలేదు.

అతని స్పర్శ, అతని ఓదార్పు, అతని ఆప్యాయతా, ప్రేమ నిండిన కళ్లు నాలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చాయి. ఆ స్పర్శ మృదువుగా చాలా బాగుంది. ఆ లాలింపు, ఆ ఓదార్పు, ఆ అందమైన చిరు నవ్వు కోసం నేను పరితపించి పోయాను. అతన్ని సొంతం చేసుకోవాలని తహత హలాడిపోయాను. అతనితో మాట్లాడటం పెంచాను. నెమ్మదిగా ఆ సంతోషం నా మనసంతా నిండిపోతోంది. అతన్ని ప్రేమి స్తున్నాననీ, అతనికోసం తహతహలాడి పోతున్నాననీ నాకు అప్పటికి బాగా అర్థ మైంది. కాస్త ఆలస్యంగా నా జీవితంలో అడుగుపెట్టిన ప్రేమ నన్ను కుదిపేసింది. నాకింకేం తెలియలేదు. ఏమీ అక్కర్లేదు కూడా. నాకప్పుడు ఒక్కటే తెలుసు. ఎట్లా గైనా అతడ్ని పొందాలి. అంతే! అతను నాక్కావాలి.

అతను తన భార్యని ఎంత ప్రేమిస్తాడో తెలుసు. వాళ్ళ ప్రేమ సరాగాల్ని ఊహిం చుకున్నాను కూడా. ఆ మృదువైన అతను ఆమెనెంత అలరిస్తాడో అనిపించేది. ఆ అనుభవం నాకూ కావాలనిపించేది. అది క్షణికమేనని తెలుసు. నా జీవితం నాశన మైపోతుందని కూడా తెలుసు. పోనీ, ఏదన్నా కానీ, ఏమైతే అవనీ, దేనికోసమూ లెక్కచేయని తెగింపు నాలో ప్రవేశించింది. ఒక్కసారన్నా ఆ ఆనందం పొంది తీరాల నిపించింది. ఆ తర్వాత ఆ ఆనందాన్నీ, తృప్తినీ గుండెల్లో కలకాలం దాచుకుని, ఆ జ్ఞాపకాల్లోనే బతికెయ్యగలననిపించింది. ఆ కోరిక రోజురోజుకీ పెరిగిపోతోంది. అతనంటే ప్రేమా, భక్తి కూడా అట్లాగే పెరిగిపోతున్నాయి.

ఒకసారి అతనితో నా మనసు విప్పి చెప్పేశాను. అతను అదిరిపడ్డాడు. బాంబు

పడ్డట్లు బెదిరిపోయాడు. నిర్ద్వందంగా తిరస్కరించాడు. నేను వినలేదు.

నామీద కరుణ, ప్రేమా చూపిన కారుణ్య చక్రవర్తి, ప్రేమమూర్తి, ఎండిన ఎడారిలాంటి నా జీవితంలో ప్రేమ కురిపించిన మహావ్యక్తి, అతనికి నన్ను నేను సమర్పించుకోవాలని చెప్పాను.

అతనితో ఒకసారి పొందిన ఆ అనుభవం అద్భుతం. ఈనాటికీ నేను బల్లగుద్ది చెప్పగలను. ఆ అనుభవం నా జీవితంలోనే ఆనందకరమైనదనీ.

నా మొహం ఆనందంతో అదో మాదిరిగా వెలగటం ప్రారంభించింది. ప్రేమ నా మొహానికి వింతకాంతినీ, నా మనసుకి తృప్తినీ ఇచ్చింది. ఒకే ఇంట్లో రెండు వాటాలు కావటంవల్ల బయట ఎవ్వరికీ మాగురించి తెలియలేదు.

ఆనందకరంగా సాగిపోతున్న మా ఆ జీవితానికి హఠాత్తుగా బ్రేక్ పడింది.

అతనికి ఢిల్లీకి ట్రాన్స్‌ఫర్ అయింది.

నేను భరించలేకపోయాను. వెక్కి వెక్కి ఏడ్చాను. నా పిల్లల్నీ, సంసారాన్నీ అన్నిటినీ వదిలి అతనితో వచ్చేస్తానన్నాను.

అతను మెల్లగా నచ్చ చెప్పాడు. "మనకు ఎవరి బాధ్యతలు వాళ్ళకున్నాయి. ఎవరి బంధాలు వాళ్ళకున్నాయి. ఎవరి కర్తవ్యం వాళ్ళు నెరవేర్చకపోతే మన రెండు కుటుంబాలూ ఒక్కసారిగా తల్లకిందులైపోతాయి. ఈ ప్రపంచాన్ని ధిక్కరించే ధైర్యం మనకు లేదు"

నేను మౌనంగా వింటున్నాను. అతను పొడిగించాడు. "నేను నిన్ను ఈ ప్రపంచంలోని అన్నిటికన్నా మిన్నగా ప్రేమిస్తున్నాను. నీ జ్ఞాపకాల్ని మధుర స్మృతులుగా నా గుండెలోపల దాచుకుంటాను. ఏం చేస్తాం. మనకు ఇంతే ప్రాప్తం" అతని కళ్ళల్లోంచి నీళ్ళు కారాయి.

నేను కూడా ఏడుస్తూ తల ఊపాను.

వాళ్ళు ఢిల్లీ వెళ్ళిపోయారు.

## అక్కడే ఎందుకుండాలి?

ఒకసారి ఊరికెళుతున్న తన సోదరి భారతిగారికి కాలువకట్ట వరకూ వెళ్లి వీడ్కోలు ఇచ్చారు సంజీవదేవ్, తన పెద్దకొడుకు జోగేంద్రతో సహా. తిరిగి వచ్చేటప్పుడు బాధతో జోగేంద్ర తండ్రిని ప్రశ్నలతో ముంచెత్తాడు.

**జోగేంద్ర:** ఎందుకు నాన్నా గుంటూరు అత్తయ్య ఇక్కడ ఉండకుండా వెళ్లింది?

**సంజీవదేవ్:** గుంటూరు మామయ్య వచ్చి తీసుకెళ్లేరు కనుక.



**జోగేంద్ర:** మన అత్తయ్యను గుంటూరు మామయ్య ఎందుకు తీసుకెళ్లాలి? మన అత్తయ్య మనకే ఉండాలి! గుంటూరు మామయకూ అత్తయ్య చుట్టమేనా?

**సంజీవదేవ్:** అవును, చుట్టమే. కాని దూరపు చుట్టం.

**జోగేంద్ర:** అయితే, అత్తయ్య గుంటూరు మామయ్య ఇంటివద్దనే ఎందుకుండాలేం?

**సంజీవదేవ్:** అత్తయ్య ఇంకెవరి ఇళ్ల దగ్గరా ఉండటానికి ఇష్టపడక గుంటూరు మామయ్య దగ్గర ఉండటానికే ఇష్టపడటం చేత అక్కడే ఆమె కొంతకాలం బట్టీ ఉంటూన్నది. అంతేకాకుండా వారూ ఉండనిస్తున్నారు. వారు ఉండనిచ్చినన్నాళ్లూ ఆమె అక్కడే ఉంటుంది. ఆమె అక్కడ ఉన్ననాళ్లూ వారు ఉండనిస్తారు.

తన సహజ హాస్యస్ఫూర్తితో సంజీవదేవ్ కొడుక్కు జవాబిచ్చారు.

నా జీవితం శూన్యమైపోయింది. మోడులా మిగిలాను. అయినా బతికాను, నా పిల్లల కోసం! అతన్ని మర్చిపోవటానికి ప్రయత్నించాను, మర్చిపోలేకపోయాను. కానీ అతను లేకుండా, అతడ్ని చూడకుండా బతకగలగటం మాత్రం నేర్చుకున్నాను. జీవంలేని జీవితం జీవించగలిగాను.

కాలం గడిచిపోయింది. పిల్లలు పెద్దవా

ళ్ళయ్యారు. కాలంతోపాటు మా ఆయనా మారారు. కొన్ని ఏళ్ళు గడిచిపోయాయి.

ఇంతలో నాకో భయంకరమైన నిజం తెలిసింది. అదేంటో తెలుసా? అతనికి ఆడవాళ్ళ పిచ్చి ఉంది. స్త్రీల బలహీనతలు తెలుసు. కానీ తొందరపడడు. ఒక వేట గాడు సహనంతో వేచి ఉన్నట్లు, అతని వలలో ఎవరన్నా స్త్రీ పడిందాకా వేచి ఉంటాడు. ఉచ్చు బిగించటానికి కావల్సిన వన్నీ నేర్పుగా చేస్తాడు. కానీ తను ముందుకి రాడు. స్త్రీ తనకు తాను అర్పణ చేసుకునేటట్లు చేస్తాడు. ప్రేమ, సాను భూతి, ఆదరణ కురిపిస్తాడు. ఆమెని ఆక ర్షిస్తాడు. చాలా తెలివైన పచ్చి మోసగాడు. అయ్యో.. నేను.. మా ఆయన నాకు అన్యాయం చేస్తున్నాడనీ, నేను ఆయనకి తగిన శాస్తి చేస్తున్నాననీ అనుకుంటూ, వెర్రితనంతో ఒక దుర్మార్గుడికి నన్ను నేను సమర్పించుకున్నాను" విమల మళ్ళీ గట్టిగా ఏడ్చింది.

"మర్చిపో అత్తా! అదంతా ఎప్పుడో జరి గిపోయిందిగా, మర్చిపో" అంది ఇందు.

విమల హఠాత్తుగా తలెత్తింది. ఆమె మొహం ఉబ్బిపోయి ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

"మర్చిపోలేను. పాపం చెయ్యటం తేలిక. కానీ అపరాధభావం జీవితాంతం మనల్ని వెంటాడుతుంది. నా పాపాన్ని ఏదీ కడిగెయ్యలేదనే భయం నన్ను చిత్ర వధ చేస్తోంది. నరకంలో నన్ను నూనె బాండీలో వేయిస్తారేమోననే భయం కాల్చేస్తోంది. రోజురోజుకీ భయం పెరుగు తోంది" విమల ఏడ్చింది.

ఇందుకి ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఎట్లా విమలని ఓదార్చాలి?

"నేను బతికున్న శవాన్ని. మనస్సాక్షిని చంపుకున్నవాళ్ళు మాత్రమే పాపాలు చేసి కూడా ధైర్యంగా బతకగలరు. మిగతా వాళ్ళు చస్తూ బతుకుతారు. చేసేటప్పుడు ఏం చేస్తున్నామో అవగాహన కూడా ఉండదు. అంతా ఒక యాక్సిడెంట్‌లా జరి గిపోతుంది. అక్రమ సంబంధాలవల్ల కలిగే మత్తు దిగిపోయేసరికి సర్వనాశనం జరిగిపోతుంది" అంది విమల.

ఇందు మౌనంగా వింటోంది.

"న్యాయమార్గంలో, ధర్మమార్గంలో పొందిన ఆనందం మాత్రమే కలకాలం నిలబడుతుంది. తుచ్ఛ మార్గాలవల్ల పొందే ఆనందానికి ఏదో ఒకనాడు మూల్యం చెల్లించుకోకతప్పదు. తర్వాత ఏడ్చి మొత్తుకునేకన్నా, అవి అసలు జరగ కుండా చూసుకోవటం చాలా ముఖ్యం" అంది విమల.

ఇందు తల ఊపింది. విమల తన ముందు అన్నీ చెప్పేసుకోవటంతో ఇందుకి సిగ్గుగా ఉంది. ఇట్లాంటి ఇబ్బందికర స్థితి లోకి వెళ్ళినందుకు తనను తాను నిందిం చుకుంది.

కానీ విమల మాత్రం కొంచెం తేటగా కనిపిస్తోంది. "నా భావ సంఘర్షణనీ, బాధనీ ఇన్నాళ్ళూ నా గుండెలోనే దాచు కుని నలిగిపోయాను. ఇప్పుడు నీతో పంచుకున్నాక నా మనసు తేలికపడింది. అందుకే కాబోలు చేసిన పాపం చెపితే పోతుందంటారు" అంది విమల.

ఇందు తలూపింది.

"ఇందూ! ఇప్పుడు చెప్పు. నన్ను ఇదివ రకటిలా అభిమానించగలవా? " విమల అడిగింది.

ఇందు మౌనంగా తలాడించింది. కానీ లోపల ఎక్కడో విమల మీద కాస్త అగౌ రవం కలిగింది. ఎంతైనా దాంపత్య జీవి తానికి అత్యంత ప్రాముఖ్యాన్నీ, పవిత్రతనీ ఇస్తారు ఎవరైనా.

★ ★ ★

మర్నాడు ఇందు కాల్ సెంటర్‌కి వెళ్లేస

రికి తన పక్కసీట్‌లో ఒకతను కూర్చుని ఉన్నాడు.

"హాయ్, నా పేరు హేలీ" అన్నాడతను.

"నా పేరు ఇందు" చిరునవ్వు నవ్వింది.

"నా పేరు హరినారాయణ్, ఇక్కడి పేరు హేలీ. సరే, మీ అసలు పేరేంటి? "

"పలకటానికి తేలిగ్గానే ఉందని కాబోలు నా పేరు మార్చలేదు. ఇందూనే"

"బాగుంది" అతను ఇంతలో ఏదో కాల్ రావడంతో దాన్ని అటెండ్ చేశాడు.

రెండు గంటలు గడిచేసరికి హేలీ చాలా జాలీగా ఉంటాడనీ, అదే సమయంలో చాలా మర్యాదగా కూడా ఉంటాడనీ, అందరితో చక్కగా కలసిపోతాడని గ్రహిం చేసింది ఇందు. అతను ఇందుతో వ్యవహ రించే తీరు చాలా బాగుంది. ప్రేమ, మర్యాద కలబోసి దాన్ని సరదా మాట లతో తీర్చిదిద్దిన అతని ప్రవర్తన చూసి ఇందు మనసు తేలికపడింది. పరం ప్రవ ర్తన చూశాక ఏ మగాడ్ని చూసినా భయం వేసేది. మగవాళ్లలోనూ మంచివాళ్ళుం టారు. కానీ పరంలాంటివాళ్ళ వల్ల మొత్తం మగజాతికే చెడ్డపేరు!

ఆ రోజు డ్యూటీ పూర్తయ్యాక ఇందు, హేలీ ఇద్దరూ ఒకే క్యాబ్‌లో ఎక్కారు. కార్లో ఇంకో ఇద్దరు ఉన్నారు. హేలీ అంద రితో హాయిగా మాట్లాడేస్తున్నాడు. ఇందుకి సమయం తొందరగా గడిచిపోతు న్నట్లనిపించింది.

కారు బేబీకేర్ సెంటర్ దగ్గర ఆగింది. ఇందు వేగంగా దిగిపోయి, పాపను తీసు కుని వచ్చింది.

"ఎవరీ పాప? " హేలీ అడిగాడు.

"నా కూతురు" ఇందు చెప్పింది.

"ఆ!" అతను ఆశ్చర్యపోయాడు.

"ఎందుకంత ఆశ్చర్యం? "

"ఎందుకో.. మీకు పెళ్ళయిందనుకో లేదు. పెళ్లికాని అమ్మాయిలాగానే ఉన్నారు" అన్నాడు హేలీ.

కార్లో ఉన్న వేరేవాళ్లు కూడా అవున న్నారు.

ఇందుకి కొద్దిగా సిగ్గుగా అనిపించినా చాలా ఆనందం కలిగింది. 'పెళ్లయి, పాప కూడా ఉన్నా నువ్వింకా పెళ్లేకాని కన్యలా ఉన్నావు' అనే పొగడ్త ఏ స్త్రీకైనా చాలా ఆనందాన్ని ఇస్తుంది.

"మీకు అమాయకత్వం, పసితనం పోనట్లే ఉంది" అన్నాడతను.

"థాంక్యూ" అంది ఇందు.

"ఇక్కడ అంతా ఒకళ్ళనొకళ్ళు నువ్వ అనే పిల్చుకుంటారు"

"నన్ను పిలిస్తే నాకేం అభ్యంతరం లేదు" అంది ఇందు.

"సరే" అన్నాడతను.

ఇందు కిటికీలోంచి బయటకు చూస్తోంది. హఠాత్తుగా అతనివైపు తిరి గింది. అతను ఎటో చూస్తున్నవాడల్లా ఆమె తనవైపు తిరగటం చూసి, ఆమెవైపు చూశాడు. అతని కళ్ళు స్వచ్ఛంగా, నిర్మ లంగా ఉన్నాయి.

"నీకు పెళ్ళయిందా? " అడిగింది ఇందు.

"అయింది. నాకొక బాబు కూడా ఉన్నాడు" అన్నాడతను.

ఈసారి ఆశ్చర్యపోవటం ఇందు వంత యింది. స్త్రీకి జరిగినట్లు శారీరక మార్పులు

**కొత్తగాలి...**

చెట్లు
హృదయాలను
చల్లబరిచే
హిమాలయాలు

– సిరి, పెద్దచెల్మెడ,
మెదక్ జిల్లా

పురుషుడిలో కనిపించవు. కానీ ప్రవర్తనలో కాస్త మార్పు కనిపిస్తుంది.

"ఎందుకు ఆశ్చర్యం? "

"నువ్వు చురుగ్గా ఉన్నావు. పెళ్లికాని కుర్రాడిలా అనిపించింది"

అతను గట్టిగా నవ్వాడు.

"ఆడదానివై ఉండీ, పెళ్ళి మగాడిలో చురుకుదనాన్ని చంపేస్తుందని అంటావా? " అన్నాడు.

ఇందు కూడా నవ్వేసింది. పాప తలెత్తి తల్లివైపు చూస్తోంది.

"నేను ఎత్తుకుంటాను" అన్నాడతను.

ఇందు పాపని అందించింది. అతను పాపవైపు చూస్తూ చిన్నగా నవ్వాడు. ఆ కళ్ళల్లో లాలన, ఆప్యాయత కనిపిస్తు న్నాయి. పాప అతని ఒడిలో కూర్చుని ఆడుకుంటోంది.

పిల్లలు స్పర్శని బట్టి అవతలవాళ్ళకి తమ మీద ప్రేముందో లేదో గ్రహించగల రంటారు. పాప కొత్తనేది లేకుండా అతని దగ్గరకి వెళ్ళిపోయి ఆడుకుంటుంటే, ఇందుకి అదే అనిపించింది.

★ ★ ★

టీ బ్రేక్ టైమ్ అది.

ఇందు మెట్లు ఎక్కుతోంది. పైన క్యాంటీన్ ఉంది. అన్ని అంతస్తులవాళ్ళు అక్కడ చేరుతారు.

షీలా ఎదురుగా వస్తూ కనిపించింది. షీలా వేరే అంతస్తులో పనిచేస్తోంది. మనిషి చాలా టిప్‌టాప్‌గా ఉంటుంది. కత్తిరించిన జుట్టు, లిప్‌స్టిక్‌లూ, బుగ్గలకి రంగులూ, అధునాతన అలంకరణ అక్కడి అమ్మాయిలందరికీ సామాన్యమే. కానీ షీలా సినిమా స్టార్‌లా తయారైవస్తుంది. విపరీతమైన మేకప్, శరీరాన్నంతా ప్రద ర్శించే వస్త్రధారణ, చూడగానే కళ్ళు తిప్పుకో లేనట్లు ఉంటుంది. ఆమెతో ఇందుకు పరి చయం లేదు. కానీ పలకరింపుగా నవ్వు తుంది, అంతే.

"హాయ్" అంది ఇందు.

షీలా బదులు చెప్పలేదు. తల ఎగరేసి వెళ్లిపోయింది. ఇందుకి చాలా అవమా నంగా అనిపించింది. షీలా ఎందుకలా చూసింది? అర్థం కాలేదు.

మర్నాడు కూడా అట్లాగే జరిగింది. షీలా మరో నలుగురు అమ్మాయిలతో క లిసి ఇందుకి ఎదురువచ్చింది. అంతా షీలా లెవల్లో లేకపోయినా, చాలా ఖరీదైన మేకప్, దుస్తుల్లోనే ఉన్నారు. వాళ్ళకి ఏ బాదరబందీలూ లేవు.

అంతా నవ్వుతూ, తుళ్ళుతూ వస్తు న్నారు. షీలా, ఇందూ దగ్గరకి వచ్చారు. ఎదురెదురయ్యారు. ఇందుని షీలా హఠా త్తుగా ఢీకొట్టింది. ఇది ఇందు ఏమాత్రం ఊహించలేదు. మామూలుగా నడుస్తూ వస్తూ ఉండటం వల్ల హఠాత్తుగా షీలా తనని ఢీకొట్టేసరికి ఇందు కింద పడిపో యింది. షీలా ఆమెకి కనీసం సారీ కూడా చెప్పకుండా ముందుకి వెళ్ళిపోయింది. ఇందు తనే లేచి నిలబడి, చుట్టూ చూసింది. ఎవరూ లేరు. ముందునుంచి షీలా, ఆమె స్నేహితురాళ్ల నవ్వులు వినిపి స్తూనే ఉన్నాయి. ఆ తర్వాత షీలా ఎక్కడ ఎదురైనా ఇందుని కోపంగా చూడటమో, లేకపోతే విరగబడి నవ్వటమో చేస్తోంది. ఆమె తనని ఎందుకంత ఏడిపిస్తోందో ఇందుకి అర్థం కాలేదు. షీలా తన ఫ్రెండ్స్‌తో కలిసి ఏవేవో కామెంట్స్ కూడా చేస్తోంది.

ఇందుకి జ్వరం వచ్చినట్లు అనిపిస్తోంది. అసలే రాత్రంతా మేలుకుని వీపునెప్పి కూడా వస్తోంది. అది చాలక ఈ షీలా వేధింపులు.

ఇక్కడ పనివేళలు ఎట్లా ఉన్నా మిగతా అంతా బాగుంది. కానీ ఇప్పుడు ఈ షీలా గొడవేంటో? బొత్తిగా మనశ్శాంతి లేకుండా

చేస్తోంది షీలా. ఆమెవైపు చూడకుండా ఉంటే సరిపోతుంది. కానీ కావాలని వచ్చి పడేయాలని చూడటం, తనని చూస్తూ నవ్వటం.. తప్పించుకోవడమెలా?

ఇందు మర్నాడు టీబ్రేక్‌లో వెళ్ళలేదు. ఆ తర్వాత ఒక గంట గడిచిపోయింది.

"నా కాల్స్ చూసుకుంటావా? " అడిగింది ఇందు.

"అలాగే" అన్నాడు హేలీ.

షీలా కూడా అదే సమయంలో కాంటీన్‌లో ఉండటం చూసి ఇందు ఆశ్చర్యపోయింది. ఎవరో ఇందు కాంటీన్‌కి రావటం చూసి చెప్పి ఉంటారు.

వాళ్ళని చూస్తే భయం వేస్తోంది. టీ తెచ్చుకుని మెల్లగా తాగుతోంది. వాళ్ళంతా ఇందుని చూసి ఏదో చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. ఇందు చేతులు వణికిపోతున్నాయి. టీ కప్పుని పట్టుకోలేకపోయింది. టీ ఒలికి డ్రెస్సు మీద పడింది.

టీ కప్పుని టేబుల్ మీద పెట్టేసి బయటకు వచ్చేసింది.




**షీ**లా వేధింపులు రోజురోజుకీ ఎక్కువవుతున్నాయి. ఇందు ఆ కాల్ సెంటర్‌లో పనిచెయ్యటం కూడా షీలాకి ఇష్టం లేనట్లుగా ప్రవర్తిస్తోంది.

హరీష్‌కి చెప్పి బాధ పంచుకుందామనుకుంది ఇందు.

"మా కొలీగ్ ఒకమ్మాయి..." హరీష్‌కి అంతా చెప్పింది. అతను ఓదారుస్తాడనుకుంది. ఏదో పరిష్కారం చూపిస్తాడనుకుంది. కానీ హరీష్ ఇందూనే తిట్టాడు.

"నాకూ మా ఆఫీసులో బోలెడు సమస్యలున్నాయి. పని చేస్తున్నప్పుడు ఎవరో ఒకరితో ఏదో ప్రాబ్లమ్ ఉండక తప్పదు. మనుషుల్ని టాకిల్ చేయటం కూడా పనిలో భాగమే. ఎవరితో ఎట్లా ప్రవర్తించాలో నేర్చుకోవాలి. అంతా మనకి సహకారం అందించేస్తూ, స్నేహంగా ఉంటారనుకోవటం తప్పు. కొంతమంది అనవసరంగా మనమీద ద్వేషం పెంచుకుంటారు. వాళ్ళని కూడా టాకిల్ చేసుకోవాలి. ఇదంతా ఆటలో భాగమే. ప్రతి చోటా, ప్రతివాళ్లూ స్వాగతం పలికి, ఎర్రతివాచీ పరుస్తారనుకోకూడదు" అతను ఆమెకి ఆఫీసుల గురించి జ్ఞానం కలిగించాలని చూశాడు.

అతను తనకి ఏం చెయ్యలేడని ఆమెకర్థమైపోయింది. కనీసం సానుభూతి కూడా చూపించటంలేదని బాధ కలిగింది.

అసహాయత, బలహీనత, ఒంటరితనం ఇందుని చుట్టుముట్టాయి. ఎవరూ సాయం చేసేవాళ్ళు లేరన్న వ్యథ ఆమె ఆవేదనని పెంచింది.

ఆ రోజు క్యాంటీన్‌లోకి వెళ్ళాక ఒక కుర్చీలో తన బ్యాగ్ తగిలించి, వెళ్ళి, టీ తెచ్చుకుంది. టీ తాగాక బ్యాగ్ భుజానికి తగిలించుకోబోతే అది చాలా తేలిగ్గా అనిపించింది. వెంటనే బ్యాగ్ తెరిచి చూసింది. ఇందాక వస్తూ వస్తూ కొన్న పుస్తకం కాస్తా మాయమైంది.

కొత్త పుస్తకం. ఎంతో కష్టం మీద దొరికింది. ఇంకా ప్యాక్ కూడా విప్పలేదు. ఇందాకటి దాకా బ్యాగ్‌లోనే ఉంది. తను టీ తెచ్చుకునే లోపలే ఎవరో తీశారు.

ఇందు మనసంతా పాడయింది.

ఇంతలో షీలా హడావిడిగా క్యాంటీన్ లోంచి వెళ్ళిపోవటం కనిపించింది.

అది షీలా పనేనని అర్థమైంది. కానీ ఎందుకలా చేసింది? షీలా ఒక్కో డ్రెస్సూ వేల ఖరీదు. మేకప్ సామగ్రి కూడా వేల లోనే. లగ్జరీ కారు కూడా ఉంది.

ఎందుకు తన బుక్ తీసుకుంది? కేవలం తనను ఏడిపించటానికే.

ఇప్పుడేం చెయ్యాలి? ఇందుకేం తోచ లేదు. ఎవరికి చెప్పినా వినిపించుకోరు. ఇది వరకు ఒకసారి మేనేజర్‌కి చెప్తే ఆయన ఇందుకే క్లాస్ తీసుకున్నాడు.

"షీలా మంచి అమ్మాయి. ఆమెని నువ్వు సరిగ్గా అర్థం చేసుకున్నట్లు లేవు" అన్నాడు.

షీలాని ఎదుర్కోలేదు తను.

ఇందుకి నీరసం వచ్చేసింది.

★ ★ ★

ఆ తర్వాత షీలా పగ తీర్చుకుంట్నునట్లు ప్రవర్తిస్తోంది. రోజురోజుకీ వేధింపులు పెరిగిపోతున్నాయి.

ఎందుకిలా చేస్తోంది? ఇందు తనని తాను ప్రశ్నించుకుంది. షీలాతో ఎన్నడూ కలిసి పని చేసింది లేదు. ఆమె ఎవరో కూడా తనకి సరిగ్గా తెలియదు. అందం విషయానికి వస్తే షీలా ముందు ఇందు దిగదుడుపే.

ఆహ్లాదకరమైన వాతావరణం ఉంటే తప్ప ఎవరూ పని చెయ్యలేరు. షీలా కావాలని ఇందు మూడ్ పాడు చేస్తుంటే ఆ ప్రభావం ఇందు పనితీరు మీద కూడా పడటం ప్రారంభించింది.

ఇంక భరించలేక ఒకసారి షీలాని ముఖాముఖి అడిగేసింది.

"నన్నెందుకు వేధిస్తున్నావ్? నీకు నేనేం చేశాను?" అడిగింది ఇందు.

ఇందుకి ఇరవై ఎనిమిదేళ్ళు. షీలాకి పాతికేళ్ళు ఉంటాయి. కానీ పదహారేళ్ళ పడుచులా తయారై వస్తుంది. ఇద్దరికీ వయసు తేడా మూడేళ్ళే.

ఇందు అడగగానే షీలా మొహం నమ్ర తగా, చాలా వినయంగా మారిపోయింది.

"అదేంటి మేడమ్ అట్లా అంటారు. పెద్ద వాళ్ళని మిమ్మల్ని చూస్తే నాకు చాలా గౌరవం. మిమ్మల్ని నేను టీజ్ చెయ్యట మేంటి?" అంది ఇందు ఏదో చాలా ముసలిదైనట్లు, తను చిన్నపిల్లయినట్లు.

ఇంకేం చెప్పాలో తెలియలేదు ఇందుకి. షీలా నక్కజిత్తుల మనిషని అర్థమైంది.

తిరిగి వచ్చి సీట్లో కూర్చుంది.

"అట్లా ఉన్నావేం?" అడిగాడు హేలీ.

"ఏం లేదు" నీరసంగా అంది ఇందు.

★ ★ ★

ఇందుకి జలుబు చేసింది. జలుబుతో పాటు జ్వరం, ఒళ్ళు నెప్పులూ, తలనొప్పీ వచ్చాయి. శరీరం విశ్రాంతిని కోరుకుం టోంది. కళ్ళు ఎర్రబడి, మొహం ఉబ్బింది.

"జలుబు చేసిందా?" అడిగాడు హేలీ.

"అవును."

"చాలా ఎక్కువగా ఉన్నట్లుందే. సెలవు పెట్టుకుని ఇంట్లో రెస్ట్ తీసుకోకపో యావా?"

"సెలవు దొరకదు"

"ఓ! అయినా ఒంట్లో బాగాలేకపోతే పనెలా చేస్తావు?" అతను సానుభూతిగా అన్నాడు.

ఇందు చిన్నగా నవ్వి ఊరుకుంది.

అతను ఇంతలో ఎటో వెళ్ళాడు.

ఇందుకి ఒక కాల్ వచ్చింది. దాన్ని సరిగ్గా వినటం కూడా చేతకాలేదు. నెత్తి మీద ఎవరో సుత్తిపెట్టి కొడుతున్నట్లు ఉంది. చెవుల్లో ఏదో పెట్టినట్లు, మందంగా ఉన్నాయి. రాత్రంతా ఇట్లాగే గడపాలని తల్చుకుంటే వణుకు పుడు తోంది. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

ఏంటీ ఉద్యోగం? పెళ్ళికి ముందు

జీవితం ఎట్లా ఉంది? కాస్త జలుబు చేస్తేనే తల్లడిల్లిపోయేది. అట్లాంటి రోజులన్నీ పోయి చివరకు తీవ్రమైన జ్వరం ఉన్నా నోరెత్తకుండా ఇంటిపనీ, వంటపనీ, ఆఫీసుపనీ చేసుకోవలసి వస్తోంది.

ఇందుకి కాళ్ళూచేతులూ కదల్చటం కూడా కష్టం అనిపిస్తోంది.

ఆ హాల్ మొత్తం నిశ్శబ్దంగా, చల్లగా ఉంది.

"ఇందూ" హఠాత్తుగా ఎవరో పిలిచారు.

ఇందు ఉలిక్కి పడింది.

ఆమె వైపే చూస్తున్న హేలీ నవ్వాడు.

"పదకొండు అవుతోంది. వెళ్ళి మొదటి అంతస్తులో ఉన్న డాక్టర్‌కి చూపించుకో. ఇంకో పావుగంటలో నీ రిలీవర్ వస్తాడు. నువ్వు ఇంటికి వెళ్ళిపో. నేను నీ పని జరిగిపోయే ఏర్పాట్లు చేశాను"

"కానీ..."

"ఇక నీకివాళ పన్లేదు, సరేనా? ఒంట్లో బాగా ఉంటే రేపురా. లేకపోతే ఫోన్ చెయ్యి. వేరే ఏర్పాట్లు చేసే బాధ్యత నాది"

"ఎంత మంచివాడివి" ఇందుకి మాటలు రాలేదు.

"నువ్వు ముందు డాక్టర్‌కి చూపించుకో, వెళ్ళు" హేలీ తొందరపెట్టాడు.

ఇందు బ్యాగ్ తీసుకుని బయల్దేరింది.

డాక్టర్ మందులిచ్చాడు.

తెల్లవారుజాము దాకా క్యాబ్‌లు దొరకవన్నారు. ఇందు అక్కడే సిక్‌రూమ్‌కి వెళ్ళి మందులు వేసుకుని, నీళ్ళు తాగి నిద్రకుపక్రమించింది. కాస్సేపట్లో మంచి నిద్రపట్టింది. తెల్లవారుజామున మెలకువ వచ్చింది. ఒంటినెప్పులు తగ్గి, శరీరం తేలిగ్గా ఉంది. ముక్కు దిబ్బడ తగ్గింది. ఒక్కసారి ఒళ్ళు విరుచుకుని, కాళ్ళూ చేతులూ జాడించింది. నాప్‌కిన్‌తో మొహం తుడుచుకుని, చేత్తో జుట్టు సవరించుకుంది.

బ్యాగ్ తీసుకుని క్యాబ్ దగ్గరకు నడిచింది. హేలీ అందులో ఉన్నాడు.

"ఎట్లా ఉన్నావు?" అడిగాడు.

"బాగుంది, థాంక్యూ" అంది ఇందు.

కారు బేబీకేర్ సెంటర్ దగ్గర ఆగగానే హేలీ తనే దిగి వెళ్ళి, పాప బుట్టతో బయటకు వచ్చాడు. ఆయా వెనకాలే పాపని ఎత్తుకుని వచ్చి, కార్లో కూర్చున్న ఇందు చేతికి అందించింది.

"ఇంకేమన్నా కావాలా?" అడిగాడు హేలీ.

"చాలు" ఇందు నవ్వేసింది.

"హమ్మయ్య! నవ్వుతున్నావు. నిన్న నీ మొహం చూసి చాలా భయమేసింది" అతను రిలాక్స్ అవుతూ అన్నాడు. అతను తనమీద శ్రద్ధ చూపించటం చూసి ఇందుకి చాలా ఆనందంగా అనిపించింది.

కారు ఇంటిముందు ఆగింది.

## మీరెందుకు చదవరు?

ఒకసారి సంజీవదేవ్ ఓ సోదరితో 'మీ ఉత్తరం సులోచనగారే(తనభార్య) చించి, చదివి నాకిచ్చారు. నాకు వచ్చే ఉత్తరాలు ఆమె చించి చదవటానికి నేను అనుమతినిచ్చాను. కానీ ఆమెకు వచ్చే ఉత్తరాలను మాత్రం నేను చించి చదవను' అన్నారు. దానికి ఆమె కొంచెం ఆందోళనగా 'దానికేమి



కారణం? మీరూ ఆమెలాగే చేయవచ్చు కదా?' అన్నారు.

దానికి సంజీవదేవ్ నవ్వుతూ, 'దానికి పెద్ద ప్రత్యేక కారణమేమీలేదు. ఆమెకు వచ్చే ఉత్తరాల్లో చదవదగింది ఏమీ ఉండదు కనుకనే వాటిని నేను చదవను' అన్నారు.

★ ★ ★

క్యాంటీన్లో రీతూ కనిపించింది.

"హాయ్" అంటూ ఆప్యాయంగా పలకరించింది.

ఇద్దరూ అవీ ఇవీ మాట్లాడుకుంటూ టీ తాగుతున్నారు. అటువైపు వచ్చిన హేలీ, ఇందూ రీతూతో మాట్లాడటం గమనించాడు. తర్వాత ఓసారి హెచ్చరించాడు మెల్లగా "రీతూతో కాస్త జాగ్రత్తగా ఉండు"

"ఎందుకని? "

అతను జవాబు చెప్పలేదు.

మరో వారంరోజుల్లో ఇందుకి సమాధానం దొరికింది. రీతూ కొందరి చేత గ్యారంటీలూ, ష్యూరిటీలూ పెట్టించుకుని డబ్బులు కట్టలేదు.

కొందరికి అప్పులు ఎగ్గొట్టింది.

నమ్మదగ్గ మనిషికాదు.

హేలీ తనను హెచ్చరించి రక్షించాడు. లేకపోతే ఇంకాస్త క్లోజ్‌గా మసిలితే రీతూ తన దగ్గర కూడా ఏదో తీసుకునేదే.

★ ★ ★

షీలా వేధింపులు ఎక్కువయ్యాయి.

ఇందు భరించలేకపోతోంది. మనిషి దిగాలుగా తయారైపోయి, మొహంలో కళంతా మాయమైంది.

"అదేంటి అలా ఉంటున్నావు? " అడిగాడు హేలీ.

"ఏం లేదు"

"ఒంట్లో బాగాలేదా? "

ఆమె అతని వైపు చూసింది. ఆ కళ్ళల్లో అదే ఆప్యాయత, స్నేహం.

ఇందుకి ఇక కంట్రోల్ చేసుకోవటం చేత కాలేదు. ఒక్కసారిగా కన్నీరు ఉప్పెనలా పొంగింది.

అతను ఆశ్చర్యం, భయంతో ఆమెవైపే చూస్తూ ఉండిపోయాడు.

"అయ్యో! ఏడుస్తున్నావా! ఎందుకేడుస్తున్నావు? నీకు అభ్యంతరం లేకపోతే చెప్పు? " అన్నాడు.

అతని స్వరం మృదువుగా, ఆప్యాయంగా ఉంది.

అతనికి చెప్పికూడా ఏం ఉపయోగముండదని తెలుసు. అయినా అంత ప్రేమగా ఇందుని అడిగినవాళ్ళు ఇంతవరకూ లేరు. అతనికి చెప్పి తన బాధ తగ్గించుకోవాలనిపించింది.

అంతా చెప్పేసింది. "నాకు షీలాని ఎదుర్కొనే ధైర్యం లేదు. రోజు రోజుకీ అనవసరంగా ఏడిపిస్తోంది" అంది.

అతను మౌనంగా విన్నాడు. అతని మొహంలో జాలి, కోపం, బాధ స్పష్టంగా చూడగలిగింది ఇందు.

"బాధ పడకు. నీకు షీలా వేధింపులు రేపటి నుంచీ ఉండవు" అన్నాడు.

"ఎట్లా? నీకేమన్నా దివ్యదృష్టి ఉందా? " ఇందు తన బాధ మర్చిపోయి అడిగేసింది.

"లేదు. మంత్రదండం ఉంది" హేలీ నవ్వాడు.

"నేను గొప్ప మంత్రగాడిని" అతను నవ్వాడు మళ్ళీ.

అతనితో బాధ పంచుకుని ఆమె గుండె తేలికపడింది. మనసులోకి ధైర్యం వచ్చింది.

### కొత్తగాలి...

**ఆనాడు**
**కోడికూతలు**
**ఈనాడు**
**సెల్‌ఫోన్ల మోతలు**

– కాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

"చూడు! ఇప్పుడెంత తేలిగ్గా, తేటగా కనిపిస్తున్నావో. అనవసరంగా చిన్న చిన్న విషయాలకి మూడ్ పాడు చేసుకోకు" అన్నాడతను.

ఒక నిజమైన స్నేహితుడు మాత్రమే ధైర్యాన్నీ, ఆనందాన్నీ ఇవ్వగలడు. కొయ్యబారి, మంచుబొమ్మలా కూర్చున్న ఆమెని మళ్ళీ మామూలు మనిషిని చెయ్యాలనిపించింది అతనికి. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. చల్లగా, నిర్జీవంగా ఉన్న ఆ చేతిలోకి అతని స్పర్శతో జీవం, వేడి కలిగాయి. అతని చేతిలోంచి ఏదో ధైర్యం ఆమె చేతిలోకి ప్రవహించినట్లయింది.

ఇంతవరకూ ఆమె అట్లాంటి ఓదార్పు ఎరగదు. అతను ఏ సాయం చేయలేని స్థితిలో ఉంటే ఉండవచ్చు గాక, కానీ ఆమె గురించి పట్టించుకున్నాడు. మన గురించి పట్టించుకునే ఒకే ఒక వ్యక్తి చాలు, మనకి ఆనందం, ధైర్యం కలగటానికి.

ఆ తర్వాత ఆమె తన కాల్స్‌ని అటెండ్ అవటంలో మునిగిపోయింది. అతను ఒక పది నిమిషాలు ఎటో వెళ్ళి వచ్చాడు.

★ ★ ★

మర్నాడు షీలా ఇందుకి ఎదురైంది. కానీ ఇందుని పట్టించుకోలేదు. తన దారిన తను వెళ్ళిపోయింది. ఇందుకి చాలా ఆశ్చర్యం కలిగింది.

'బహుశా ఏదో ఆలోచించుకుంటూ చూడలేదులా ఉంది. లేకపోతేనా...' అనుకుంది ఇందు.

ఏదైతేనేం, ఆ రోజుకి బతికిపోయానునకుంటూ, గుండెల నిండా గాలి పీల్చుకుంది. తన సీట్ దగ్గరకు తిరిగి వచ్చింది.

ఆమె మొహంలో ఉన్న రిలీఫ్ అతను గమనించాడు.

"ఏదన్నా శుభవార్తా? " అడిగాడు.

"లేదు"

అతను భుజాలెగరేశాడు. ఆమె కూర్చుని చాలా రోజుల తర్వాత తను పొందిన రిలీఫ్‌ని ఆస్వాదిస్తూ ఆనందంగా ఉంది.

ఆ రాత్రి డ్యూటీ ఆనందంగా పూర్తిచేసింది. ఒకవారం పూర్తిగా షీలాని గమనించాక షీలా తనని ఏడిపించటం మానేసిందని ఇందుకి అర్థమైంది. ఆనందం, ఆశ్చర్యం ఇందుని చుట్టుముట్టాయి. హేలీ ఏదో చేశాడన్న మాట. నిజంగానే షీలా తనని వేధించటం మానేసింది.

"థాంక్యూ. అప్పుడు జోక్ చేశావనుకున్నాను గానీ ఇప్పుడు నిజంగానే అర్థమైంది. నీ దగ్గర నిజంగానే మంత్రదండం ఉంది. షీలా ఇప్పుడు నన్నేమాత్రం వేధించడం లేదు" ఇందుకి భావోద్రేకంతో గొంతు జీరబోయింది.

"హమ్మయ్య. నువ్వు ఇప్పుడు హ్యాపీగా ఉన్నావు, చాలు" హేలీ నిట్టూర్చాడు.

"అవును. థాంక్స్"

"ఉట్టిగా థాంక్స్ చెప్పటం కాదు. సంతోష సమయాలని సెలబ్రేట్ చేసుకోవాలి" అతను నవ్వాడు.

"అట్లాంటి అద్భుతమైన మ్యాజిక్ ప్రదర్శించినందుకని నిన్ను తప్పకుండా సన్మానించాల్సిందే. అవునూ, అసలేం చేశావు? షీలా ఎట్లా ఊరుకుంది? " ఇందు ఆసక్తిగా అడిగింది.

అతను జవాబు చెప్పలేదు.

ఆమె కూడా రెట్టించి అడగలేదు.

★ ★ ★

"హేలీ ఎప్పుడూ యాక్టివ్‌గా ఉంటాడు" అంది లూసీ.

"అవును. మనం నీరసంగా అయిపోతాం. కానీ అతను ఎప్పుడూ హుషారుగానే ఉంటాడు" అంది ఇందు.

"అయినా మగవాళ్ళకి ఇంట్లో పనుండదు. అన్నీ చేసి పెడితే, తినేసి వచ్చి పని చెయ్యటమేగా? " అంది ఇందు మళ్ళీ.

లూసీ తల అడ్డంగా తిప్పింది. "అట్లా అనుకుంటున్నావా? పొరపాటు. ఇంట్లో పనంతా దాదాపు హేలీనే చేస్తాడు" అంది.

"నీకెలా తెలుసు? " అంది ఇందు.

'కొందరు మగవాళ్ళు ఇంట్లో పని చేసి కూడా గొప్పకి చెయ్యలేదని చెపుతారు. కొంతమంది మగవాళ్ళు ఏ చిన్నపని చెయ్యకపోయినా గొప్పకి చేశామని చెపుతారు. ఎవరి గొప్ప వాళ్ళది. అదే విధంగా హేలీ తను ఇంట్లో పని చేస్తానని చెప్పాడేమో? ' అనుకుంది ఇందు.

"మా కజిన్ వాళ్ళింటి పక్కనే ఉంటుంది. అప్పుడప్పుడూ వెళ్తుంటాను. హేలీ భార్యకి పనిలో చాలాసాయం చేస్తాడు. నా కళ్ళారా చూశాను. పిల్లాడి పని కూడా తను ఇంట్లో ఉన్నంతసేపూ హేలీనే చూసుకుంటాడు"

"అతని భార్య ఉద్యోగం చేస్తుందా? "

"చెయ్యదు. తన వల్ల కాదన్నదిట"

"మరి డబ్బు చాలుతోందా? "

"చాలదు. ఉద్యోగం చెయ్యదన్న మాటేగానీ అతని భార్య అన్నీ కొనిపిస్తుంది. మంచిఫ్లాట్ అద్దెకు తీసుకున్నారు. పిల్లాడూ, ఆమే ఇద్దరూ మంచి మంచి డ్రెస్సులు వేసుకుని తయారవుతారు. ఆదివారాలు, హాలీడేస్‌లో బయట ఎక్కడన్నా తినాలంటూ బయటే భోంచేస్తారు. ఊళ్ళో ఎక్కడ ఏ హోటల్, ఏ బేకరీ తెరిచినా ఆమె భర్తతో పాటూ ప్రత్యక్షం కావాల్సిందే. ఆమెని చాలా ప్రేమగా చూసుకుంటాడు"

"ప్రేమ సరే. వీటన్నిటికీ డబ్బు? ఆమెకి ఏదన్నా ప్రాపర్టీ ఉందా? లేకపోతే హేలీకి ఆస్తి బాగా ఉందా? " అడిగింది ఇందు.

"ఆమెకి గానీ అతనికి గానీ చిల్లిగవ్వ ఆస్తి కూడా లేదు"

"మరి? వీటన్నిటికీ మన జీతం సరిపోతుందా? " ఇందుకి సందేహం తీరలేదు.

"అదే నేను చెప్పేది. ఈ రాత్రి పూట డ్యూటీ, ఇంటిపనీ, వంటపనీ కాక హేలీ ఒక హోటల్లో పగలు పద్దులు రాస్తాడు, తెల్సా? వాళ్ళ ఫ్రెండ్‌కి ప్రెస్ ఉంది. అక్కడ కూడా పనిచేస్తుంటాడు"

"ఆ!" ఇందు నోరు తెరిచేసింది. ఒక మనిషి ఇన్ని పనులు చేసి డబ్బు సంపాదిస్తున్నాడు? ఆపైన ఇంట్లో కూడా భార్యకి సాయం. భర్త ఇన్ని కష్టాలు పడుతుంటే కూర్చుని హాయిగా ఎంజాయ్ చేస్తున్న అతని భార్యని తల్చుకుని కోపం కలిగింది. హేలీ మీద గౌరవం, అభిమానం కలిగాయి.

ఆ భావాలు సద్దుమణిగాక ఇంట్లో స్పూన్ కూడా అట్నుంచి ఇటు పెట్టని భర్తమీద కోపం వచ్చింది. డబ్బు చాలదని తనని నిర్దాక్షిణ్యంగా ఈ నైట్ డ్యూటీ పనికి తోలాడు హరీష్. అది తల్చుకుని చివరకు ఏడుపు వచ్చింది.

★ ★ ★

"ఇల్లు మారాలి" అన్నాడు హేలీ ఒక రోజు.

"ఏం? ఇప్పుడున్న ఇంటికి ఏమైంది? " లూసీ అడిగింది.

"ఇప్పుడున్న అపార్ట్‌మెంట్‌లో ఆరు ఫ్లాట్లు మాత్రమే ఉన్నాయి. మేం తప్ప అందులో భార్యాభర్తలంతా ఉద్యోగం చేసేవాళ్ళే" అన్నాడు హేలీ.

"అయితే? "

"నేను ఇంట్లో ఉండే సమయం తక్కువ. పాపం మా మిసెస్, మాట్లాడే తోడు లేక చాలా బోర్ ఫీల్ అవుతోంది. కాస్త ఫ్రెండ్స్ దొరికే చోటకి మారాలి" అన్నాడు.

"సౌకర్యాలు చూసుకుంటావా? కాలక్షేపంగా మాట్లాడే మనుషుల్ని చూసుకుంటావా? కాలక్షేపానికి ఎన్నిలేవు? టి.వి., ఇంటర్నెట్, పుస్తకాలు, పేపర్లు, ఫోన్లు, ఇవన్నీ చాలవా? " అడిగింది లూసీ.

"మీరు హాయిగా ఉద్యోగాలకి వచ్చేస్తారు. ఇంటికి వెళ్ళాక పన్లు చూసుకుని హాయిగా నిద్రపోతారు. మీకు టైం చాలదు. కానీ ఇంట్లో ఇరవై నాలుగు గంటలూ కూర్చోవాలంటే ఎంత బోరో మీకేం తెలుస్తుంది? మా మిసెస్‌ని చూస్తే జాలేస్తుంది. టి.వి., ఫోన్లు లాంటివి ఉన్నా, మనిషితోడు వేరు" అన్నాడు హేలీ.

"సరే. అతని ప్రేమ అతనిది" అంది ఇందు, లూసీతో మెల్లగా, హేలీకి వినబడకుండా. లూసీ తలూపి ఊరుకుంది.

తన ఇంటికి కాస్త అవతలగా 'టు లెట్' బోర్డ్ ఉండటం గుర్తుకువచ్చింది ఇందుకి.

కొత్తగాలి...

**కాలం - కలకాలం**
**ఎవ్వరికీ**
**అనుకూలం కాదు**
**ప్రతికూలమూ కాదు**

– *రాజ్‌శ్రీ ఎడ్వర్డ్,*
*హైదరాబాద్*

ఆ బిల్డింగ్‌లో నాలుగు పోర్షన్లున్నాయి. అందులో కొందరు ఆడవాళ్ళు పగటిపూట కనిపిస్తూనే ఉంటారు.

హేలీకి ఆ ఇంటి అడ్రస్ ఇచ్చింది.

హేలీ మర్నాడే వెళ్ళి చూసి వచ్చాడు. ఇందుకి చెప్పాడు.

"నచ్చిందా?" అడిగింది ఇందు.

"నచ్చలేదు" అన్నాడు హేలీ.

"ఎందుకని?" ఇందు ఆశ్చర్యపోయింది.

"ఇంటాయన నాస్తికుడట"

"అయితే నీకేం?" అంది ఇందు.

"ఆ ఇంట్లో నేను ఉండలేను. పూజా మందిరం లేని ఇంట్లో నేనసలు చేరే ప్రసక్తే లేదు. నేను ఉండే ఇల్లు దేవుడి నామస్మరణతో పవిత్రంగా ఉండాలి. నేను ఎంత పనిలో ఉన్నా పూజ మాత్రం మానుకోను. అట్లాంటిది ఆ ఇంట్లో చేరుతానా? ఆయన దేవుడ్ని విమర్శిస్తూ మాట్లాడితే నా మనసు బాధపడుతుంది" అన్నాడు హేలీ.

ఇందు హేలీ వంక ఆరాధనగా చూసింది. "సారీ! నాకా సంగతి తెలీదు. అందులోని ఆడవాళ్ళు కొందరు ఉద్యోగం చెయ్యరని మాత్రం తెలుసు. మీ ఆవిడకి ఫ్రెండ్స్ దొరుకుతారనిపించి చెప్పాను" అంది ఇందు.

"సారీ ఎందుకు? నాకు హెల్ప్ చెయ్యాలనే కదా చెప్పావు. చాలా థాంక్స్. ఇంకా కొంత మందికి చెప్పి ఉంచాను. తొందర్లోనే మంచిఇల్లు దొరుకుతుంది" అన్నాడు.

అతను అనుకున్నట్లే పదిరోజుల్లో మంచి ఇల్లు దొరికింది.

★ ★ ★

ఇందు లూసీకి షీలా గురించీ, హేలీ ఆమెని కంట్రోల్ చేయటం గురించీ చెప్పింది.

లూసీ నిర్ఘాంత పోయింది.

"అంటే..." లూసీ ఏదో చెప్పబోయి మళ్ళీ నోరుమూసుకుంది.

"అవును లూసీ, ఏం మంత్రం ప్రయోగించాడో గాని షీలా ఒక్కసారిగా సైలెంట్ అయిపోయింది"

"అదేంటో నాకు తెలుసు" అంది లూసీ.

"అవునా. నాకూ చెప్పవా?" ఆసక్తిగా అడిగింది ఇందు.

"షీలాకి మంచిపేరు లేదు. అన్ని దురలవాట్లూ ఉన్నాయి" అంది లూసీ.

ఇందు మౌనంగా వింటోంది.

"హేలీని షీలా చాలా ఇష్టపడేది. అతన్ని ఆకర్షించాలని చాలా చూసేది. హేలీ, షీలాని దూరంగా పెట్టాడు. అతను

నీతో ఫ్రెండ్లీగా ఉండటం చూసి, అసూయ పెంచుకుని, నిన్ను ఏడిపించింది. హేలీ అట్లా కనిపిస్తాడుగానీ చాలా గట్టిమనిషి. అతనికి బయట చాలా పరిచయాలు న్నాయి. షీలా గురించి చాలా తెలుసు. ఆమెని గట్టిగా హెచ్చరించి ఉంటాడు. దెబ్బకి షీలాదెయ్యం భయపడి ఉంటుంది" అంది లూసీ.

ఇందు నిర్ఘాంత పోయింది. ఏది ఏమైతేనేం.. హేలీ తనని షీలా నుంచి కాపాడాడు. కృతజ్ఞతాభావంతో మనసంతా నిండిపోయింది.

★ ★ ★

హేలీ ఇందుకి చేసిన ఉపకారాలు ఇన్నీ అన్నీ కాదు. అవన్నీ కూడా చిన్నాచితకవే. బహుశా ఎవరన్నా చేసేవే. కానీ ఇందు పరిస్థితి వల్ల అవన్నీ బ్రహ్మాండంగా కనిపిస్తున్నాయి. అతనికి ఎట్లా కృతజ్ఞత చెప్పుకోవాలో అర్థం కావటం లేదు.

అతను నవ్వుతుంటే చాలా సంతోషంగా అనిపిస్తుంది. తను నవ్వుతుంటే ఇందు కళ్ళప్పగించి చూడటం హేలీకూడా గమనించాడు.

"ఎందుకట్లా చూస్తున్నావు? " ఒకసారి అడిగాడు.

"నాకెన్నో సాయాలు చేశావు. రాత్రిపూట జాబ్ ఎట్లాగా? అని భయపడ్డాను మొదట్లో. నీ మూలంగా జాబ్‌లో కష్టం కూడా తెలియటం లేదు. నాకిన్ని చేసిన నువ్వు సంతోషంగా ఉంటే చూడాలనిపించడం తప్పా? నువ్వు సంతోషంగా నవ్వుతుంటే నాకూ చాలా బాగా ఉంటుంది"

"నువ్వు మరీ సెన్సిటివ్" అతను మళ్ళీ నవ్వాడు.

"అవునేమో!" అంది ఇందు.

★ ★ ★

ఇందుకి రాత్రిపూట మేలుకొని ఉండటం చాలా కష్టంగా ఉంది. నడుం నెప్పి, వీపు నెప్పి కూడా మొదలయ్యాయి. పగటిపూట ఉద్యోగం దొరికితే బాగుండునని అనిపిస్తోంది. ఏదీ దొరకలేదు.

హేలీకి ఎప్పుడైనా చెప్పుకుని బాధపడుతోంది. అతనికి కూడా ఆ ఉద్యోగం కష్టంగానే ఉంది.

★ ★ ★

"నాకు వేరే ఉద్యోగం దొరికింది. అదీ పగటిపూటే!" హేలీ చెప్పాడు ఓ రోజు.

"ఆ" ఇందు ఒక్కసారిగా నిర్ఘాంతపోయింది.

"అదేంటి అట్లా అయిపోయావు? నేనింక ఈ నిద్రలేని రాత్రులు గడపక్కర్లేదు. అది నీకు ఆనందం కలిగించటం లేదా? " హేలీ అడిగాడు.

ఇందు ఒక్కసారిగా మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది.

"ఓ! సారీ.. కంగ్రాచ్యులేషన్స్" అంది.

"నీకు సంతోషంగా ఉన్నట్లు లేదే? నేను ఎంతగానో తపించిపోయిన ఉద్యోగం నాకు దొరికింది."

"నిజం చెప్పనా? నీకు మంచి ఉద్యోగం దొరికిందని నాకు చాలా సంతోషంగా ఉంది. కానీ నీలాంటి మంచి ఫ్రెండ్ వెళ్ళిపోతున్నందుకు బాధగా ఉంది" అంది ఇందు.

"ఇంకా? " అతను అడిగాడు.

"ఇంకా.. ఏమో? " ఇందు నవ్వేసింది.

ఇంకా బాధగానే ఉంది. అతనిలాంటి సహోద్యోగి మళ్ళీ దొరకడు. తన గురించి పట్టించుకుని, ఆప్యాయంగా చూసే మనిషి దొరకడు. పనిలో టెన్షనంతా పోగొడుతూ, నవ్వుతూ పరిసరాల్ని ఆహ్లాదంగా చేసే మనిషి మళ్ళీ దొరకడు. జీవితం అంటే ఇంతే. ఆఫీసులో అన్నిచోట్లా తనకి మంచి వాళ్ళే దొరకటం అసాధ్యం. పూలూ ముళ్లూ కలిసి సహజీవనం చేస్తాయి. ఒక్కోసారి పూలు దొరికితే మరోసారి ముళ్ళు

దొరుకుతాయి.

"నువ్వు హాయిగా వెళ్ళిపోతున్నావు. నేనిక్కడే ఉండాలి" అంది ఇందు విచారంగా.

హేలీ నవ్వాడు.

"అసలేంటి నీ బాధ? నేను వెళ్ళి పోతున్నాననా, లేకపోతే నువ్విక్కడే రాత్రిపూట డ్యూటీ చేస్తుండాలనా? " అని అడిగాడు.

"రెండూ"

అతనొక్క నిమిషం పాటు మౌనంగా ఉండిపోయాడు.

"నీక్కూడా అక్కడ జాబ్ చూడనా? " హేలీ అడిగాడు.

ఇందు ఎగిరి గంతేసినంత పనిచేసింది.

"నిజంగా? సాధ్యమేనా? ప్లీజ్ చూడవూ? " అంది.

అతను నవ్వాడు.

"బహుశా సాధ్యపడవచ్చు. అక్కడి ఎం.డి మా ఫ్రెండ్‌కి తెలుసు" అన్నాడు.

ఇందు మౌనంగా, ఆసక్తిగా వింటోంది.

"అంటే, నేనేదో రికమెండేషన్‌తో అక్కడ ఉద్యోగం సంపాదించాననుకోకు. వాళ్ళు అన్నీ చూశాకే తీసుకుంటారు. కాకపోతే తెలిసిన వాళ్ళయితే నయమనుకుంటారు.

"నువ్వు గనక నా పేరు చెప్తే జీవితాంతం నీకు రుణపడి ఉంటాను" అంది ఇందు.

"అంతమాట వద్దులే" అంటూ నవ్వేడు.

"వాళ్ళని ఎప్పుడడుగుతావు? " ఆత్రుతగా అడిగింది ఇందు.

"వాళ్లు మనలా కాదుగా. ఇప్పుడు నిద్ర పోతుంటారు. రేప్పొద్దున అడుగుతాను. సరేనా? "

"సరే, థాంక్యూ.. థాంక్యూ" మళ్ళీ మళ్ళీ చెప్పింది ఇందు.

"ఒక జాబ్ అకౌంట్స్‌లో ఖాళీగా ఉన్నట్లుంది. నీకు అకౌంట్స్ కొత్తకదా? నేను బేసిక్స్ చెపుతాను, నీకు వాళ్ళు ట్రైనింగ్ కూడా ఇస్తారు" అన్నాడతను.




"ఇందూ కంగ్రాట్స్!" ఇందుకి ఎందుకో అర్థమైంది.

"అంటే వాళ్ళు ఒప్పుకున్నారా? "

"అవును. నీకో చిన్న ఇంటర్వ్యూ ఉంటుంది. కాస్సేపట్లో ఫోన్ కాల్ వస్తుంది" అన్నాడతను.

మరో అరగంటలో ఆమెకి ఫోన్ వచ్చేసింది. ఆమె అది అటెండ్ అవుతుంటే అతను ఆమె కాల్స్‌ని అటెండ్ అయ్యాడు.

వాళ్ళు ఆమెని కొన్ని ప్రశ్నలడిగారు.

"సరే, పర్సనల్ ఇంటర్వ్యూ రేపు పది గంటలకి మా ఆఫీసులో ఉంటుంది" అన్నారు వాళ్లు.

"థాంక్యూ" అంది ఇందు. ఇందుకి భయం వేస్తోంది. ఇంటర్వ్యూలో ఎలా చేస్తానోనని అనిపిస్తోంది.

"ఇదంతా నాకు కొత్త సబ్జెక్ట్. భయం వేస్తోంది" అంది.

"ఎందుకు భయం? నువ్వు ఇంటర్వ్యూ బాగా చేస్తావు. ఆ తర్వాత పనిగురించి కూడా భయం దేనికి? కొన్నాళ్ళు నేను గైడ్ చేస్తాను" అన్నాడతను. ఆమెవైపు చూస్తూ మృదువుగా నవ్వాడు.

అతని నవ్వు చూసి ఆమె టెన్షన్ మాయమైంది. ఆ నవ్వు చాలా బావుంది. అతని మొహం చాలా ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉంది. అతని కళ్ళు ఆపేక్షని కురి

పిస్తున్నాయి. ఆమెకెంతో ధైర్యం వచ్చింది.

ఒకరోజు సెలవుకి అప్లై చేసింది. ఎవరో ఒకరు ఆమెపని చూసుకునే వాళ్ళుంటేనే సెలవు మంజూరు అవుతుందన్నారు.

"రేపు నాకు సెలవేగా. నేను ఆమె పని చూసుకుంటాను" అన్నాడతను.

"అలాగైతే సరే" అన్నాడు టీమ్ మేనేజర్.

తనకోసం హేలీ హాలీడేని కూడా పోగొట్టుకుంటున్నాడు. ఇందుకి మనసంతా అతనిపట్ల కృతజ్ఞతతో నిండింది. పొద్దుటిదాకా అతను తనతోనే పనిచేశాడు. ఆ తర్వాత ఇద్దరూ కాల్ సెంటర్ వెనక ఉన్న చెట్ల కింద కూర్చున్నారు. అతను ఇందుకి ఏమేం ప్రశ్నలు రావచ్చో, ఎట్లా సమాధానం చెప్పాలో అవి వివరించాడు. ఆ తర్వాత ఇద్దరూ బయల్దేరారు. అతను అకౌంట్స్ చూసే హోటల్‌కి వెళ్ళాడు. ఆ తర్వాత ఇంటికెళ్ళి, స్నానంచేసి, వంటచేసి, తిని మళ్ళీ కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని కాల్ సెంటర్‌కి బయల్దేరాలి. అతను తన కోసం నిర్విరామంగా పనిచేస్తున్నాడు. అతనికి ఇకమీదట ఎన్నడూ ఇట్లా శ్రమ కలిగించకూడదు. అతను ఇంత కష్టం పడుతున్నాడు. అతని శ్రమ వృథా కాకూడదు. తనకి కూడా మళ్ళీ ఇట్లాంటి అవకాశం రాదు. కోరుకున్న వేళలు, మంచిజీతం, చక్కటి సహోద్యోగులు, ఇట్లాంటి ఛాన్స్ పోగొట్టుకుంటే ఆ కాల్ సెంటర్లోనే పడి కొన్నాళ్ళయ్యాక అదీ చెయ్యలేక మానుకోవాలి. తనకి ఈ ఉద్యోగం చాలా అవసరం. ఇందు గట్టిగా నిర్ణయించేసుకుంది.

రాత్రికి ఇంట్లోనే ఉండిపోయింది. ఎంతో సేద తీరినట్లనిపించింది. రాత్రయ్యాక హేలీ మళ్ళీ ఫోన్‌చేశాడు.

"గాభరా పడకుండా ప్రశాంతంగా ఉండు.

"ఒకసారి నేను చెప్పినవన్నీ మళ్ళీ మననం చేసుకో" అన్నాడతను. ఇందుకి బ్యాటరీ రీ ఛార్జ్ అయినట్లనిపించింది.

మర్నాడు పొద్దున్న ఇంటిపని త్వరగా ముగించింది.

మంచి డ్రెస్ వేసుకొని, లైటుగా మేకప్ చేసుకుంది. పాపని కేర్ సెంటర్లో దింపి బయల్దేరింది. ఆటోలో ఉండగానే హేలీ ఫోన్ చేశాడు.

"ఆల్ ది బెస్ట్"

ఆ మాటలు ఇందులో శక్తిని నింపాయి. టెన్షన్ అంతా ఎగిరిపోయింది.

ఇంటర్వ్యూ గదిలోకి ఆత్మవిశ్వాసంతో నడిచింది. అన్ని ప్రశ్నలకీ బాగానే సమాధానం ఇచ్చింది.

"మీకు ఈ అకౌంట్సులో అనుభవం లేదు కదా? "

"నేను నేర్చేసుకుంటానన్న నమ్మకం ఉంది"

"సరే" వాళ్ళు ఆమె సెలక్ట్ అయినట్లు చెప్పారు.

ఇందు సంతోషంతో ఉక్కిరి బిక్కిరైంది.

"మీకు జాయినింగ్ లెటర్ పంపిస్తాం. ఈ లోపల ఏవన్నా అరేంజ్‌మెంట్స్ చేసు ఉంటే చేసుకోండి"

వాళ్ళకి థాంక్స్ చెప్పి, పొంగిపోతూ బయటికి వచ్చింది ఇందు. హేలీకి ఎట్లా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థం కాలేదు.

ఇక మీదట నిద్రలేని రాత్రులుండవు. వేళకి భోజనం చేయవచ్చు. అందరూ నిద్రపోతున్నప్పుడు మేల్కొని, అంతా ఇళ్ళకి వెళ్ళే సమయంలో ఆఫీసుకి బయల్దేరుతూ, పార్కులకి, షికార్లూ, షాపింగ్‌లకి వెళ్ళే జనాన్ని చూస్తూ బాధపడక్కర్లేదు. సమయానికి తిండి, నిద్ర కరవై వచ్చే ఆరోగ్య సమస్యలు ఎదుర్కోనక్కర్లేదు.

ఇందుకి చాలా ఆనందంగా ఉంది. ఈ ఆనందానికంతా కారణమైన హేలీ మీద అభిమానం పొంగిపొర్లింది.

వెంటనే అతనికి ఫోన్ చేసింది.

"థాంక్యూ" అని చెప్పగానే అతనికి అర్థం అయిపోయింది.

"కంగ్రాట్స్, మీ ఆయనకి చెప్పావా? " అడిగాడు.

"ఆయన ఇవాళ పొద్దునకి రావాలి. ఆ..ఇప్పటికి వచ్చి ఉంటారు. ఒకేసారి ముఖాముఖి కలిశాక చెబుతా" అందామె.

"సెలబ్రేట్ చేసుకోండి" అతను నవ్వాడు.

★ ★ ★

హరీష్ ఇంటికి వచ్చేసి ఉన్నాడు అప్పటికే. "నాకు కొత్త ఉద్యోగం దొరికింది" ఇందు ఆనందంగా చెప్పింది.

"ఎక్కడా? ఎప్పుడు? " అతను అడిగాడు.

మళ్లీ అతనే "ఒకసారి ఆఫీసులో పని చేసి అనుభవం ఉందిగా. ఈ కాల్ సెంటర్ ఉద్యోగమే బాగుండేదేమో" అన్నాడు.

"ఆ ఆఫీసు వాళ్ళంతా స్పెసిమన్స్. అన్ని చోట్లా అంట్లాంటివాళ్ళే ఉంటారా? " అంది ఇందు నవ్వుతూ.

ఇందు సంతోషంగా ఉండటం చూసి హరీష్ కూడా సరిపెట్టుకున్నాడు. భార్య సంతోషంగా పనిచేసి, జీతం పట్టుకొస్తుంటే ఎవరికి మాత్రం హాయిగా ఉండదు.

"అవునూ, ఈ ఐడియా ఎలా వచ్చింది? ఈ జాబ్ ఎలా దొరికింది? " అడిగాడు.

"మా కొలీగ్ ఒకతను..." ఇందు మొత్తం వివరించింది.

"నా థాంక్స్ చెప్పు అతనికి" అన్నాడు హరీష్.

ఇందు కాల్ సెంటర్‌కి రిజైన్ చేసింది. వాళ్ళు వెంటనే సమ్మతించారు. ఇందుని కాల్ సెంటర్‌కు పంపిన ట్రైనింగ్ సెంటర్‌వాళ్ళు ఎంతమందినైనా వెంటనే పంపటానికి సిద్ధంగా ఉన్నారు.

హేలీ కూడా రిజైన్ చేశాడు.

ఇందు, హేలీ ఇద్దరూ కొత్త ఆఫీసులో చేరారు. హేలీ సెక్షన్ థర్డ్‌ఫ్లోర్‌లో ఉంటే, ఇందు పని చేసేది రెండో అంతస్తులో. ఒక వారందాకా ఇందు పని నేర్చుకుంటూ బిజీగా ఉండిపోయింది. హేలీ కూడా కొత్త ఉద్యోగంలో బిజీగా ఉన్నాడు. అతనికి కొంచెం ఎక్స్‌ట్రా పని కూడా ఇచ్చారు. దానికి అదనంగా డబ్బు ఇస్తారట. ఆ పని కాక హోటల్లో అకౌంట్స్ రాసేపని ఉంది. లంచ్ టైమ్‌ని బాగా కుదించి, పని చేసుకుంటున్నాడు.

హేలీ చాలా కష్టపడతాడు. కానీ ఆ శ్రమ అతని మొహంలో కనిపించదు. నవ్వుతూ ఉంటాడు. ఎంత ప్రతికూల వాతావరణంలోనైనా నవ్వుతూనే ఉంటాడు. ప్రతి చిన్నదానికీ విసుక్కునే హరీష్‌ని హేలీతో పోల్చుకుంది ఇందు. 'హాయిగా ఎట్లా జీవించాలో హేలీని చూసి నేర్చుకోవాలి ఎవరైనా' అనుకుంది.

ఆ కాల్ సెంటర్ ఉద్యోగం మానేశాక హేలీని సొంతపేరుతో పిలవబోయింది ఇందు. పిలవలేక కాస్త కష్టపడుతుంటే హేలీ వారించాడు. "పేరు అనేది గుర్తుపెట్టుకోవటానికే కదా? హేలీ అని నీకు తెలుసు. అది తేలిగ్గా ఉంది. అట్లాగే పిలు" అన్నాడు.

వారం పోయాక ఇందు, హేలీకి ఫోన్ చేసింది.

"హలో, ఎట్లా ఉన్నావు? " హేలీ అడిగాడు. అతని గొంతు వినగానే ఆనందంగా అనిపించింది.

"బాగున్నాను"

"సరే, పని ఎలా ఉంది? "

"బాగుంది. మరి నేను నీకు లంచ్ టైమ్‌లో పార్టీ ఇవ్వాలనుకుంటున్నాను"

"ఎందుకు? "

"నీమూలంగానే కదా ఈ జాబ్ వచ్చింది"

"నీ ఆహ్వానం మన్నిస్తున్నాను" హేలీ నవ్వేశాడు.

"ఎక్కడ ఇస్తున్నావు? " హేలీ అడిగాడు.

"బ్లూ డైమండ్‌లో బాగుంటుందని ఒక సారి అన్నావు? "

"అదా? అంత ఖరీదైనదెందుకు? "

"మీ ఫ్యామిలీతో వెళ్ళావు కదా? నేనామాత్రం ఇవ్వలేనా? "

"సరే నీ ఇష్టం" అతను నవ్వాడు.

"నీకెప్పుడు వీలవుతుంది? " అడిగింది.

"ఇవాళ నాకు చాలా పనుంది. రాత్రి దాకా ఆఫీసులోనే ఉండాలి. రేపు ఆఫీసుకి లేటుగా వస్తాను. ఎక్కువ తినకుండా వచ్చి, నీ లంచ్ పార్టీకి పూర్తి న్యాయం చేస్తాను" అన్నాడు హేలీ.

అతని భార్యని కూడా పిలుద్దామను కుంది ఇందు. కానీ అది ఏదో ఫార్మల్ పార్టీలాగా అయిపోతుంది. అతను ఇందుకి ప్రత్యేకమైన స్నేహితుడు. ప్రత్యేకమైన మనుషుల్ని ప్రత్యేకంగానే చూడాలి.

ఇంకాస్సేపు మాట్లాడింది ఇందు. ఆమె మనస్సంతా సంతోషంతో నిండిపోయింది. తెలియకుండానే మరుసటిరోజు కోసం ఎదురు చూస్తోంది.

మర్నాడు లంచ్ టైమ్‌లో అతను ఆమె దగ్గరకొచ్చాడు. ఇందు తన మేనేజర్ దగ్గర ఒక గంట పర్మిషన్ కూడా తీసుకుంది. ఏదో మొక్కుబడిగా లంచ్ ముగించటం కాకుండా తన అభిమానం, కృతజ్ఞత అతనికి అందచేయాలంటే కాస్త దీర్ఘమైన లంచ్ ఉంటేనే బాగుంటుందనిపించింది.

"అసలు స్కూటర్ తెద్దామనుకున్నాను గానీ, నీకు అభ్యంతరమేమోనని తేలేదు" అన్నాడు హేలీ.

"తేవాల్సింది. తిరిగి వచ్చేటప్పుడు ఆటోలు దొరుకుతాయో లేదో"

"అనుమానమే. అక్కడికి ఆటో ఎక్కి వచ్చేవాళ్ళు ఎవరూ ఉండరు"

"మనలాంటి వాళ్ళెవరన్నా వస్తే దొరుకుతాయి"

ఆటో హోటల్ ముందు ఆగింది.

"అబ్బా. అప్పుడే వచ్చేశామే" ఇందు ఆశ్చర్యపోయింది.

"అవును. సమయం వేగంగా పరిగెట్టింది"

"సరే. ఎటు వెళ్ళాలో, ఏం చెయ్యాలో కూడా నాకు తెలీదు. నేనెప్పుడూ ఇంట్లాంటి చోట్లకి రాలేదు" అంది ఇందు.

నేను మాత్రం రెగ్యులర్ విజిటర్‌నా ఏంటి? ఏదో మా ఆవిడకి ఇట్లాంటివాటికి రావటం ఇష్టం కాబట్టి. లేకపోతే నాకు తెలిసేది కాదు" అన్నాడు హేలీ.

> ## కొత్తగాలి...
>
> **ఆనందం**
> **పెళ్ళప్పుడే కాదు**
> **విడాకులప్పుడూ**
>
> – *టి.యస్. కళాధర్,*
> *గుంతకల్లు*

ఇందు చుట్టూ చూస్తూ అతనితో పాటే నడుస్తోంది.

"నీకెక్కువ మంది ఫ్రెండ్స్ లేరు కదూ" అన్నాడతను.

"కనిపెట్టేశావే" ఇందు నవ్వేసింది.

ఇద్దరూ డైనింగ్ హాలు చేరుకున్నారు.

అతను ఏమేం తినాలో ఆర్డర్ చేశాడు.

తింటూ, మాట్లాడుతూ టైం ఎలా గడిచిపోయిందో తెలీలేదు.

"నువ్వు చాలా తక్కువ తిన్నావు, నిన్ను పార్టీకి పిలిచాను కాని నిన్ను వదిలి నేనే తినేశాను" అంది ఇందు.

"అసలు సరిగ్గా చూశావా? నేను రాక్ష

సుడిలా తిన్నాను. ఇట్లా వారానికొకసారి తిన్నా చాలు, నూరు కేజీలు అయిపో తాను" హేలీ నవ్వాడు.

ఆ రోజు ఒక తియ్యని జ్ఞాపకం ఇందుకి.

'ఇంత మంచి ఫ్రెండ్ దొరకటం నా అదృష్టం' అనుకుంది మనసులో. మన సంతా తేలిగ్గా, ఆనందంగా ఉంది. మన సునీ, శరీరాన్నీ, పరిసరాల్నీ ఏదో తెలి యని పరిమళం చుట్టుముట్టేసినట్లయింది. అది స్నేహ పరిమళం.

★ ★ ★

ఇందుకి ఈజిప్ట్ అంటే చాలా ఇష్టం. జీవితంలో ఒక్కసారైనా ఈజిప్ట్ చూడాలని ఆశ. ఆ ఎడారులు, పిరమిడ్లు, నైలునదీ, అలెగ్జాండ్రియా తీరం అన్నీ చూడాలని అనిపిస్తుంది.

హేలీకి అదే అభిరుచి ఉన్నట్లు తెలి సింది. ఒకసారి ఎవరితోనో ఒక సి.డి. గురించి మాట్లాడుతున్నాడు. అందులో ఈజిప్టు గురించి అన్నీ వివరంగా ఉంటా యిట. ఏమేం చూడాలో అన్నీ ఉన్నా యట.

కనీసం సి.డి. అయినా చూస్తే చాలని పించింది ఇందుకి.

"ఆ సి.డి. ఎక్కడ దొరుకుతుంది? " అడిగింది హేలీని.

"గ్రేట్ సి.డి. షాప్‌లో" చెప్పాడు హేలీ.

ఇందు నిట్టూర్చింది.

ఒక వారం గడిచింది.

"సి.డి. తెచ్చుకున్నావా? " అతనడిగాడు.

"లేదు"

"ఎందుకని? "

"టైం ఎక్కడుంది? "

"సెలవుల్లో కూడా ఉండదా? " అతను ప్రశ్నించాడు.

"సెలవు రోజులన్నీ ఇల్లు శుభ్ర చేసుకో వటం, బట్టలు ఉతుక్కోవటం, ఇంకేమన్నా పెండింగ్ పడ్డ పనులు చూసుకోవటం ఉంటాయి. ఇంకేం చెయ్యలేకపోతున్నా" విచారంగా చెప్పింది ఇందు.

"మరి సీడీ చూడటానికైనా టైం ఉంటుందా? " హేలీ నవ్వుతూ అడిగాడు.

"ఇంటి పనంతా చేసుకొని ఏ రాత్రి పూటో చూస్తాను" అంది ఇందు.

అతను నవ్వేశాడు. "నీకు టైమ్ మేనేజ్ మెంట్ తెలియాలి. నీకు నిజంగా ఆసక్తి ఉంటే ఎట్లాగో టైమ్ దొరికేట్లు చూసుకుం టావు. రోజుకి ఇరవై నాలుగ్గంటలు, వాడుకో, మానుకో అన్నాడు శ్రీశ్రీ..." అత నింకా చెప్పబోతుంటే ఆమె అడ్డుకుంది.

"ఉద్యోగం చేసే ఆడవాళ్ళకి టైం చాలా తక్కువ దొరుకుతుంది" అంది.

ఆమె మొహం ఎర్రబడింది.

అతను గట్టిగా నవ్వేశాడు.

"నేను అదే చెప్పబోతుంటే అడ్డుపడ్డావు" అన్నాడతను.

ఇందు మౌనంగా ఉంది.

"నీకు ఆవేశం ఎక్కువ. కాస్త సహనంగా ఉండి ఎదుటివాళ్ళు ఏం చెప్తున్నారో వినాలి" అన్నాడు హేలీ.

"థాంక్యూ" అంది ఇందు.

ఇదివరకు ఎవరన్నా తనలో లోపం ఎత్తి చూపిస్తే ఇందుకి చిరాకొచ్చేది. కానీ ఇప్పుడతను ఆమెలో లోపం ఏమిటో చెప్పినా ఎందుకోగానీ కోపం కాలేదు. పైగా అతను చెప్పింది ఆచరించాలనిపిం చింది.

"ఎందుకని? " ఆమె తనని తాను ప్రశ్నించుకుంది. ఎందుకంటే అతను ఏదీ తొందరపడి మాట్లాడడు. బ్యాలెన్స్‌డ్‌గా ఉంటాడు. అందుకే కాబోలు అతనికి పెద్ద స్నేహ బృందం ఉంది. అందరూ అతన్ని అభిమానిస్తారు.

మర్నాడు అతను సి.డి.ని ఆమె డెస్క్ మీద పెట్టాడు.

"వావ్..." ఇందు సి.డి. చూసి మురిసిపోయింది.

చాలా సంతోషంగా అనిపించింది. ఒకటి తను కోరుకున్న సి.డి. దొరికింది. రెండోది తనని పట్టించుకుని, తనకోసం సి.డి.ని తెచ్చే మనిషి ఒకరు ఉండటం.

చిన్న శ్రద్ధ, చిన్నపాటి అభిమానం, కొద్ది ఆప్యాయత చాలు మనిషిని సంతోషపెట్టటానికి.

★ ★ ★

హరీష్ క్యాంప్‌కి వెళ్ళాడు. పాపకి జ్వరం వచ్చింది. ఒళ్ళు కాలిపోతోంది. గుక్కపట్టి ఏడుస్తుంటే ఇందు గుండె జారిపోతోంది. ఏడుస్తూ హరీష్‌కి ఫోన్ చేసింది.

"నాకు చెప్తే ఇక్కడ్నుంచి నేనేం చెయ్యగలను? వెంటనే డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళు" హరీష్ చిరాకు పడ్డాడు.

"మీరు తిరిగి వస్తే నాక్కాస్త ధైర్యంగా ఉంటుంది. ఏం తాగించినా కక్కేస్తోంది. డీ హైడ్రేషన్ అయితే ఎలా? డాక్టరు దగ్గరకు తీసుకెళ్తున్నాను" అంది ఇందు.

"తీసుకెళ్ళు. నాకూ భయంగానే ఉంది. కానీ రావటం కుదరదు. నువ్వే మేనేజ్ చెయ్యి"

ఇందు ఫోన్ పెట్టేసింది.

ఇంతలో హేలీ ఫోన్ చేశాడు.

"భయపడకు వెంటనే పాపను తీసుకుని హర్ష హాస్పిటల్‌కి రా. నేనూ వస్తున్నా" అన్నాడు.

పాపను తీసుకుని ఆటోలో హర్ష హాస్పిటల్‌కి వెళ్ళింది ఇందు. అక్కడ డాక్టర్లు పాపను ఒకరోజు ఉంచాలన్నారు. ట్రీట్‌మెంట్ మొదలు పెట్టారు.

"పాపకేం కాదు. అది సరే, అసలేమన్నా తిన్నావా? అట్లా వేలాడిపోతోంది మొహం" హేలీ ఇందుని ఓదారుస్తూ క్యాంటీన్‌కి తీసుకెళ్ళాడు.

"భోం చేస్తావా? " అడిగాడు.

"వద్దు" ఏడుస్తూనే తల అడ్డంగా ఊపింది.

"అయితే చపాతీ అయినా తిను" హేలీ చపాతీ తీసుకొచ్చాడు.

ఒకగంటలో పాప పరిస్థితి మెరుగైంది.

హేలీ దేవుడిలాగే కనిపించాడు. ఇందుకి రోజురోజుకీ హేలీ మీద అభిమానం పెరిగిపోతోంది.

విమల ప్రతీ మగవాడూ ఒక అవకాశవాదేనని తేల్చిచెప్పాక ఇందుకి మగవాళ్ళంటే ఒకమాదిరి భయం బయల్దేరింది. నిజానికి మగవాళ్ళతో ఎట్లా జాగ్రత్తగా మసలుకోవాలో ఆడపిల్లలకి చెప్పని తల్లిదండ్రులు ఉండరు. ఇవన్నీ చాలక ఎవరో మహానుభావుడు ఆ మధ్య ఒకవ్యాసం కూడా రాశాడు. అందులో మగవాడు ఆడవాళ్ళని ఎన్ని రకాలుగా మోసగిస్తాడో వివరించాడు. ఇందు ఆ వ్యాసం కూడా చదివింది. ఆడవాళ్ళని ఆకర్షించటానికి మగవాడు ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. అవేమంటే - మొదట మంచివాడిలా కనిపించటానికి ప్రయత్నిస్తాడు. మృదువుగా, ఆహ్లాదంగా, మనోహరంగా మాట్లాడుతాడు. శ్రద్ధ, ఆపేక్ష, కనబరుస్తాడు. సాయం చేస్తానని తనే ముందుకి వస్తాడు. చిన్న చిన్న కానుకలు ఇస్తాడు. పొగుడుతాడు.

ఇవన్నీ ఏ మగవాడూ పెళ్ళాం విషయంలో మాత్రం చెయ్యడు. ఒక్కోసారి కొందరు మగాళ్ళు భార్య ముందు మంచివాడిలా కనబడాలని ప్రయత్నిస్తారు. పెళ్ళాంతో మనోహరంగా మాట్లాడాలని చూసే మగవాళ్లు మాత్రం కోటికి ఒకడు కూడా ఉంటాడో లేదో?

హేలీ కూడా తనముందు నటిస్తున్నాడా? ఇందుకి ఎక్కడో కొద్దిగా అనుమానం కలిగింది. కానీ ఎందుకు? ఎందుకు చేస్తాడు? తనకన్నా చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉన్న అమ్మా

యిలెంతో మంది అతనికి తెలుసు. ఒక వేళ ఏమన్నా ట్రిక్కులు చెయ్యాలన్నా వాళ్ళముందు చేస్తాడేమోగానీ తన దగ్గర చెయ్యాల్సిన అవసరం ఏముంది?

★ ★ ★

ఆ రోజు ఇందు హేలీకి ఫోన్‌చేసింది.

స్విచాఫ్ చేసి ఉంది.

ఆఫీసులో సెక్షన్‌కి ఫోన్ చేసింది. ఆరోజు హేలీ రాలేదని చెప్పారు.

అతను ఫోన్ చేస్తాడేమోనని చూసింది. చెయ్యలేదు.

ఏం జరిగింది? ఇందుకి భయం వేసింది. ఏదో పని చేసుకుంటూ కాస్సేపు గడిపింది

మళ్ళీ రింగ్ చేసింది. స్విచాఫ్ చేసి ఉంది.

ఇందుకి దిగులుగా ఉంది. అసలేమైందో అర్థంకాలేదు. భయంవేసింది. పనిలో ధ్యానం ఉంచలేకపోతోంది. పిచ్చిగా అతని ఫోన్‌కాల్ కోసం ఎదురుచూసింది. మధ్యలో కాసేపు పని, మరికాసేపు మళ్ళీ ఫోన్ చెయ్యటం. చివరికి సాయంత్రానికి అతని ఫోన్ మోగింది.

"ఏం జరిగింది? ఎన్నో సార్లు ట్రై చేశాను.. స్విచ్ ఆఫ్ చేసి ఉంది.. ఎందుకని? " ఆత్రుతగా అడిగింది ఇందు.

"మా మిసెస్ తరఫు బంధువుల ఇంట్లో ఫంక్షన్ ఉంది. వెళతామో లేదో అని ఆఫీసులో కూడా ముందు చెప్పలేదు. తను బలవంతం చేస్తే వెళ్ళాల్సివచ్చింది" అన్నాడు హేలీ.

"మరి ఫోన్ స్విచాఫ్ చేశావేం? "

"నేను చెయ్యలేదు. అక్కడ సిగ్నల్స్ లేవో ఏమో.. ఫోన్ మోగలేదు"

ఇందుకి ఆత్రుత తగ్గి కోపం వచ్చింది.

"నాకు ముందు చెప్పాల్సింది" అంది.

"అయ్యో, కోపం దేనికీ? నేనేమైనా ఊరు విడిచి పారిపోయానా? అయినా సరే, సారీ. సరేనా? "

అయినా ఇందుకి కోపం తగ్గనేలేదు.

"నాకు చెప్పకుండా ఎటో వెళ్ళిపోయావు. నాకు చెప్పాలన్న ధ్యాసే లేదు నీకు. అసలు సిగ్నల్స్ పనిచేస్తున్నాయో లేదో పట్టించుకునేది కూడా లేదు" అంది సాధిస్తూ.

అతనికి కొద్దిగా చిరాకు కలిగినట్లుంది.

"నన్ను కంట్రోల్ చెయ్యాలని చూస్తున్నావా? మా అమ్మ కూడా ఎప్పుడూ ఇట్లా మాట్లాడలేదు" అన్నాడు.

"అయినా సరే, నువ్వు మాత్రం నాకు చెప్పి వెళ్లాలి" అంది ఇందు.

"నన్ను కంట్రోల్ చెయ్యటానికి నువ్వెవరివి? " హేలీ అడిగాడు.

అతను ఇందాక కొద్దిగా చిరాకుగా ఉన్నా ఇప్పుడు మాత్రం నవ్వుతూనే అడిగాడు. అతని తీరే ఎప్పుడూ సరదాగా ఉండటం.. అయినా ఇందు ఆ సమయంలో ఆ సంగతి మర్చిపోయింది. అందువల్ల ఆమె అహం మరింత గాయపడి కోపం ఇంకాస్త పెరిగింది.

ఎవరిమీదన్నా అధికారం రావటానికి అర్హత కూడా ఉండాలి. తల్లిదండ్రులకి, భార్యకి లేక భర్తకి ఒక మనిషి జవాబుదారీ అవుతాడు. కానీ స్నేహితులకి కూడా ఆ హక్కు ఉంటుంది. స్నేహంలో ప్రేమ, ఆపేక్ష ఉంటాయి. కాబట్టి స్నేహితుడి మంచి చెడ్డలు, రాకపోకలు తెలుసుకునే అర్హత ఉంటుంది.

"నేనెవరని అడుగుతున్నావా? " ఆమె కోపంగా అడిగింది.

"అవును" హేలీ సరదాగా అన్నా, ఇందు గ్రహించలేకపోయింది.

"నేను నీ ఫ్రెండ్‌ని కాదా? " ఇందు కోపంగా అడిగింది.

"అవునా? అయితే స్నేహితులు ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకోవాలి గానీ, కోపం తెచ్చు

కుంటారా? ప్లీజ్.. అర్థం చేసుకోవూ? " అన్నాడతను ప్రార్థిస్తున్నట్లు.

ఇందు నవ్వేసింది.

సహజంగానే అతను స్నేహశీలి. అందరికీ సాయం చేయాలనే గుణం ఉంది. అతని స్నేహబృందంలో అబ్బాయిలూ ఉన్నారు. అమ్మాయిలూ ఉన్నారు. అందరికీ సాయం చేస్తాడు. సలహాలిస్తాడు. ఒక్కోసారి అతను అప్పులిస్తే తిరిగి ఇవ్వకుండా ఎగ్గొట్టిన వాళ్ళున్నారు. అయినా పట్టించుకోడు.

వేరేవాళ్ళతో ఉన్నట్లే తనతోనూ ఉంటాడు. అతని సహజ సిద్ధమైన స్వభావాన్ని వేరేవిధంగా ఆలోచించి అనుమానించటం తప్పు.

అది అర్థమయ్యాక ఇందు అతనితో మరింత స్నేహంగా, చనువుగా ఉంటోంది.




**ఇం**దుకి హేలీతో మాట్లాడటం ఒక అలవాటుగా మారిపోయింది. పరం, షీనా, షీలా లాంటి వాళ్ళ మధ్య పనిచేసి వచ్చాక హేలీ లాంటి మనిషితో పాటు పని చేయటం అంటే మండుటెండలో నుంచి మంచు తెరల్లోకి వచ్చినట్లే.

ఆమెకి అతనిలో అన్నిటికంటే నచ్చినదేంటంటే ఎప్పుడూ ఎవర్నీ నొప్పించకపోవటం, పరుషంగా మాట్లాడకుండా ఉండటం.

రోజుకి ఒక్కసారన్నా ఫోన్ చేస్తుంది. మెల్లగా ఆ అలవాటుగా వీలున్నప్పుడల్లా, సమయం దొరకగానే ఫోన్ చెయ్యటంలోకి మారింది.

అతనితో ఎంతసేపు మాట్లాడినా బోర్ కొట్టదు. అతనితో మాట్లాడుతుంటే చాలా సంతోషంగా అనిపిస్తుంది కూడా.

"నెక్లెస్‌రోడ్‌లో నర్సరీ ఎగ్జిబిషన్ ఉంది. నిన్న టీవీలో చూపించారు. ఎంత బాగుందో తెలుసా? ఎన్ని రకాలున్నాయో? ఆ మధ్య నేను కొన్ని కుండీలు కొని మట్టితో నింపాను. కానీ మొక్కలు పెట్టటానికి టైమ్ దొరకటం లేదు" అంది ఇందు.

"ఆదివారాలు వెళ్ళొచ్చుగా? " అన్నాడు హేలీ.

"ఆయనకి టైమ్ ఉండదు"

"నువ్వొక్క దానివే వెళ్ళలేవా? ఎంతో మంది ఆడవాళ్ళు ఒక్కళ్ళే వచ్చి కొనుక్కుని పోవడం లేదు? " అన్నాడు హేలీ.

ఆమెభర్త కూడా అదేమాట చాలా సార్లు అన్నాడు. అన్న ప్రతిసారీ ఇందుకి కోపం ముంచుకొచ్చేది. బాధ కలిగేది. కానీ హేలీ మీద కోపం రాలేదు.

"పాపతో మేనేజ్ చెయ్యలేను" అంది.

"సరే, అయితే సాయంత్రం మనిద్దరం వెళ్దాం. మొక్కలు కొన్నాక నువ్వు ఇంటికి వెళ్ళిపోవచ్చు" అన్నాడతను.

"సరే" అంది ఇందు.

సాయంత్రం ఇద్దరూ దగ్గర్లో ఉన్న హోటల్‌కి వెళ్ళి పూరీ తిని టీ తాగారు. ఎగ్జిబిషన్‌కి వెళ్ళారు.

లిల్లీలు, మల్లెలు, మందారాలు, గులాబీలులాంటి పూలమొక్కలు, క్రోటన్స్, ఆయుర్వేదంలోని కొన్ని మొక్కలు, ఒకటేమిటి.. రకరకాల మొక్కలతో నర్సరీ ఎగ్జిబిషన్ కళకళలాడిపోతుంది. వాళ్ళు వెళ్ళేసరికి చీకటిపడి, పూలు లైట్లకాంతిలో

వింత వెలుగులో మెరుస్తున్నాయి. అంతా ఆహ్లాదకరమైన వాతావరణం. కొన్ని మొక్కలనైతే ఇందు అంతకుముందు చూడను కూడా లేదు.

"అబ్బా! ఇక్కడ ఎంత బాగుందో" సంతోషంగా అంది.

లేత పసుపు, ఎరుపు, ఆరెంజ్ రంగుల గులాబీల మొక్కలు కొన్నది. హేలీ డబ్బు లిచ్చాడు.

"వద్దు. నేను కదా ఇక్కడికి రావాల న్నది. నాకుతోడు వచ్చావు, చాలు" అంది ఇందు.

"అందులో నా స్వార్థం ఉంది. నేను కొన్నాను కాబట్టి వాటి వంక చూసినప్పు డల్లా నేను గుర్తువస్తాను" అన్నాడు హేలీ.

"అవునా? అయితే నా స్వార్థం నేనూ చూసుకోవాలికదా? ఇదుగో ఈ మొక్కలు నా గుర్తుగా నీకోసం కొంటున్నాను" అంటూ ఇందు మూడు మొక్కలు కొన్నది. ఒకటి మల్లె, ఒకటి లిల్లీ, మరొకటి గులాబీ మొక్క.

"వద్దు" అన్నాడు హేలీ. ఇందు విన లేదు. మొక్కల్ని తీసుకుని, ఆటోలో తిరిగి వెళ్ళి, పాపను తీసుకున్నాక హేలీ మళ్ళీ ఆఫీసు దగ్గర దిగిపోయాడు. ఇందు ఆటోలో ఇంటికి తిరిగి వెళ్ళింది.

హేలీ చెప్పింది నూటికి నూరు శాతం నిజం అనిపించింది. మొక్కల్ని కుండీల్లోకి మారుస్తున్నప్పుడల్లా, నీళ్ళు పోస్తున్న ప్పుడూ హేలీ గుర్తుకొచ్చాడు. చెట్టుమీద నీళ్ళు చల్లేసరికి నీటి బిందువులు ముత్యాల్లా మెరుస్తూ ముత్యాలు పూసిన



చెట్లలా ఉన్నాయి.

వెంటనే హేలీకి ఫోన్ చేసింది.

"మొక్కలు బాగున్నాయి. మొగ్గలు కూడా ఉన్నాయి కదా, తొందర్లోనే పూస్తాయి" చెప్పింది.

"నా మొక్కలూ అంతే" హేలీ నవ్వాడు.

"చెట్లని చూస్తుంటే ఎంత బాగుందో. నువ్వన్నట్లే వాటివైపు చూస్తే నువ్వే గుర్తు వస్తున్నావు" అంది ఇందు.

"నాకూ అంతే" హేలీ మళ్ళీ నవ్వాడు.

★ ★ ★

ఇందు ఫోన్‌బిల్ రోజురోజుకీ పెరిగిపోతోంది. ఇందుకి అది ఏమాత్రం లెక్కగా అనిపించటం లేదు. ఏవేవో మాట్లాడుకుంటూనే ఉంటారు. ఎంతసేపు మాట్లాడినా బోర్ కొట్టదు.

"నాకీ ఉద్యోగం నచ్చలేదు" అన్నాడు హేలీ ఒకరోజు.

ఇందు అదిరిపడింది. "ఏం? ఎందుకని నచ్చలేదు? " ఆత్రుతగా అడిగింది.

"ఏం లేదు. ఇది వరకు వేరే చోట్లకి కూడా వెళ్ళి సంపాదించేవాడిని. ఇప్పుడు ఇక్కడే సరిపోతుంది. నా ఖర్చు రోజురోజుకీ పెరిగిపోతుంది. ఇక్కడ ప్రమోషన్ వచ్చే ఛాన్సులు కూడా లేవు. ఇంకో ఉద్యోగం చూసుకోవటం మంచిదనిపిస్తోంది" అన్నాడు హేలీ.

ఇందు మౌనంగా వింటోంది.

"గీత వాళ్ళన్నయ్య బెంగళూరు రమ్మంటున్నాడు. అక్కడ బాగా జీతం వచ్చే ఉద్యోగం దొరికే ఛాన్సుందిట" అన్నాడు.

గీత హేలీ భార్య.



ఇందుకి నెత్తిన పిడుగు పడ్డట్లయింది. అతడిని చూడకుండా ఉండటం ఎలా? అసంభవం అనిపించింది.

"వద్దు. వేరే ఊరికి వెళ్ళకు. మళ్ళీ అక్కడ నిలదొక్కుకునే దాకా ఎట్లా? ఇల్లు నుండి మొదలుపెట్టి అన్నీ కొత్తగా వెతుక్కోవాలి. ఇక్కడే ఏదన్నా మంచి ఉద్యోగం చూసుకోవటం నయం. తప్పకుండా వస్తుంది" అంది ఇందు.

ఆమెగొంతు వణికింది.

"అవును. మళ్ళీ ఆ కొత్తఊర్లో అన్నీ చూసుకోవాలి" అన్నాడు హేలీ.

"అంతేనా? " అడిగింది ఇందు.

"అంతేనా అంటే? " అతను అడిగాడు.

ఇందు మౌనంగా ఉంది. 'నిన్ను వదిలి వేరే ఊరికి వెళ్ళటం నాకూ కష్టం' అంటాడేమోనని చూసింది.

"ఇక్కడే ఉద్యోగం చూసుకో" అంది.

"చూద్దాం"

"అయితే ప్రయత్నించు. తప్పకుండా దొరుకుతుంది"

"ప్రయత్నిస్తాను" అన్నాడు హేలీ.

"నీకు మంచి ఉద్యోగం రావాలని దేవుడ్ని ప్రార్థిస్తాను"

"థ్యాంక్యూ" అన్నాడు హేలీ.

ఇందు ఊరికే అనలేదు. బోలెడంత ప్రార్థించింది. గుడికి వెళ్ళి కొబ్బరి కాయ కొట్టింది. సాష్టాంగపడి వేడుకుంది.

అతను కూడా ప్రయత్నాలు ముమ్మరం చేశాడు. చివరకు అతని ప్రయత్నాలు, ఆమె పూజలు ఫలించాయి.

అతనికి మంచి ఉద్యోగం దొరికింది. జీతం ఇక్కడకన్నా బాగా ఎక్కువ. వేరే అలవెన్స్‌లు కూడా ఉన్నాయి. అన్నిటికన్నా కొత్త ఆఫీసు ఉన్నది కూడా పక్క వీధిలోనే.

"నేనెంత ప్రార్థించానో తెలుసా? " ఇందు సంతోషంతో ఉప్పొంగిపోతూ అంది.

హేలీ తనకు చాలా గొప్ప స్నేహితుడు. అతనికి ఈ జాబ్ దొరక్కపోతే ఎటో వెళ్ళిపోయేవాడు. అట్లా వెళ్ళకుండా ఈ ఊళ్ళోనే, అందునా పక్కవీధిలోనే దొరికింది. ఎంతో సంతోషంగా అనిపించింది.

"నీకు మంచి పార్టీ ఇస్తాను" అంది సంతోషంగా. "వద్దు. నాకు మంచి ఉద్యోగమొచ్చింది కాబట్టి నేనే ఇస్తాను"

"అదేంకాదు, నేనెంత సంతోషపడుతున్నానో తెల్సా? నువ్వు ఊహించలేవసలు"

"ఊహించగలను. నువ్వెక్కడికో వెళ్ళిపోతే ఎట్లా ఉంటుందో ఊహించుకున్నాను.. ఎంత బాధ అనిపించిందో తెలుసా? "

"చాలు. అది చాలు" అంది ఇందు మృదువుగా. ఇద్దరి ఆఫీసులూ దగ్గరే కాబట్టి తరచూ కలుసుకుంటూనే ఉన్నారు. ఇద్దరి మధ్యా చనువు మరింత పెరిగింది.

ఇందు హేలీకి మానసికంగా బాగా దగ్గరైంది. ఎంత కలుపుగోలు మనిషి అయినా హేలీకి కూడా కొంత మందితో చేదు అనుభవాలు అవుతూనే ఉంటాయి. అవి సాధారణంగా అతను పట్టించుకోనే పట్టించుకోడు. కానీ ఒక్కోసారి మాత్రం కాస్త బాధ పడతాడు. అప్పుడు మాత్రం ఇందుతో షేర్ చేసుకుంటాడు. స్నేహం అంటే బాధల్ని, సుఖాల్ని పంచుకోవటమే కదా? ఏదన్నా సంతోషకరమైన సంఘటన జరిగినప్పుడు స్నేహితులతో కలిసి పార్టీ చేసుకోవటం, బాధ అనిపిస్తే మిత్రులతో చెప్పుకోటం ఎవరికైనా సహజమే.

ఇందు కూడా అట్లాగే అతనితో కష్టసుఖాలు చెప్పుకుంటుంది. ఇందుకి సుఖాలు తక్కువ, కష్టాలు ఎక్కువ. కాబట్టి తన బాధలన్నీ అతనికి చెప్పుకుంటుంది. అతను విని ఓదారుస్తాడు. ఆ ఓదార్పు, ఆ సాంత్వన ఎంత బాగుంటుందంటే ఇందుకి ఆ బాధ మొత్తం చేత్తో తీసేసినట్లు

పోతుంది.

"అబ్బ. ఇందాక ఎంతకష్టంగా ఉందో తెలుసా? గుండె బరువుగా, తలనెప్పిగా, గొంతు పట్టేసినట్లు, ఎంత కష్టంగా తోచిందో, నీతో చెప్పుకున్నాక అంతా పోయింది" అంటుంది.

"పోక ఏం చేస్తుంది! అదంతా నాకు ట్రాన్స్‌ఫర్ చేసేశావుగా" హేలీ నవ్వేస్తాడు.

"అయితే ఇంకేం చెప్పను"

"వద్దు వద్దు. జోక్ చేశా" హేలీ నవ్వుతాడు. ఇందు కూడా నవ్వేస్తుంది.

ఇందు అతనికి దాదాపు అన్నీ చెప్పుకుంది. ఆఖరికి భర్త హరీష్‌తో చెప్పుకోనివి కూడా చెప్పుకుంది. చివరికి స్త్రీలతో చెప్పుకోవటానికి కూడా సందేహించే సంఘటనలైన, పరం తనను తాకాలని ఎంత తాపత్రయ పడేవాడో, ఒకసారి సెక్సీఫొటో చూపి ఎట్లా భయపెట్టాడో చెప్పేసింది.

"చెప్పు తీసుకుని కొట్టాల్సింది వాడిని. అసలు నువ్వెట్లా ఊరుకున్నావ్" హేలీ ఆవేశపడ్డాడు.

"నాకు రక్తం మరిగిపోతోంది. నేను అక్కడ ఉండి ఉంటేనా రుజువులు, సాక్ష్యాలతో అంతా ఏ సెల్‌ఫోన్‌లోనో చిత్రీకరించి, వాడ్ని బొక్కలోకి తోయించేవాడ్ని. ఆడవాళ్ళంటే ఏమనుకుంటున్నాడు? " ఇందు మౌనంగా ఉండటం చూసి హేలీ కోపంగా అన్నాడు మళ్ళీ.

"నాక్కూడా రక్తం మరిగి పోయేది. కానీ ఏం చెయ్యలేని అశక్తత..." బాధపడింది.

"పోన్లే. మర్చిపో. అవన్నీ అయిపోయాయి. ఇంక నీ మనసులో కూడా ఆ పీడ సంఘటనలు తల్చుకోకు"

"అంతే" అంది ఇందు.

హేలీ గురించి తను తక్కువ అంచనా వేసిందని ఇందుకి వారం రోజుల్లో అర్థమైపోయింది.

ఆమె ఎన్నడూ అనుకోని సంఘటనలు జరిగాయి. పరం, షీనా ఏమయ్యారో కూడా ఆ తర్వాత, అంటే అక్కడి నుంచి వచ్చాక ఇందు పట్టించుకోలేదు.

ఆ రోజు పేపర్లలో, ఛానల్స్‌లో ఒకటే గొడవ.

పరం తన ఆఫీసులో పనిచేస్తున్న అమ్మాయితో వెకిలిగా ప్రవర్తించాడు. అతని తీరే అది. ఏం కాదనుకుని ధైర్యంగా ఉన్నాడు. కానీ హేలీ ఎట్లాగో ఆ అమ్మాయిని కలుసుకున్నాడట. ఆడవాళ్ళ కోసం పనిచేసే సంస్థల వ్యక్తులు అతనికి సాయం చేశారు. ఆ అమ్మాయిని ఏం పట్టనట్లు అమాయకంగా ఉండిపొమ్మని చెప్పారు. ఆ అమ్మాయి కూడా పాపం

## కొత్తగాలి...

**నీళ్లకు కూడా**
**విసుగొచ్చింది**
**యజ్ఞమనే మాట**
**జలానికి తగిలించినందుకు**

– వి.ఎస్. రమణమూర్తి,
హైదరాబాద్

ఇందులాగే మెతక మనిషి. అందుకే పరం విజృంభించాడు. పరంకి తెలియకుండా అదంతా చిత్రీకరించారు. పరం అడ్డంగా దొరికిపోయాడు. మహిళా సంఘాలు, ఇతర సంస్థలవ్యక్తులు అంతా కలిసి పరంకి గడ్డి పెట్టారు. ఛీ కొట్టారు. తిట్టారు. కొందరైతే చీపుళ్లతో కొట్టి, దేహశుద్ధి చేస్తామని ముందుకి వచ్చారు. పరం బిక్కచచ్చిపోయాడు. మనిషి శవంలా తయారయ్యాడు. "క్షమించండమ్మా" అంటూ ఆ ఆడవాళ్ళందరి కాళ్ళమీద కూడా పడటానికి సిద్ధమయ్యాడు. ఏడుస్తున్నాడు.

అదంతా కలా నిజమా ఇందుకి అర్థం కావటంలేదు. ఎంతో సంతోషంగా అనిపించింది. ఆనాడు పొట్ట చేత్తో పట్టుకుని, ఇంటెడు చాకిరీ చేసుకుని, పసిపిల్లను మేనేజ్ చేసుకుంటూ నిజాయితీగా కష్టపడి పనిచేద్దామని వెళ్ళిన తనను పరం ఎంత బాధపెట్టాడు. పీడించాడు. హడల గొట్టాడు. తనకి కళ్ళనీళ్ళు రాని రోజు ఉండేది కాదు. తనకి జరిగిందని కాదు గానీ, ఇట్లాంటి చీడపురుగులకి బుద్ధి చెప్పి తీరాలి. తనకి ఆ ఉద్యోగం బాగా అవసరమే. అయినా కనీసం ఇంకో ఉద్యోగం దొరికేదాకా ఆగగలిగే స్థోమత అయినా తనకి ఉంది. కానీ ఏదారీ లేక ఆ ఉద్యోగమే గతి అని చేరే అమాయకపు ఆడపిల్లల్ని పీడించే పరంలాంటి వ్యక్తులకి ఇట్లాగే బుద్ధి చెప్పాలి. వాడ్ని చూసి అయినా వేరేవాళ్ళు ఎట్లాంటి బుద్ధులున్నా కనీసం భయంతోనైనా బుద్ధిగా ఉంటారు.

"హ్యాపీనా? " అన్నాడు హేలీ.

హేలీ పక్కన ఇంకొక యువకుడున్నాడు. కొంచెంసేపు ఏవో మాట్లాడి వెళ్ళిపోయాడు. అతని మాటలను బట్టీ అతను ఏదో స్వచ్ఛంద సంస్థలో పనిచేస్తున్నాడని ఇందుకి అర్థమైంది. పరం గురించి ప్రసక్తి వచ్చింది కూడా.

"అతని మూలంగానే పరంను రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోగలిగాం" చెప్పాడు హేలీ.

"అంటే? " ఇందు ఆశ్చర్యపోయింది. తను చెప్పిన మాటల్ని హేలీ మర్చిపోలేదన్నమాట. తనకోసం ఇంత చేశాడా?

"అవును. నిన్నంత బాధపెట్టిన మనిషిని ఊరికే వదులుతానా? చూశావుగా.. వాడికెంత పరాభవం జరిగిందో!" అన్నాడు హేలీ.

"థాంక్యూ హేలీ.. థాంక్యూ" ఇందుకి సంతోషంతో మనసు ఉప్పొంగిపోయింది.

ఒకటి నిన్ను కష్టపెట్టిన వెధవకి తగిన శాస్తి జరిగింది. రెండోది వాడ్నిలాగే వదిలేస్తే ఇట్లాగే పెట్రేగుతాడు" అన్నాడు హేలీ.

"అవును. దీన్ని సెలబ్రేట్ చేసుకోవాలి" అంది ఇందు. ఇద్దరూ ఆ రోజు లంచ్‌కి బయటకు వెళ్ళారు.

పరం సంగతే కాదు, షీనా సంగతి కూడా చెప్పి బాధపడేది ఇందు.

"ఇందూ.. నీకింకో సంగతి చెప్పాలి. పరం గురించి ఇంత గొడవ జరిగినందువల్ల మేనేజ్‌మెంట్‌కి అతని మీద చాలా కోపం వచ్చింది. వాడిలాంటి వాడని చెప్పకుండా మాకు ఎప్పుడూ మంచి రిపోర్ట్ ఎందుకు ఇచ్చావని షీనా మీద విరుచుకు పడ్డారు. ఆమెకి కూడా ఏదో పనిష్మెంట్, అంటే రివర్షన్ లాంటిది వస్తుందని విన్నాను" అన్నాడు హేలీ.

షీనాకి కూడా ఇన్నాళ్ళకి శాస్తి జరుగుతోందన్నమాట. తనకింది అమ్మాయిల్ని పురుగుల్లా చూస్తూ పరంకి వంతపాడుకుంటూ, అతడ్ని అగ్రభాగాన నిలబెట్టిన షీనామొహం ఇప్పుడెలా మారివుంటుందో.

షీనా తనని ఎట్లా పీక్కుని తిన్నదో మళ్ళీ చెప్పి బాధపడింది ఇందు.

"షీనాలాంటి వాళ్ళు చాలామంది ఉంటారు. కొద్దో గొప్పో అందం, కాస్తంత తెలివితేటలు ఉండగానే తమంతవారు లేరని విర్రవీగుతారు. వాళ్ళ వెర్రితనాన్ని ఇంకాస్త పెంచేవాళ్ళు కొందరు తయారై ఇంకాస్త చెడగొడతారు. మనిషి తనని తాను బేరీజు వేసుకుని, నేనేంటి? ఏం చెయ్యగలను? అని తెలుసుకోవాలి. ఏదో సాధించాలని అనుకోనిది ఎవరూ బాగుపడరు. కానీ అత్యాశ, దురాశ పనికి రావు. ఉన్నదానితో తృప్తిపడితే బాగుంటుంది. అట్లాకాక ఇంకా ఏదో రాలేదని ఏడ్చి, తామేడుస్తూ అందర్నీ ఏడ్పించుతారు షీనాలాంటి వాళ్ళు. ఆమె స్థితికి ఆ ఉద్యోగమే

చాలా ఎక్కువ. ఇంకా ఏదో గొప్ప లెవెల్ కి చేరలేదని ఏడుస్తూ శాడిస్ట్‌లాగా తయారైనట్లుంది" అన్నాడు హేలీ.

పరంకి జరిగిన పరాభవాన్ని హరీష్ కూడా టి.వి.లో చూశాడు.

"అది నువ్వు ఇదివరకు పనిచేసిన ఆఫీసులాగా ఉందే? వాడెవడూ? నీతో కూడా ఇట్లా ఏమన్నా చేశాడా?" అడిగాడు హరీష్.

"ఆ ఆఫీసులో పనిచేసిన విషయం మర్చిపోయాను" అనేసింది ఇందు.

లోపల హరీష్ మీద కోపం వచ్చింది. 'ఆనాడు అసలేంటి నీ బాధ?' అనికూడా అడగని మనిషి, ఇప్పుడు కుశలం అడుగుతున్నాడు.

★ ★ ★

కొన్నిటిని జరగకుండా, చిన్న నిర్ణయంతో మార్చుకోవచ్చు. కొన్ని మహమ్మారులనూ ముందుజాగ్రత్తతో నివారించుకోవచ్చు. ఒక చిన్న జాగ్రత్త, జీవితాన్ని కాపాడుతుంది. సరైన సమయంలో సరైన నిర్ణయం ఎన్నో ప్రమాదాల నుంచి కాపాడుతుంది.

ప్రేమ ఒక ప్రమాదంలాంటిదే. ఎప్పుడు, ఎక్కడ జరుగుతుందో ఎవరికీ తెలియదు. ఎవరు, ఎప్పుడు, ఎలా ప్రేమలో పడతారో ఎవరికీ తెలియదు. ఒకసారి ప్రేమలో పడ్డాక మళ్ళీ బయటకు రావటమంటూ ఉండదు. అది ఒక ఊబి.

ప్రేమ ప్రమాదానికీ, రోడ్డు ప్రమాదాలకీ సూక్ష్మమైన తేడా ఉంది. రోడ్డు ప్రమాదాలు క్షణంలో, రెప్పపాటులో జరిగిపోతాయి. ఏమయిందో తెలిసేలోపలే అంతా అయిపోతుంది. కానీ ప్రేమ అట్లాంటి ప్రమాదం కాదు. తొలిచూపులో ప్రేమ చాలా చాలా అరుదు. ప్రేమ అనేది అనేక మలుపులు తిరుగుతుంది. మొదట ఆ మనిషి మీద ఇష్టం కలిగి నెమ్మదిగా ప్రేమగా పరిణమిస్తుంది. ఈ పరిణామదశలో ఎవరైనా దానిలోంచి తేలిగ్గా బయటపడవచ్చు. కానీ ఎవరూ అట్లా రావటానికి ఇష్టపడరు. ఎందుకంటే ప్రేమ ఇచ్చే కైపూ, కిక్కూ ఏ మత్తుమందూ ఇవ్వదు. ఆ మత్తులోంచి బయటకు రావటం ఎవరికీ ఇష్టం ఉండదు.

## పూజాగృహం ఎక్కడ?

ఒకసారి ఒక సనాతన సదాచార పరాయణుడైన మిత్రుడు సంజీవదేవ్ ఇంటికి వచ్చాడు. స్నానానంతరం తాను పూజ చేసుకునే నిమిత్తం 'మీ ఇంటి పూజాగృహం ప్రత్యేకంగా ఎక్కడ ఉంది? ఎంత వెతికినా కన్పించట్లేదే?' అని అడిగాడు.



దానికి సంజీవదేవ్ 'మా ఇంట్లో ప్రత్యేకించి పూజ నిమిత్తం వేరేగది ఉండదు. ఇల్లంతా పూజాగృహమే. కనుక మీరు మరుగుదొడ్డిలో కూచొని పూజ చేసుకున్నా ఫరవాలేదు. అది కూడా మనకు సమానమైన పవిత్ర స్థలమే. పూజాస్థలం కాని తావు అంటూ భూమిపైకాని, ఆకాశంలో కాని, సాగరాల్లో కాని ఎక్కడాలేదు. ఈ విశ్వమంతా కూడా తమకు పూజాగృహమే. కృష్ణశాస్త్రిగారు గానం చేసినట్లు- విశ్వమంతా ప్రాణవిభుని మందిరమే' అన్నారు.

దాంతో సహృదయుడైన ఆ మిత్రుడు 'మీ ద్వారా ఈరోజు నేనొక కొత్త విషయం తెలుసుకున్నాను' అని జవాబిచ్చాడు సంతోషంతో.

ప్రేమలో పడ్డాక ఆ రోగ లక్షణాలేం టంటే ప్రేమికుల కోసం పిచ్చిగా వేచి ఉండటం, అతను లేదా ఆమె ఎక్కడ కన బడతారోనని వెతుక్కోవటం, ప్రేమించిన వారిని చూడాలని తహతహలాడటం. ఈ లక్షణాలు తనలో మొదలైనాయని తెలిసినా వాటిని వదిలించుకోవాలని చూడరు.

ఇందుకి అర్థమవుతూనే ఉంది. తనకి హేలీ మీద చాలాఇష్టం ఉందనీ. అయినా హేలీని తల్చుకోవటం, మాట్లాడటం మాన లేదు. హేలీని తల్చుకోగానే పెదవుల మీద చిరునవ్వు వస్తుంది. అతడితో మాట్లాడాలని తపించిపోతోంది.

ఎప్పుడైనా పుస్తకాలుగానీ మరేదన్నా కానీ తీసుకునేటప్పుడు చేతులు తాకుతాయి. ఏ స్పందనా కలగనంతకాలం అది స్నేహం. వేరే స్పందనలు మొదలైతే ప్రేమ. రసాయనిక ప్రక్రియ ప్రారంభం అయిందని తెలుసుకోవాలి. అతన్ని చూసి సిగ్గుతో బుగ్గలు ఎర్రబడినప్పుడైనా అది ప్రేమ అని తెలుసుకోవాలి. కానీ ఇందు తెలుసుకోలేదు.

★ ★ ★

ఆ రోజు ఇందుకి హేలీతో లంచ్ చెయ్యాలనిపించింది. తన బ్యాగ్ తీసుకుని అతని ఆఫీసువైపు బయల్దేరింది. అతనికి రింగ్ చెయ్యలేదు. లంచ్ టైమ్‌లో హేలీ ఎటూ వెళ్ళడు, ఆఫీస్‌లోనే ఉంటాడు. లేకపోతే ఇందు దగ్గరకే వస్తాడు. సాధారణంగా లంచ్‌బాక్స్ ఇంట్లోంచి తెచ్చుకుని తింటాడు. ఎప్పుడైనా తేలేకపోతే దగ్గర్లో ఉన్న చిన్న హోటల్‌కి వెళ్తాడు. ఎక్కడో ఒకచోట దగ్గర్లోనే ఉంటాడు కాబట్టి, అంతగా కనబడకపోతే, అప్పుడే ఫోన్ చేస్తే వచ్చేస్తాడు.

'హఠాత్తుగా అతని ముందు ప్రత్యక్షమై ఆశ్చర్యపరచాలి' అనుకుంటూ ఇందు అతని సెక్షన్‌లోకి అడుగుపెట్టింది.

అతను తన సీట్లో లేడు. మేనేజర్ గ్లాస్ క్యాబిన్ వైపు చూసింది. హేలీ అక్కడా లేడు.

"ఎక్కడికెళ్ళాడు? "

హేలీ పక్క సీట్లో కూర్చునే రాజ్‌ని అడిగింది.

"సెక్షన్ 'ఇ'లో ఉన్నాడు" రాజ్ పళ్ళికిలించాడు.

"లంచ్ టైమ్ కదా? "

"అందుకే అక్కడ ఉన్నాడు" రాజ్ మళ్ళీ వెకిలిగా నవ్వాడు.

"తిరిగి రావటానికి చాలా సేపవుతుందేమో. అందాకా ఇక్కడ కూర్చుని నాతో కబుర్లు చెప్పొచ్చుగా" అని మళ్ళీ నవ్వాడు.

అతని వెకిలి నవ్వు పట్టించుకోకుండా 'ఇ' సెక్షన్‌వైపు నడిచింది.

రాజ్ ఒక వెధవ. ఆడవాళ్ళని చూస్తే చాలు, అన్నీ మర్చిపోతాడు. అనవసరంగా ఏవేవో మాట్లాడతాడు. తన అపారమైన అనుభవంవల్ల స్త్రీలని అంచనా వెయ్యటం నేర్చుకున్నాడు. మెత్తటివాళ్లా, గయ్యాళి వాళ్లా తేలిగ్గా తెలిసిపోతుందనికి. ఇందు లాంటి మెత్తటి వాళ్లని ఏడిపిస్తాడు. వాళ్లేం చెయ్యలేరని తెలుసు. వెధవ జోకులూ, వెకిలి వేషాలూ వేస్తాడు. అయినా ఒక్కోసారి అతని అంచనా తప్పయి, చెప్పుదెబ్బలు తిన్న సంఘటనలు కూడా ఉన్నాయి. ఒకమ్మాయి పోలీస్ కంప్లయింట్ కూడా ఇచ్చింది. కాళ్ళు పట్టుకుని బతిమాలి, అందులోంచి బయటపడ్డాడు. అయినా సిగ్గులేదు. అమ్మాయిల్ని చూడగానే అదోమాదిరి పిచ్చి లోపల్నుంచి తన్నుకుని వస్తుంది. అసభ్యంగా మాట్లాడకుండా ఉండలేడు.

ఎప్పుడో ఒకరోజు ఎవరో ఒక స్త్రీ తప్పకుండా వలలో పడుతుందనే పిచ్చి నమ్మకం మాత్రం ఉంది. చెప్పుదెబ్బలు ఆ నమ్మకాన్ని మార్చలేకపోయాయి. సిగ్గులే

# మనసున ఉన్నదీ...



★ ఆగస్టు 'చతుర'లో లక్ష్మీనాగేశ్వర్ నవల 'కుక్క' ఆద్యంతం చక్కగా చదివించింది. ఈ ఇతివృత్తం వైవిధ్యభరితంగా ఉంది. శునక ప్రియులకు సంతోషదాయకంగా ఉంది. రచయిత్రికి అభినందనలు. మున్ముందు కూడా ఇటువంటి నవలలు అందించమని ప్రార్థన.

**- సత్యవతీ దేవి**, హైదరాబాద్

★ ఆగస్టు సంచికలోని 'కుక్క' నవల విజ్ఞానదాయకంగా ఉంది. కుక్కల పెంపకం గురించి బాగా చెప్పారు. అలాగే అనువాద కథ 'గతించిన కాలాలు', 'జ్ఞానపీఠాలు'లో కాశ్మీరీ కవి రహమాన్ రాహీ పరిచయం బాగుంది. చతురకత 'పెరటిమందు' కనువిప్పు కలిగించేదిగా ఉంది.

**- కలశపూడి వెంకట శ్రీనివాస్,**
విక్రంపురి కాలనీ, సికింద్రాబాద్.

★ ఆగస్టు 'చతుర'లో డా. జయకాంతన్ తమిళకథ 'గతించిన కాలాలు' అద్భుతమైన రచన. నిజం చెప్పాలంటే కథావస్తువు మొదట్లో కొంత ఇబ్బందికరంగా అనిపించింది. ప్రవర్తనలో కట్టుబాటు, నియంత్రణ మనిషికి అవసరమేకాని, అవి మనిషిని మనిషిగా బతకడానికి అవరోధం కాకూడదనే సందేశాన్ని ప్రభావవంతంగా చెప్పారు. వృద్ధాప్యం మనసుకి కాదనీ, జీవితం సంఘ వికాసానికి అవరోధం కానంతవరకూ స్వేచ్ఛగా బతకడం తప్పేమీ కాదనీ, నియమాల వలయాల్లో నిస్తేజంగా బతకడమే నిజమైన వృద్ధాప్యమని చెప్పారు.

**- టి. మధుసూదనరావు**, బెంగళూరు

★ కుక్కలు ఎంత విశ్వాసం చూపిస్తాయో, ఎన్ని రకాలో, ఎలా పెంచాలో తెలియజేసిన 'కుక్క' నవల శునకప్రియులకు చక్కటి గైడ్ లాంటిది. ఇలాంటి ప్రత్యేకత ఉన్న కథాంశాన్ని ఎంచుకోవటం రచయిత్రికి ఈ విషయంపై గల పరిజ్ఞానానికి నిదర్శనం. ఈ నవలలో చంద్రకాంత్, జెస్సికా ప్రధాన పాత్రల చిత్రణ అనుపమానంగా ఉంది. కథాగమనంలో అనౌచిత్యాలు, సన్నివేశ కల్పనల్లో అసందర్భాలు, సంభాషణల్లో అతిశయోక్తులు, అశ్లీలత ఏ కోశానా లేనటువంటి చక్కటి రచన ఇది. వైవిధ్యం గల ఈ నవలను అందించినందుకు సంపాదకులకు ధన్యవాదాలు.

**- పారుపల్లి వెంకటేశ్వరరావు,**
నల్లకుంట, హైదరాబాద్

★ లక్ష్మీనాగేశ్వర్ నవల 'కుక్క' వినూత్న కథాంశంతో ఆకట్టుకుంది. రచయిత్రికి కుక్కల పెంపకంలో ఎంతో ఆసక్తి, అనుభవం ఉన్నాయనిపిస్తోంది. డా. జయకాంతన్ పెద్దకథ 'గతించిన కాలాలు'లో వయసుమళ్లినవారి పెడపోకడలను బాగా చిత్రించారు.

**- సూరి నాగరాజు,** బెంగళూరు

★ ఆగస్టు సంచికలో వచ్చిన 'కుక్క' నవల చాలా బాగుంది. అలాగే డా. దిలావర్ రాసిన ప్రేమకథ 'హృదయరాగం' ఆసక్తితో చదివించింది. ఇరువురి మధ్య ప్రేమ ఎలాంటి పరిణామానికి గురవుతుందో సహజంగా చిత్రించారు. 'గతించినకాలాలు' కథ కూడా చాలా బాగుంది.

**- భవ్య, భారతి,** రేపల్లె, గుంటూరు జిల్లా

★ ఒక నవల, రెండు పెద్దకథలతో వచ్చిన ఆగస్టు 'చతుర' చదివి ఆనందానుభూతికి లోనయ్యాను. 'కుక్క' నవల చదివాక ఆ మూగప్రాణులపై మరింత ప్రేమ, ఆసక్తి పెరిగింది. ఏమాత్రం అవకాశమున్నా ఒక కుక్కనైనా తప్పక పెంచుకోవాలనిపిస్తోంది. జయకాంతన్ పెద్దకథ 'గతించిన కాలాలు'లోని గ్రంథసాంగుడు రంగమణి పాత్ర విలక్షణత ఆకట్టుకుంది. 'హృదయరాగం'లోని స్వప్న ఎంత దిగజారినా కథానాయకుడు ఆమెకు నేత్రదానం చేయడానికి సంసిద్ధుడవటంతో ప్రేమ గుబాళింపులు ఆస్వాదించాను.

**- ఎస్. అబ్దుల్ అజీజ్,** వనపర్తి



చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net

కుండా తననితానే ప్రోత్సహించుకుంటూ, ఓదార్చుకుంటూ బతుకుతుంటాడు.

అందుకే ఇందుకి అతని ముందు కూర్చో బుద్ధి కాలేదు. 'ఇ' సెక్షన్‌లో రెండు కంప్యూటర్ బల్లలున్నాయి. ఇంకో టేబుల్, మూడు కుర్చీలు ఉంటాయి. ఆ సెక్షన్‌వైపు ఎవరూ రారు. నీనా అక్కడే పనిచేస్తోంది. హేలీ ఆమెతో మాట్లాడుతూ ఉంటాడు. ఎవరితోనైనా ఫ్రెండ్లీగానే ఉండే హేలీ నీనాతో కూడా ఫ్రెండ్లీగా ఉంటాడు.

'ఇ' సెక్షన్లోకి అడుగుపెట్టబోతున్న ఇందు హఠాత్తుగా ఆగిపోయింది.

హేలీ, నీనా కంప్యూటర్ ముందు కూర్చుని ఉన్నారు.

నీనాకి హేలీ ఏదో గేమ్ నేర్పిస్తున్నాడు. లంచ్‌టైమ్‌లో కంప్యూటర్లో గేమ్స్ ఆడుకో వటం మామూలే. నీనా, హేలీకి చాలా దగ్గరగా కూర్చుంది. దాదాపు ఇద్దరి శరీ రాలు తగులుతున్నాయి. హేలీ ఏదన్నా వివరించటానికి వంగినప్పుడు ఆ దూరం ఇంకా తగ్గిపోతోంది. నీనా విరగబడి నవ్వుతూ ఏదో అడుగుతోంది.

ఇందు కొయ్యబారిపోయింది. ఎందుకో ఆమెకూ తెలియదు. తర్వాత ఎట్లాగో ఒళ్లు స్వాధీనంలోకి తెచ్చుకుని వెనక్కు తిరి గింది. ఆటలో పూర్తిగా లీనమైపోయిన నీనా, హేలీలు ఇందుని చూశారు. హేలీ కళ్లు తనని చూసి మెరవటం ఇందు గమ నించింది. ఆమె గుండె మండిపోతోంది. రక్తం ఆవిర్లు కక్కుతోంది

"హాయ్ ఇందూ! చూడనే లేదు నిన్ను" అన్నాడు హేలీ.

"ఇందూ! ఇక్కడ కూర్చో. పాపం నీనా రోజూ లంచ్‌బాక్స్ తెచ్చుకుంటుంది. పది నిమిషాల్లో అది ఖాళీ అయిపోతే ఏం చెయ్యాలో తెలీక బోర్ ఫీలవుతోంది. అందుకే ఇవి నేర్పిస్తున్నాను" అన్నాడు.

"ఇందూ రా. కూర్చో" అంది నీనా.

"అక్కర్లేదు. నాకు పనుంది. ఊరికే హేలీ ఏం చేస్తున్నాడో చూద్దామని వచ్చాను. ఆడుకోండి" అంది ఇందు.

గబగబా నడిచి తన ఆఫీసు చేరుకుంది. లిఫ్ట్ ముందు పెద్ద క్యూ ఉంది. నిలబడే సహనం లేక మెట్లన్నీ ఎక్కేసింది. తన సీట్లో కూర్చుంది. పొద్దుటినుంచీ ఏమీ తినలేదు. అయినా ఆకలిగా లేదు. నోరు తడారిపోయింది. హేలీ మీద కోపం తన్నుకుని వస్తోంది. ఇంకెప్పటికీ అతనితో మాట్లాడకూడదనిపించింది.

మూడు నిమిషాలు గడిచాయో లేదో హేలీ వచ్చాడు.

"ఏమైంది? అసలెందుకు వచ్చినట్లు? ఎందుకు వెళ్లినట్లు? " అడిగాడు హేలీ.

"ఒక ఫూల్‌ని కాబట్టి వచ్చాను. ఇంకా గొప్ప ఫూల్‌ని అయ్యాను కాబట్టి వెంటనే తిరిగి వచ్చాను" అంది ఇందు.

అతని నవ్వుమొహం నల్లబడింది.

"ఏమైంది? ఎందుకా కోపం? ఎవరన్నా ఏమన్నా అన్నారా? " అడిగాడు హేలీ.

"ఎవరో అయితే నాకింత బాధ ఎందుకు? నువ్వు చేసిన దానికే నాకు బాధగా ఉంది" ఇందు విసురుగా అంది.

"ఏంటి నిన్ను నేను బాధపెట్టానా? ఏం చేశానో చెప్పు అసలు? " హేలీ ఆశ్చర్య పోతూ అడిగాడు.

"నేనెందుకు చెప్పాలి? నీకు తెలీదా? " ఇందు ఆవేశంగా అంది. గొంతు బొంగు రుపోయింది. కళ్లలోంచి నీళ్లు జలజలా రాలాయి.

హేలీ నిర్ఘాంతపోయాడు.

"నాకు తెలిస్తే ఎందుకు అడుగుతాను? ప్లీజ్ చెప్పవా? " మృదువుగా అడిగాడు.

ఇందు చెప్పలేదు.

"ప్లీజ్" మళ్లీ అడిగాడు.

"నీనాకి గేమ్ ఎందుకు నేర్పిస్తున్నావు? " ఇందు కోపంగా అడిగింది.

హేలీ తేలిగ్గా నిట్టూర్చాడు.

"అంతేనా? ఇంకేం తప్పు చేశానోనని హడలి చచ్చాను. ఊరికే. పాపం అది గింది కదా అని నేర్పించాను. అంతే. నీనా ఒక్కత్తే కాదు చాలామంది అమ్మాయిలకి నేర్పించాను. కావాలంటే నీకూ నేర్పిస్తా"

"నేర్పించే విధానం ఉంటుంది. మరీ అంత దగ్గరగా కూర్చోవక్కర్లేదు."

"ఎక్కడో కూర్చుని ఎట్లా నేర్పగలం?"

"అదంతా నాకు తెలీదు. అది చాలా అసహ్యంగా ఉంది"

అతను నవ్వాడు. ఆ నవ్వు ఇందుకి మరింత చిర్రెత్తించింది. తనింత బాధ పడుతుంటే అతనంత హాయిగా ఎట్లా నవ్వుతున్నాడో అర్థం కాలేదు.

"సరే? అసహ్యంగానే ఉంది. కానీ నీకు కోపం దేనికీ?" అతను మామూలుగానే అడిగినా, ఇందుకి బాధ పెరిగింది. కోపం రెట్టింపయింది.

"ఆమెకి సంతోషంగా నేర్పిస్తున్నావు కదా?" అంది.

"ఎవరికైనా సరే.. ఏం నేర్పాలన్నా, సాయం చెయ్యాలన్నా నాకు సంతోషం గానే ఉంటుంది"

"సరేనా? ఇక ఇక్కడికి రాకు. అక్కడే సరదాగా అన్నీ నేర్పించుకుంటూ ఉండు. నాతో మాట్లాడకు. పో" అంది ఇందు గట్టిగా.

"అరే.. అంత కోపం దేనికీ?"

"నాతో మాట్లాడకు. అసలెప్పుడూ మాట్లాడకు"

"ఇందూ! అనవసరంగా ఆవేశపడుతు న్నావు"

"అవును. నేనొక ఫూల్‌ని. ఇందాకే చెప్పానుగా"

"అనవసరంగా..." అతనేదో చెప్పబో యాడు.

"అనవసరంగా? ఓహో, నేనొక పనికి మాలిన మనిషిని. అనవసరంగా అన్నిటికీ

## జ్ఞాపకానికి కారణం?

పేరడీలతో ఖ్యాతిగాంచిన హాస్య రచయిత శ్రీరమణతో సంజీవదేవ్, 'హైదరాబాద్ వెళ్లి వస్తారన్నమాట! మంచిది. మీ మిత్రులనూ, నా మిత్రులనూ, మన మిత్రులనూ నేను జ్ఞాపకం చేసినట్లు తప్పక చెప్పండి' అన్నారు.



దానికి శ్రీరమణ, 'ఏమని జ్ఞాపకం చేశారని వారడిగితే?' అన్నారు.

వెంటనే సంజీవదేవ్ 'వారిని మరిచి పోలే దని జ్ఞాపకం చేశాననండి. ఎందువల్ల మరచి పోలేదని వారు మళ్లీ అడిగితే జ్ఞాపకం ఉన్నం దువల్ల మరచిపోలేదని చెప్పండి. ఎందువల్ల జ్ఞాపకం ఉన్నదని వారడిగితే మెదడులోని స్మృతినాడులు సజీవంగా ఉన్నందున జ్ఞాపకముందని చెప్పండి!' అన్నారు.

బాధపడుతుంటాను"

"సరే. వెళ్తాను. లంచ్ చేశావా లేదా?"

"చేస్తే చేస్తాను. లేకపోతే మాడి చస్తాను. నీకెందుకు పోయిరా" అందామె.

"సరే. ఆవేశంలో ఉన్నావు. నేనిక్కడే ఉండి నిన్ను బాధపెట్టను. లంచ్ చెయ్యి ముందు. సాయంత్రం ఆరుదాకా ఉండాలి. ఆకలితో ఉండకు" హేలీ అన్నాడు.

"నేను నా సంగతి చూసుకోగలను. నీ సలహా అక్కర్లేదు" మొండిగా అంది

ఇందు.

ఇంతలో లంచ్‌కి వెళ్లిన స్టాఫ్ ఒక్కొక్కళ్లే తిరిగి వస్తున్నారు. తను అక్కడే ఉంటే ఇందుకోపం అందరి దృష్టినీ అనవసరంగా ఆకర్షిస్తుందేమోనని భయమేసింది హేలీకి.

"సరే, వెళ్తున్నాను. నా మీద కోపంతో లంచ్ మానెయ్యకు" అన్నాడతను మెల్లగా వెళ్ళిపోతూ.

ఇందు కూర్చుని ఎటో చూస్తూ కాస్సేపు గడిపింది. తర్వాత టాయ్‌లెట్‌లోకి వెళ్ళి మొహం కడుక్కుంది. కన్నీటి చారికలు మాయమయ్యాయి. తన ఆవేదనకి కారణ మేంటో ఆమెకే అర్థం కాలేదు. పసిపిల్ల తను. ఆడుకునే బొమ్మని ఎవరో లాక్కుంటే ఎంత బాధపడుతుందో అంత బాధపడుతోంది. నీనా మీద చెప్పలేనంత ద్వేషం కలిగింది. వెళ్ళి, నీనాని రెండు వాయించాలన్నంత కోపం వచ్చింది. హేలీని కూడా కొట్టాలనిపించింది. ప్రపంచం మొత్తం మీద కోపం వచ్చింది.

కన్నీళ్ళు ఎన్ని దొర్లిపోయినా గుండెలోని బాధ మాత్రం తగ్గలేదు. కళ్ళు ఎర్రబడి, మొహం వాచింది.

చేతుల్తో జుట్టుని సరిచేసుకుని, నాప్‌కిన్‌తో మొహం అద్దుకుని, సెక్షన్‌లోకి తిరిగి వచ్చింది. అప్పటికి సెక్షన్లోకి అంతా వచ్చే శారు.

ఇంక పని చెయ్యలేననిపించింది.

"ఏంటమ్మా? ఒంట్లో బాగాలేదా? " మేనే జర్ అడిగాడు.

"అవును సర్. మీరు పర్మిషన్ ఇస్తే సగం పూట సెలవు పెట్టి వెళ్ళిపోతాను"

"అయ్యో వెళ్ళమ్మా. రేపయినా రాగలిగి తేనే రా" అన్నాడాయన.

ఆయనకి థాంక్స్ చెప్పి, బ్యాగ్ తీసుకుని బయల్దేరింది.

★ ★ ★

సాయంత్రం అయిదుగంటల సమయం. సెల్ మోగటం మొదలుపెట్టింది. ఇందు ఇంట్లోనే ఉంది. ఎవరా? అని చూసింది.

హేలీ!

అట్లాగే సెల్‌వైపు చూస్తూ ఉండిపో యింది. సెల్ మోగి మోగి ఆగిపోయింది.

అరగంట తర్వాత మళ్ళీ సెల్ మోగింది. ఆమె కాల్ రిసీవ్ చేసుకోకపో వటంతో ఆగిపోయింది. తర్వాత చాలా సార్లు మోగినా ఆమె అట్లాగే ఉండిపో యింది. హేలీని శిక్షించాలనిపించింది.

వచ్చి ఏడవనీ, చేసిన దానికి పశ్చాత్తాప పడనీ. అతనితో మాట్లాడకూడదు.. ఎప్ప టికీ. అంతే. అదే అతనికి శిక్ష.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళింది. ఒక అర గంట గడిచాక హేలీ ఫోన్‌చేశాడు. ఇందు పట్టించుకోలేదు. ఫోన్ చాలాసార్లు మోగింది. లంచ్‌లో చాలా తక్కువ తిన్నది. ఎప్పటికీ హేలీతో మాట్లాడకూడ దని ఒక నిర్ణయం చేసుకుంది. అయినా అతని కాల్‌కోసం ఎదురుచూస్తూనే ఉంది. తను ఆ కాల్‌ని తీసుకోకుండా అతన్ని బాధపెట్టాలి అనుకుంది.

కానీ అతను బాధపడతాడా? హఠా త్తుగా సందేహం కలిగింది. తప్పకుండా బాధ పడతాడు. తనంటే హేలీకి ఎంత ప్రేమో ఆమెకి తెలుసు. తను బాధపడితే బాధపడతాడు. తను సంతోషిస్తే సంతోషి స్తాడు. స్నేహం కూడా ఒక వ్యసనమే. ఎంతో అభిమానించే స్నేహితులతో మాట్లాడటం మానేసి ఎవరూ సంతోషంగా ఉండలేరు.

ఇంతలో ఆఫీస్ ఫోన్‌కి అతను ఫోన్‌చే శాడు. "ఇందూ! మీకు ఫోన్"

ఇందుకి ఆ కాల్ ఎవరినుంచో తెలుసు. ముందు 'సీట్లో లేరు' అని చెప్పమందామ నుకుంది. మళ్ళీ వెళ్ళి రిసీవర్ తీసుకుంది.

"హలో" అంది.

"హాయ్ ఇందూ" హేలీ వెంటనే

అన్నాడు.

ఇందూ మౌనంగా ఉండిపోయింది.

"ఇందూ! ప్లీజ్. తెలివితక్కువగా చెయ్యకు. నేను నీ ఫ్రెండ్‌ని. నీ శ్రేయోభిలాషిని. నాతో మాట్లాడటం మానెయ్యకు"

ఇందూ మౌనంగా, మూర్ఖంగా, మొండిగా రిసీవర్‌ని పెట్టేసింది. చాలా సంతోషంగా అనిపించింది. హేలీ తను మాట్లాడలేదని చాలా బాధపడుతున్నాడు. అంటే తనంటే ఎంతో ఇష్టం ఉందని అర్థమవుతోంది. చాలా తృప్తిగా అనిపించిందింది. గట్టిగా ఊపిరి పీల్చి వదిలింది.

## 6



**మూ**డు రోజులు గడిచాయి.

హేలీ ఇందూతో మాట్లాడాలని ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఇందూ కాల్ రిసీవ్ చేసుకోవటం లేదు.

నాలుగో రోజు ఇందూ అనుకున్నట్లుగానే, ఏమైతే అయిందని హేలీ స్వయంగా వచ్చేశాడు. లంచ్‌టైమ్ కాబట్టి ఎవరూ సెక్షన్లో లేరు. అతనికి అది తెలుసు కాబట్టే ఆ టైమ్‌కే వచ్చాడు.

"హాయ్" అన్నాడు.

ఇందూ పట్టించుకోలేదు.

"హాయ్ అన్నాను" అన్నాడు హేలీ.

"నువ్వెంత తొందరగా ఇక్కడ్నుంచి వెళ్ళిపోతే అంత మంచిది"

"ఎవరికి మంచిది? "

"నీకే"

"అయితే వెళ్ళను. నీ మంచికోసం అయితే చెప్పు వెంటనే వెళ్ళిపోతాను" అన్నాడు హేలీ.

ఇందు కాస్సేపు మౌనంగా ఉండిపోయింది.

"ఇక్కడికెందుకొచ్చావు? నీనాతో కబుర్లు చెప్తూ కూర్చోకపోయావా? " అంది.

హేలీ ఆమెవైపు చూశాడు.

"ఇందూ! అసలు నాకే అర్థం కావటం లేదు. నువ్వు నా ఫ్రెండ్‌వి. నాకు ఎంతో మంది ఫ్రెండ్స్ ఉన్నారు. కానీ నువ్వు చాలా స్పెషల్ ఫ్రెండ్‌వి. అది నాకు ముందే తెలుసు. నువ్వు మాట్లాడటం మానేశాక ఇంకా బాగా అర్థమైంది. నువ్వంటే నాకు చాలా ఇష్టం. నీ స్నేహం నాక్కావాలి. ప్లీజ్. మన స్నేహాన్ని తెగనరికే ప్రయత్నం చెయ్యకు. ఇది నా ప్రార్థన మాత్రమే. నిన్ను బలవంత పెట్టను. మన స్నేహం కొనసాగాలని అడిగే హక్కు నాకు లేదు" అన్నాడు హేలీ.

ఇందు కళ్లల్లోంచి నీళ్ళు కారాయి. కానీ మనసు మాత్రం శాంతించింది.

"నువ్వు నీనాతో అంత క్లోజ్‌గా ఉండటం సహించలేకపోయాను. సరే. నేను నీకేమీ కాకపోవచ్చు. కానీ నాకు మాత్రం నీ మీద చాలా ఇది ఉంది" అంది ఇందు.

"నిన్ను బాధపెడతానని తెలిస్తే నీనాతో అసలు మాట్లాడేవాడినే కాను. ఆమెకి కాలక్షేపం కావాలని సాయం చెయ్యబోయాను. కానీ దానికి మూల్యం నీ స్నేహం అంటే ఆ జోలికే పోను. నీ కోసం, నీ స్నేహం కోసం దేన్నయినా వదులుకుంటాను. కానీ దేనికోసం కూడా నీ స్నేహాన్ని మాత్రం వదులుకోలేను" హేలీ మృదువుగా చెప్పాడు.

ఇందుకి ఆ లాలన చాలా ఇష్టం. అతని

స్వరం తియ్యగా, మనోహరంగా ఉంది.

ఇందు మౌనంగా ఉంది.

"లంచ్ చేశావా? " అతను ఆప్యాయంగా అడిగాడు.

"లేదు"

"బాక్స్ తెచ్చావా? "

"లేదు"

"సరే పద. దగ్గర్లో ఏదన్నా హోటల్‌కి వెళ్లి లంచ్ చేసి వద్దాం" అన్నాడతను.

"వద్దు. నాకేం అక్కర్లేదు" ఇందు మళ్ళీ మొండిగా మారింది.

"లేదు. నువ్వు తినాలి. బోలెడంత పని ఉంటుంది నీకు. తినకపోతే ఎట్లా చెప్పు. నీ ఆరోగ్యం పాడవుతుంది. పిచ్చి ఇందూ. రా, మొండితనం వద్దు. పద లంచ్‌కి వెళ్దాం" అతను లాలిస్తూ మృదువుగా నచ్చ చెప్పాడు.

ఇందు మెత్తబడింది. సీట్లోనుంచి లేచింది.

"ఒక్క నిమిషం" అంది. బ్యాగ్ తీసుకుని టాయ్‌లెట్‌వైపు నడిచింది. అక్కడ మొహం కడుక్కుని, పౌడర్ రాసుకుంది. కళ్లకు కాజల్ పెట్టుకుని, లిప్‌స్టిక్ వేసుకుంది. అతను వస్తాడేమోనని ముందుగానే ఊహించటం వల్ల మంచి చీరె కట్టుకుని లేటెస్ట్ డిజైన్ బ్లౌజ్ ధరించి వచ్చింది.

మెరిసిపోతూ బయటికి వచ్చింది.

అతను ఈ లోపల తన బైక్ దగ్గరకి వెళ్ళి, దాన్ని స్టార్ట్ చేశాడు. ఇందు వెనుక ఎక్కగానే బండి వేగంగా ముందుకి సాగిపోయింది.

ఇద్దరి హృదయాలూ తేలిపోతున్నాయి. ఇద్దరికీ ఏమీ తెలియటం లేదు. వర్ణనాతీతమైన ఆనందం తప్ప.

"థాంక్యు నీనా" అన్నాడతను హఠాత్తుగా

"ఎందుకు? " ఇందు అడిగింది.

"నువ్వంటే నాకెంత ఇష్టం ఉన్నా నేను చెప్పలేకపోయాను. నీనా విషయం జరగకపోతే అట్లాగే ఉండిపోయేవాళ్ళం. అవునా? "

"అవును. అందుకే నీనాని క్షమించేశాను" అంది ఇందు.

ఇద్దరూ రెస్టారెంట్‌లో భోజనం చేశారు.

"హేలీ! ఆనాడు ఫంక్షన్‌కి వెళ్లిన రోజు నాకు చెప్పకుండా వెళ్లావని అడిగితే.. నీకు ఆ అధికారం ఎవరిచ్చారు? నన్ను నిలదీస్తున్నావని అడిగావు.. గుర్తుందా? ఆరోజు సంతోషంతో చెప్పలేకపోయాను. కానీ ఈరోజు నిర్భయంగా చెప్తున్నాను. నీ మీద ఉన్న ప్రేమ నాకా అధికారాన్ని ఇచ్చింది. ప్రేమ కొన్ని హక్కుల్ని ఇస్తుంది" అంది ఇందు.

"అర్థమైంది. అందులో సమాచార హక్కు కూడా ఉంటుందని తెలుసుకున్నా. తమను గురించిన పూర్తి సమాచారం తమ తమ ప్రేమికులకి ఎవరైనా సరే, అందివ్వాలి" అన్నాడు హేలీ.

★ ★ ★

బైక్ స్పీడ్‌గా పోతోంది.

ఆరోజు ఆదివారం. ఆఫీసు లేదు. హరీష్ క్యాంప్‌కెళ్లాడు. బేబీకేర్ సెంటర్ ఆవిడ అదనపు ఛార్జీ తీసుకుని పాపని ఉంచుకుంటుంది. పాపని సెంటర్లో దింపి తను హేలీకోసం ఎదురు చూస్తూ నిలబడింది ఇందు. హేలీకి ఆదివారాలు కూడా ఏదో ఒకపని చేసుకోటం మామూలే కాబట్టి భార్యకి సంజాయిషీ ఇవ్వాల్సిన అవసరం కూడా లేదు.

ఇద్దరూ వీలైనప్పుడల్లా ఆదివారాలు ఎటన్నా తిరిగి వస్తున్నారు. హేలీ హెల్మెట్ అతని మొహాన్ని కూడా కవర్ చేస్తుంది. కాబట్టి గుర్తు తెలీదు. ఇందు కూడా చుడీదార్ వేసుకుంటే, చున్నీని మొహం కప్పేసేలా వేసుకుని జాగ్రత్త

పడుతుంది.

ఏవో కబుర్లు చెప్పుకుంటూ వెళ్తుంటే లోకం, కాలం ఏవీ తెలియటం లేదు.

సిటీ లిమిట్స్ దాటారు.

"ఎటుపోతున్నాం?" ఇందు అడిగింది.

"ఏంటలా అడుగుతున్నావు? నిన్నే మన్నా కిడ్నాప్ చేస్తానని భయమా?" హేలీ అడిగాడు.

"నాకేం భయం? నిజానికి అలా ఎప్పుడు చేస్తావా అని ఎదురు చూస్తున్నాను" ఇందు గట్టిగా నవ్వింది.

హేలీ కూడా నవ్వేశాడు.

## కొత్తగాలి...

**అల్లుడు సాక్షాత్తు మహాశివుడు**
**అమ్మాయిని నెత్తినెట్టుకుంటాడు**
**కొడుకు కొరకరాని కొయ్య**
**కోడలు కొంగట్టుకు తిరుగుతాడు**

– సుహాణీ,
గుంటూరు

అతని నవ్వు చాలా బాగుంటుంది. నిష్కల్మషంగా, పసిపాపలా నవ్వుతాడు. ఆ నవ్వు విన్నప్పుడల్లా ఇందు తనని తాను మర్చిపోతుంది.

బైక్ స్పీడ్‌గా పోతోంది. ఎత్తుపల్లాలు వచ్చినప్పుడు ఎగిరిపడి మళ్లీ మామూలుగా పోతోంది.

ఇందు హేలీ భుజాన్ని గట్టిగా పట్టుకుంది.

"ఏం.. పడేస్తానని భయమా? అంత గట్టిగా పట్టుకున్నావు?" హేలీ అడిగాడు.

"నాకట్లాంటి భయం లేదు. నిజానికి నువ్వు నన్ను పడేసినా నేను బాధపడను"

"ఎందుకని?"

"ఎందుకంటే నువ్వంటే నాకంత ఇష్టం కాబట్టి. నువ్వు పడేసినా, పడేసి నా కాళ్ళు విరగ్గొట్టేసినా నాకు బాధ అనిపించదు"

అతను చిన్నగా నవ్వాడు. ఇందు మాటలకి అతను పరవశించిపోయాడని ఆ నవ్వు చెబుతోంది.

"ఒకవేళ నేను యాక్సిడెంట్ చేస్తే?" అడిగాడు.

ఆమె జవాబు చెప్పలేదు.

"చెప్పు" అతను మళ్ళీ అడిగాడు.

"నిజం చెప్పనా?"

"ప్లీజ్" అతను నవ్వాడు.

"నువ్వు ఉంటే చాలు. నీ పక్కన ఉన్నప్పుడు ఏం జరిగినా నేను బాధపడను. యాక్సిడెంట్ అయితే అవనీ, నేను చచ్చిపోవాల్సి వస్తే హాయిగా చచ్చిపోతాను"

అతను నవ్వాడు

బైక్ వెళ్ళి వెళ్ళి ఒకచోట ఆగింది.

ఇద్దరూ దిగారు.

అది ఒక నిర్జన ప్రాంతం. అక్కడ చెట్లూ పొదలూ దట్టంగా ఉన్నాయి.

ఇందు ఆకుపచ్చటి డ్రెస్ వేసుకుంది. పరిసరాల పచ్చదనంలో ఆ డ్రెస్ కలిసిపోయింది. కళ్ళని ఐలైనర్‌తో తీర్చిదిద్దుకుంది. మొహానికి లైట్‌గా మేకప్‌వేసి, గులాబీరంగుని బుగ్గలకి అద్దుకుంది. గాలికి జుట్టు అందంగా కదుల్తోంది.

అతను ఒక బండవైపు నడిచాడు.

"ఇది పూర్తిగా నిర్జనంగా ఉండే ప్రదేశం. ఇటు ఎవళ్లూ రారు. మనం ఇద్దరమే తప్ప ఎవరూ ఉండరు. నువ్వూ నేనూ కావల్సినంతసేపు కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నాడు హేలీ.

ఏకాంతంలో ఉన్నా అతను ఎప్పుడూ హద్దు మీరడు. ఇందుకి అతనిలో నచ్చిన గుణాల్లో అది ముఖ్యమైనది.

ఎప్పుడూ బాలెన్స్ కోల్పోడు. స్థిరంగా ఉంటాడు. ఏ విషయంలోనైనా అంతే.

అతను తనతో తెచ్చిన బ్యాగ్ తెరిచాడు.

వాటర్‌బాటిల్, చిప్స్, జీడిపప్పు పకోడీ, సమోసాలు ప్యాకెట్లలో ఉన్నాయి.

"సాయంత్రందాకా ఇవి సరిపోతాయా? " అడిగాడు.

"ఎక్కువవుతాయి. నీతో మాట్లాడితేనే కడుపు నిండిపోతుంది" అది ఇందు.

హఠాత్తుగా బుస్సుమని చప్పుడు వినిపించింది.

"ఏమిటది? " అడిగాడు హేలీ.

"పాములాగా ఉంది" అంది ఇందు.

నిజంగా పామే. అది అంతవరకూ ఆ బండ కిందనే ఉన్నట్లుంది. హఠాత్తుగా వాళ్ళముందు ప్రత్యక్షమైంది. నల్లటి దాని శరీరం సిల్క్‌లా మెరుస్తోంది.

నిజానికి హేలీకి పాములంటే భయమే. ఇందుకైతే బల్లుల్ని చూసినా భయం వేస్తుంది.

కానీ ఇప్పుడు వాళ్ళిద్దరికీ అస్సలు భయం వెయ్యలేదు. వాళ్ళు దేన్ని చూసినా భయపడని స్థితిలో ఉన్నారు. అది ఒక విష సర్పమనే జ్ఞానం కూడా వాళ్ళకి కలగలేదు. అదీ తమలాంటి మరో జీవి.

పాము పడగ విప్పింది. అయినా వాళ్ళల్లో చలనం లేదు. భయం ఏమాత్రం లేదు. తమ తోటి మానవుడ్ని చూసినట్లే ఆ పాముని చూస్తున్నారు.

ఆ పాముకే విసుగుపుట్టిందో, లేక ఇంకేం అయిందో, వాళ్ళను చూసి అదే భయపడిందేమో? నిశ్శబ్దంగా అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. వేగంగా పాకుతూ అక్కడ్నుంచి మాయమవుతుంటే, వాళ్ళు మౌనంగా దాన్ని చూస్తూ ఉండిపోయారు.

"ప్రకృతి ఒడిలో చల్లగా ఉండే ఈ ప్రదేశం నాకు చాలా ఇష్టం. నీతో కాస్సేపు హాయిగా గడపవచ్చనుకున్నాను. కానీ పాములుంటాయని ఊహించలేకపోయాను" అన్నాడు హేలీ.

ఇందు నవ్వుతూ వింటోంది.

"నీకు భయంగా ఉందా? తిరిగి వెళ్ళిపోదామా? " హేలీ అడిగాడు.

"నీకు ఇక్కడ బాగుంటే నాకూ బాగుంటుంది. అంతే" అంది ఇందు.

"అయితే ఇక్కడే కూర్చుందాం"

"సరే"

ఇద్దరూ బండరాళ్ళలా ఆ బండమీదే కూర్చున్నారు. హేలీ చిప్స్ పాకెట్ చింపాడు. ఇద్దరూ తిన్నారు. ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. ఎంత టైమ్ అయిందో కూడా తెలియలేదు. బాగా వెలుతురుగా ఉండగానే హేలీ బయల్దేరాలని అన్నాడు.

"పాముల భయమా? " అంది ఇందు.

"బందిపోట్లు, ఇంకా రకరకాల శక్తులు విజృంభించే ప్రమాదం.. రాత్రయితే అన్నీ భయాలే. తొందరగా వెళ్ళిపోదాం"

"అన్నీ పిచ్చి భయాలు. పగలు లేని భయం రాత్రిమాత్రం ఎందుకు? మన భయాలన్నీ మానసికమైనవే. తొంభైశాతం భయాలు ఏ ఆధారంలేనివి ఉంటాయిట. మానసిక శాస్త్రవేత్తలు చెబుతారు. ఏదన్నా మనం అనుకోవటంలోనే ఉంటుంది. ఇందాక ఆ పాముని చూసి మనం కాక వేరే ఎవరన్నా అయితే తప్పకుండా భయపడేవాళ్ళే కదా? "

"నిస్సందేహంగా"

"అదే మానసికం. అంతకుముందు కూడా ఆ పాము ఉంటుంది. కానీ దాన్ని గమనించరు. గమనించాక భయంతో వణికి చస్తారు. ఇక్కడ తేడా ఎక్కడ వస్తున్నదంటే దాన్ని గమనించటంతోనే"

"ఇంతలోతు వేదాంతం ఎందుకు? "

"ఎందుకంటే నీకు చెప్పాలని అంతే"

నిజానికి ఆ అర్థంలేని సంభాషణ చెయ్యటంలో ఇందు ఉద్దేశం ఒక్కటే, ఇంకాస్సేపు అక్కడే కాలక్షేపం చెయ్యాలని.

హేలీ నవ్వేశాడు.

"మరి నీకు కోపం రాదంటే నేనూ వేదాంతం బోధిస్తాను. ఒక ప్రశ్న అడుగుతాను.. జవాబు చెప్పాలి" అన్నాడు.

"సరే"

"అంతా అనుకోవటంలోనే ఉంటుంది కదా.. అవునా? "

"అవును. మన భావనలోనే ఉంటుంది ఏదైనా.."

"మరి నువ్వు మనం అసలు కలుసుకోనేలేదనీ, మన స్నేహం మిథ్య అని ఎందుకనుకోకూడదు? అప్పుడు మనం ఒకరినొకరు మర్చిపోయి హాయిగా గడిపెయ్యవచ్చు. ఇంతింత దూరం రావటం, పాముల్ని ఎదుర్కోవటం ఉండదు. అందరిలాగే ఆదివారాలు ప్రశాంతంగా గడిపేయవచ్చు" అన్నాడు హేలీ.

"భావాలను అణచుకోవటం, భావోద్రేకాలను కంట్రోల్ చేసుకోవటం అంత తేలిక కాదు" అంది ఇందు.

"అవునా? అదే నేనూ చెప్పదలచుకున్నది. ప్రతివాళ్ళకీ అన్నీ తెలుస్తూనే ఉంటాయి. తెలిసినా వాటిని అణచుకోలేరు. సరే పద, పోదాం"

ఇందు నవ్వుతూ లేచి నిలబడ్డది.

ఇద్దరూ ఫ్లాస్క్‌లోంచి టీ గ్లాసులో పోసుకుని తాగారు. తర్వాత హేలీ ఆ పేపర్ కవర్లనీ, మిగిలిన చెత్తనీ అంతా ఒక కాగితం కవర్లోకి చేర్చాడు.

"దార్లో ఎక్కడున్నా డస్ట్‌బిన్‌లో పడేయాలి" అన్నాడు.

ఎక్కడ ఉన్నా, ఎట్లా ఉన్నా అతను ఇష్టం వచ్చినట్లు ఉండడు. తన సామాజిక బాధ్యత మర్చిపోడు. ఇందూకి అతనిలో నచ్చిన మరో గుణం అది.

★ ★ ★

ఆ రోజు ఆదివారం.

ఇందు, హేలీ ఎక్కడెక్కడో తిరిగి సాయంత్రం అయ్యేసరికి ఎవరింటికి వారు చేరుకున్నారు.

రాత్రికి హరీష్ క్యాంప్ నుంచి వస్తాడు.

ఇందు శుభ్రంగా స్నానంచేసి, పాపకు మెత్తటి పప్పు చారన్నం కలిపి తినిపించింది. చాప పరిచి పాపని కూర్చోబెట్టి బొమ్మలు ముందు పడేసింది. పాప కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నది. మధ్యలో ఇందువైపు చూసి నవ్వుతోంది.

"నా బంగారు తల్లి" పాపమీద ముద్దుల వర్షం కురిపించింది ఇందు.

"ఆడుకో" అని చెప్పి, వంట గదిలోకి వెళ్ళింది.

హరీష్ కోసం చపాతీలు, కూరా కూడా ఉండాలి రాత్రికి. గబగబా చపాతీలు చేసి కూర తయారు చేసింది. సాంబారు, వంకాయ కూర, చపాతీలు, కూర, పెరుగు చాల్లే అనుకుని స్టౌ ఆపింది.

పక్క ఫ్లాట్ ఆవిడ జాజిపూల మాల పంపింది. ఇందు దాన్ని టేబుల్ మీద ఉంచింది. జాజుల వాసన పరిసరాల్ని ఆహ్లాదపరుస్తోంది.

అద్దంలో మొహం చూసుకుంది. మొహంలో కొత్త అందం, మెరుపు, నిగారింపు కనిపిస్తున్నాయి. 'ప్రేమ ఏవేవో హార్మోన్లు కలిగిస్తుందని అంటారు. వాటి ఫలితమేనా ఈ కొత్త అందం' అనుకుని నవ్వుకుంది.

రాత్రి ఏడవుతోంది.

అది ఒక ఆహ్లాదకరమైన రాత్రి. పరిసరాలన్నీ చాలా ప్రశాంతంగా ఉన్నాయి. పార్కుల్లోని పిల్లలు ఆటలు కట్టిపెట్టి ఇళ్ళకు చేరుకుంటున్నారు. కిలకిలా కూసిన పక్షులు గూళ్ళకు చేరుకున్నాయి. పువ్వులు విచ్చుకున్నాయి. ఆకాశంలో తారలు మెరుస్తూ ప్రత్యక్షమయ్యాయి.

అంతా చాలా చక్కటి ఆహ్లాదకరమైన వాతావరణం.

ఇంతలో ఆ ప్రశాంతతను భంగం

చేస్తూ ఏవో కేకలు వినిపించాయి.

ఇందు ఉలిక్కిపడింది. మొదట ఎవరో టి.వి.ని వాల్యూమ్ బాగా పెంచి వింటున్నారనుకుంది. కానీ ఆ కేకలు మళ్ళీ వినిపించాయి. తర్వాత ఎవరో ప్రాణంకోసం పెనుగులాడుతున్నట్లు భయంకరమైన కేకలు.

"ఓ" అని ఎవరో అరిచారు.

దభీమని ఏదో పడ్డ శబ్దం.

ఫ్లాట్లలో వాళ్లంతా విన్నట్లున్నారు, అంతా బయటకు వచ్చి చూస్తున్నారు. ఆ అరుపులు వినిపించిన వైపు ఫలానా అని ఊహించి, అటు పరుగెత్తారు.

అంతా ఒక అపార్ట్‌మెంట్ ముందు ఆగిపోయారు. తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి.

ఇందు నైటీ ధరించి ఉంది. వెంటనే చున్నీ లాగి, ఒంటి మీద కప్పుకుని, తనూ పరుగెత్తింది.

ఏదో జరిగింది. ఏంటది? దోపిడీనా? హత్యా? ఆ ఫ్లాట్ గోపాల్‌ది. గోపాల్ లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. భార్యా, అయిదేళ్ళ కొడుకూ ఉన్నారు. వాళ్ళంటే గోపాల్‌కి చాలాప్రేమ. చాలా ముచ్చటైన సంసారం అది. ఎవరింట్లోనైనా జరిగే చిన్నా చితకా పోట్లాటలు కూడా వాళ్ళింట్లో ఎప్పుడూ ఉండవు.

ఏం జరిగిందసలు? అంతా లోపలకు వెళ్ళారు. లోపల సీన్ చాలా భయంకరంగా ఉంది. గోపాల్ భార్య రక్తం మడుగులో పడి ఉంది. ఒంటి నిండా కత్తి పోట్లు. ఆమె పక్కనే గోపాల్ చేతిలో కత్తితో నిలబడి ఉన్నాడు. కత్తిలోంచి ఇంకా రక్తం చుక్కలు కారుతూనే ఉన్నాయి. గోపాల్ అయిదేళ్ళ కొడుకు గదిలో ఒక మూల పూర్తిగా కొయ్యబారిపోయిన స్థితిలో ఉన్నాడు. కళ్ళు పత్తికాయల్లా తెరుచుకుని ఉన్నా ఆ బాబులో చలనం మాత్రం లేదు.

# 'చతుర'లో ఏడో నవల



## ఎం. లక్ష్మీ రమణకుమారి

పుట్టింది, పెరిగింది, స్థిరపడిందీ అంతా హైదరాబాదులోనే. ఎం.కామ్ చదివి ప్రిన్సిపాల్ అకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో అసిస్టెంట్ అకౌంట్స్ ఆఫీసర్‌గా పని చేస్తున్నాను. ఇంతవరకూ ఆరు నవలలు చతురలోనూ, రెండు నవలికలు ఆంధ్రభూమి మాసపత్రికలోనూ, ఒక సీరియల్ నవల 'నవ్య' వారపత్రికలోనూ ప్రచురితమయ్యాయి. యాభై దాకా రచనలు, కథలు, నాటికలు వివిధ పత్రికలు, ఆకాశవాణీ ద్వారా వెలుగుచూశాయి. అలాగే ఇతర భాషల కొన్ని మంచి కథలను తెలుగులోకి అనువాదం చేశాను.

చిరునామా:
ఎం. లక్ష్మీ రమణ కుమారి,
అసిస్టెంట్ అకౌంట్స్ ఆఫీసర్,
ఇ ఎల్.ఒ.పి.-3,
ఎ. జి. ఆఫీస్ (ఎ & ఇ),
లక్డీకాపూల్,
హైదరాబాద్- 500004

మంచులో బిగుసుకుపోయిన మనిషిలా నిశ్చలంగా నిలబడి ఉన్నాడు.

అంతా నిర్ఘాంతపోయి నిలబడిపోయారు. ఎవరికీ నోట మాట కూడా లేదు.

చివరికి ఆ ఫ్లాట్ల అసోసియేషన్ సెక్రటరీ ఎట్లాగో షాక్‌లోంచి ముందుగా బయ

టపడ్డాడు.

"గోపాల్, ఏమిటిదంతా? " అడిగాడు సెక్రటరీ.

గోపాల్ తన కళ్ళను ఇటువైపు తిప్పాడు. ఆ కళ్ళు జీవం లేని గాజు గుళ్ళలా ఉన్నాయి. వాటిలో ఏ భావమూ లేదు. దేనికైనా సిద్ధం అన్నట్లు కనిపిస్తు న్నాడు.

"అయ్యో భగవంతుడా? అసలేం జరి గింది? ఆమె ఇంకా బతికే ఉన్నట్లుంది. డాక్టర్ని పిలుద్దాం" ఎవరో అరిచారు.

"అక్కర్లేదు. చచ్చిందని రుజువు చేసుకు న్నాకే పొడవటం ఆపాను" అన్నాడు గోపాల్.

అంతా మూగవాళ్ళయిపోయారు.

ఇంతలో ఎవరో పోలీసులకి ఫోన్ చేశారు.

"అసలేం జరిగింది? " గోపాల్‌ని ఎవరో అడిగారు.

"అది ఉత్తి లం... దానికి అక్రమ సంబంధం ఉందని నా శ్రేయోభిలాషులు ఎప్పట్నుంచో చెప్తునే ఉన్నారు. ఇన్నాళ్ళూ నేను నమ్మలేదు. మొన్ననే నాకూ అను మానం వచ్చింది. ఊరికెళ్తున్నానని చెప్పి, సూట్‌కేస్ సర్దుకుని బయల్దేరాను. తర్వాత ఎవరూ చూడకుండా లోపలకు వచ్చి అటక ఎక్కి కనబడకుండా కూర్చున్నా. నేను లేనని అది ప్రియుడ్ని పిలిపించు కుంది. ఇద్దరూ నా ముందే సరసాలు మొదలు పెట్టారు. నాది అనుమానం కాదనీ, పచ్చి నిజమని తేలిపోయింది. పైనుంచి దూకి, దాన్ని చంపేశాను" గోపాల్ చెప్పాడు.

"ఎందుకు చంపావురా? ఇప్పుడు చూడు మీ జీవితాలన్నీ నాశనమైపోయాయి" ఎవరో ఆక్రోశంగా అడిగారు.

"అది ఎవడితోనో కులకటం మొదలుపె ట్టిన రోజునే మా ముగ్గురి జీవితాలూ నాశనం అయిపోయాయి" స్థిరంగా జవాబి చ్చాడు గోపాల్.

అంతా గందరగోళం. ఎవరికి వారు పెద్దగా మాట్లాడేస్తున్నారు.

ఇందు కొయ్యబారిపోయి గోపాల్‌ను చూస్తూ నిలబడిపోయింది. ఒక ముచ్చ టైన సంసారం ఎట్లా మూడు నిమిషాల్లో కూలిపోయింది! గోపాల్‌కి ఉరిశిక్ష పడ వచ్చు. అతడి పెళ్ళాం చచ్చిపోయింది. ఏ పాపం ఎరగని ఆ అయిదేళ్ళ పిల్లాడు కాస్తా అనాథ అయ్యాడు.

"పోలీసుల్ని పిలవండి. ఆంబులెన్స్‌ని కూడా" అంతా గొడవ గొడవగా మాట్లాడు తున్నారు.

"ఎప్పుడో పిలిచాం. దార్లో ఉండి ఉంటారు."

"అయ్యో! గోపాల్ ఎంత మంచివాడు. గోపాల్ భార్య అట్లా చేసి ఉండాల్సింది కాదు"

"అవును. గోపాల్ మంచివాడనే బరితె గించినట్లుంది. తెలిసినా నోర్మూసుకుని కూర్చుంటాడనుకుని ఉంటుంది. గోపాల్ మంచిపని చేశాడు. భార్యకి బుద్ధిరావటమే కాదు, ఇంట్లాంటి వెధవ వేషాలేద్దామను కున్న ఆడవాళ్ళందరికీ బుద్ధి వస్తుంది. ఇట్లాంటి పాడు సంబంధాలు పెట్టుకుంటే ఎంత దారుణమైన పరిస్థితులు ఎదురవు తాయో తెలిసివస్తుంది"

"ఆమె కనీసం కొడుకు గురించైనా ఆలో చించి ఉండాల్సింది. మంచిభర్త, మంచి కొడుకు. అసలు ఏ మగవాడు మాత్రం ఇంట్లాంటివి సహిస్తాడు? పిరికివాడైతే ఆత్మహత్య చేసుకుంటాడు. తెగించిన వాడు పెళ్ళాన్నీ, వీలైతే ఆమె ప్రియుణ్నీ కూడా హత్య చేస్తాడు. అప్పటికీ కసి చల్లా రకపోతే పిల్లల్ని కూడా చంపుతాడు"

"ఆడవాళ్ళు కూడా భర్త మరొకరితో తిరి గితే సహించటం లేదు. అట్లాంటిది మగ

వాడు ఎందుకు సహిస్తాడు? వాడి రక్తం మరిగిపోతుంది. ఎవడూ ఇట్లాంటివి సహించడు"

అక్కడ ఉన్నవాళ్ళలో అక్రమ సంబంధాల గురించి తలా ఒకటీ చెప్తున్నారు.

ఇదివరకు రోజుల్లో అయితే ఇందు కూడా వాళ్ళతో చేరేదేమో. ఇప్పుడు భయం, వణుకు కలుగుతున్నాయి.

ప్రేమకి కులం, మతం, ఆస్తి, అంతస్తు అనే తేడాలు ఉండవంటే అందరూ ఒప్పుకుంటారు. మరి ఇన్ని తేడాలు తెలియని ప్రేమకి పెళ్ళి అయిందా లేదా? తను ఎవరి భార్యని లేక భర్తని అని కూడా తెలియదంటే ఎవరు వింటారు? చీపురుతో కొడతారు.

"పాప ఒక్కత్తే ఉంది" అని చెప్పి బయటకు వచ్చేసింది.

ఇంటికి వచ్చి పాపను గుండెలకి హత్తుకుంది. తన సంగతి కూడా హరీష్‌కి తెలిసిపోతే? తనని నరికి పారేస్తాడు. పాప ఏమవుతుంది? ఏడుపు వచ్చేసింది.

చిత్రం ఏమిటంటే అంత ఘోరమైన హత్యని కళ్ళారా చూశాక ఇందు మనసు మారి ఉండాలి. కనీసం భయంతో అయినా మారాలి.

కానీ ఇందు మారలేదు. అది ఆమెకి కూడా స్పష్టంగా తెలిసి, తనకుతానే ఆశ్చర్యపోతోంది. ఏ దారుణమూ, ఏ ఘోర సంఘటనా కూడా భయపెట్టలేని స్థితికి ఇందు చేరుకుంది. ఏదీ ఆమెను మార్చలేకపోతోంది. ఆమె మనసుని హేలీ తప్ప మరేం అంటలేని స్థితిలో ఉంది.

తన ప్రేమని సమాజం ఛీ కొడుతుందని ఇందూకి తెలుసు. ఒక నీతిలేని ఆడదాన్నంటుంది. కళ్ళు మూసుకుపోయాయంటారు. ప్రేమకాదు కామం అంటారు. అంతా ఎంత ఛీత్కరించుకుంటారో ఇందుకి బాగా తెలుసు. అయినా హేలీని ప్రేమించటం మానలేకపోతోంది.

ప్రేమ ఒక వ్యసనమైతే ఇందు ఆ వ్యసనానికి పూర్తిగా లోబడిపోయింది.

హరీష్ ఊరునుంచి వచ్చాడు.

తర్వాత పోలీసులు రావటం, గోపాల్‌ని అరెస్ట్ చేసి తీసుకుపోవటం జరిగాయి. గోపాల్ కొడుకు అంతవరకూ మూగగా నిల్చుని ఉన్నవాడల్లా తండ్రిని పోలీసులు తీసుకెళ్తుంటే గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు. తండ్రి దగ్గరకు పరుగెత్తాలని ప్రయత్నిస్తున్నాడు.

అదిచూసి అందరికీ గుండెలు పిండేసినట్లయింది.

గోపాల్ బంధువులు కొందరు వచ్చారు.

పిల్లవాడిని ఎవరు చూసుకుంటారో ఇక మీదట?

ఏ ఆధారమూ లేక అనాథాశ్రమంలో చేరుస్తారా?

అందరి మనసుల్లోనూ అదే ప్రశ్న.

కానీ ఎవరికి వారు ఏం మాట్లాడకుండా ఊరుకున్నారు. తొందరపడి పిల్లాడి బాధ్యత తీసుకోకుండా తెలివిగా మసలుకున్నారు.

★ ★ ★

"రేపు మనం గ్రేట్ మాల్‌కి వెళ్దాం" అన్నాడు హేలీ.

"సరే" అంది ఇందు.

---

**కొత్తగాలి...**

**పొద్దున లేస్తూనే**
**పొయ్యి కిందకు వెతుక్కోవాలి**
**పొయ్యి మీదకు వెతుక్కోవాలి**
**ఆపైన పనికోసం కూడా..**

– నెల్లుట్ల సుదర్శనరావు,
హైదరాబాద్

"ఎందుకు అని కూడా అడగవా? "

"అడగను. నువ్వు వెళ్దామన్నావు, అంతే. ఇంకేమీ తెలుసుకోవలసిన పనిలేదు. నువ్వు శ్మశానానికి రమ్మన్నా వచ్చేస్తాను" ఇందు నవ్వింది.

"అయ్యో! అట్లా అనకు. ఒక్కోసారి మనం అనుకున్న మాటలు నిజం అవు తాయి. నేనొకవేళ చచ్చిపోయానే అనుకో, నువ్వు శ్మశానానికి రావాల్సి వస్తుంది కూడా"

"అయ్యో! అట్లా మాట్లాడకు" అంది ఇందు. ఆమెగొంతు వణికింది.

"ఏం? ఎవరైనా ఏదో ఒకరోజు శ్మశానా నికే కదా చేరుకోవాలి? "

"నువ్వు లేకుండా నేను బతకలేను" అంది ఇందు.

"నేను పదిలక్షలకి ఇన్సూర్ చేశాను" అన్నాడు హేలీ.

అతనట్లా ఎందుకన్నాడో ఇందుకి తెలుసు. కొన్నాళ్ళ క్రితం ఇందు బంధువు ఒకాయన జ్యోతిష్యం చెప్పించుకున్నాడు. ఆ జ్యోతిష్యుడు అతనికి ఒక సంవత్స రంలో ప్రాణగండం ఉందనీ, బయట పడటం కష్టమనీ చెప్పాడు. వెంటనే ఆ బంధువు భార్య తీవ్రమైన ఆందోళనకి లోనైంది. ఆమె వెంటనే చేయించిన పని ఏంటంటే, భర్తచేత పదిలక్షలకి ఇన్సూరెన్స్ కట్టించటం.

ఇందు అదంతా హేలీకి చెప్పింది.

"ఎంత ఆశ్చర్యం అనిపించిందో తెలుసా? మనుషులు ఇంత మెటీరియలి స్టిక్‌గా ఎందుకు తయారవుతున్నారు? ఆమెకి భర్త చచ్చిపోతాడని బాధకూడా లేదు. ఆమె బాధంతా డబ్బు గురించే. భర్త చావులోంచి కూడా డబ్బు పిండాలని చూస్తోంది" అంది.

"అట్లా ఎందుకనుకోవాలి? భర్త లేకుండా బతకటం ఎంత కష్టమో, డబ్బు లేకుండా బతకటం అంతకన్నా కష్టం. భర్తా, డబ్బూ లేకుండా ఎట్లా బతకాలని ఆవిడ భయపడి ఉండవచ్చు. ప్రాక్టికల్‌గా ఆలోచించి ఉంటుంది" అన్నాడు హేలీ.

"అంత ప్రాక్టికల్‌గానా? "

"ఎవరూ ఎవరితోనూ పోలేరు. కొన్నాళ్ళు విషాదం అనుభవించినా మళ్ళీ మామూలు మనుషులు కాకతప్పదు. ఇప్పుడు మనుషులకి ఆ జ్ఞానం ముందే కలుగుతోంది. కాబట్టి ప్రాక్టికల్‌గా ఉంటు న్నారు" హేలీ అన్నాడు.

వాతావరణం బరువెక్కిందని ఇందు తేలిక పరచాలని చూసింది.

"సరే, ఆయన పోతాడని గ్యారంటీ ఏంటి? అప్పుడు నెలనెలా ఈ ఇన్సూరెన్స్ భారీమొత్తంలో కట్టుకుంటూ ఉండాల్సిందే కదా? " అంది.

"అది ఆవిడకి కష్టం కలిగిస్తుందేమో మరి? ఈ జీవిత భీమాలన్నీ, చస్తేనే లాభంగానీ బతికుంటే కాదు" హేలీ అన్నాడు.

ఇప్పుడు తాను పదిలక్షలకి ఇన్సూరెన్స్ చేశానంటే ఆ సంగతి గుర్తువచ్చింది ఇందుకి.

"నువ్వు పోతే నీ భార్యకి ఇన్సూరెన్స్ వస్తుంది. ఇతర ఫండ్స్ వస్తాయి. నీకేమన్నా ఆస్తి ఉంటే అదికూడా వస్తుంది. కొన్నాళ్ళయ్యాక నిన్ను మర్చిపో తుంది. బహుశా ఇంకో పెళ్ళి చేసుకున్నా చేసుకుంటుంది. కానీ నా సంగతేంటి? నువ్వు లేకుండా నేను బతకలేను" అంది ఇందు.

అతను నిశ్శబ్దంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆ మాటలు మరెవరన్నా అని ఉంటే అక్కడికక్కడే చితకబాది ఉండే వాడు. కానీ అన్నది ఇందూ. ఆమె నిజమే చెప్తోంది. ఆమె చెప్పేవన్నీ సత్యాలే.

## బీదల ఆట!

ఎడారిలో ఆటలు ఆడే అవకాశాలు తక్కువ. ఎమెన్ దేశంలోని జెనరిక్ తెగకి చెందినవారు ఓ ఎడారి ఆటని కనిపెట్టారు. అది ఒంటెల మీంచి దూకటం. 'కేమల్ జంపర్స్' ఆటగా పేరొందిన ఇందులో పాల్గొనేవారు వేగంగా పరిగెత్తుకువచ్చి కదలకుండా నిలబడ్డ ఒంటెల మీంచి అవతలికి దూకుతారు. ఎక్కువ ఒంటెల వరసల మీంచి దూకిన వాడే విజేత. వివాహం లాంటి వేడుకల సమయంలో ఈ ఆటని తప్పనిసరిగా ఆడుతుంటారు. అలాగే ఖర్జూరపు పంట సీజన్ పూర్తయిన సందర్భంగా జరిగే సాంవత్సరిక ఉత్సాహాన్ని అల్ కిమస్ అంటారు. ఆ రోజు గానాభజానాతోపాటు ఒంటెల మీంచి దూకే పోటీని కూడా జరుపుతారు. వారి సంప్రదాయ నీలిరంగు దుస్తులని మోకాళ్ళ నుంచి నడుందాకా బిగించి ఒంటెమీద నుంచి దూకుతారు. ఇటీవల అమెరికాకి చెందిన ఆడమ్ రెనాల్డ్స్ అనే ఫొటోగ్రాఫర్ ఈ ఆటని ఫొటోలు తీసాడు. ఆ తర్వాతే ఈ ఆట గురించి ప్రపంచానికి తెలిసింది. అరబ్బు దేశాల్లోని అత్యంత బీదదేశమైన ఎమన్‌లోని అత్యంత వెనకబడ్డ టెహ్మా ప్రాంతంలో నేటికీ ఈ ఒంటె మీంచి దూకే ఆటే ప్రధాన వినోదం. మన సంస్కృతిలోనూ మనిషి వంగివుంటే దూకే ఆట గ్రామీణ ప్రాంతాలలో ఉంది.



భార్యకి ఉన్నట్లే ప్రియురాలికి కూడా కొన్ని హక్కులుంటాయి. ఆ హక్కులు భౌతికంగా ఉండకపోవచ్చు, మానసికంగా ఉంటాయి. కాబట్టే ఏమాట అన్నా, ఎంత మాట అన్నా పట్టించుకోరు.

"అవును నేను చస్తే, కనీసం భోరుమని పైకి ఏడవటానికి కూడా నీకు కుదరదు" అన్నాడు.

ఇందు బాధ పడింది.

"చాల్లే. ఏదో మాట్లాడి, ఎటెటో వెళ్ళిపోతోంది మన సంభాషణ" అంది.

"అవును, ఇంతకీ గ్రేట్ మాల్ కి ఎందుకు వెళ్తున్నామంటే ఊరికే చూడటానికి. అక్కడ అన్నీ దొరుకుతాయట. సరే, చూసొద్దాం. లంచ్ టైమ్‌లో వెళ్ళి గంటలో తిరిగివద్దాం. తిండికూడా అక్కడే ఏదో దొరుకుతుంది" అన్నాడు.

"సరే" అంది ఇందు.

అరగంట సేపు లంచ్ కి పర్మిషన్, ఆ తర్వాత మరోగంట పర్మిషన్ తీసుకుని ఎక్కడికన్నా వెళ్ళిరావటం మామూలే. పని ఎక్కువగా ఉంటే మరోగంట అదనంగా పనిచేయాలి. ఈ ఆఫీసు ఇందుకి బాగా నచ్చింది. మనుషులు కూడా అంతా మంచివాళ్ళే. అక్కడ పనిచేసే ఛాన్స్ తనకి ఇప్పించిన హేలీమీద ఇందుకి చాలా చాలా అభిమానం, ప్రేమ పొంగి పొర్లి పోతుంటాయి.

మర్నాడు లంచ్ అవర్లో గ్రేట్ మాల్ కి బయలుదేరారు. అక్కడంతా కోలాహలంగా ఉంది. కాస్మెటిక్స్, బట్టలు, నగలు, ఫర్నిచర్, కూరలూ, పళ్ళూ, పప్పులూ ఒక

టేమిటి.. డబ్బుంటే మనిషి తన జీవిత కాలానికి సరిపడ్డవి అన్నీ కొనేసుకోవచ్చు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నవ్వు కుంటూ తుళ్ళుకుంటూ ఒకటొకటే చూస్తూ వస్తున్నారు.

హఠాత్తుగా ఎవరో ఇందు వీపు తట్టారు. అది తట్టటం కాదు, దాదాపు కొట్టటమే.

"ఇందూ! ఆఫీస్‌కి పోలేదా? "

ఇందు ఆ అడిగిన వాళ్ళవైపు చూసింది. విమల కనుబొమ్మలు ముడివేసి హేలీనీ, ఇందూనీ మార్చిమార్చి చూస్తోంది.

ఇందు వెంటనే తేరుకుంది. "నువ్వా

## కొత్తగాలి...

**మద్యం, మైనింగ్, ఇసుక**
**మాఫియాలు**
**మంచానికి మూడు కోళ్ళయితే**
**రాజకీయం దానికి నాలుగో కోడు!**

*– తల్లాప్రగడ ప్రభాకర్,*
*హైదరాబాద్*

అత్తా? ఇక్కడ అన్నీ దొరుకుతాయని విన్నాను. ఇతను మా కొలీగ్ హేలీ. బతి మాలి తోడు తెచ్చుకున్నాను" అంది.

హేలీ చేతులు జోడించి విమలకి నమ స్కారం చేసాడు. విమల నవ్వటానికి ప్రయత్నించింది. చేతకాక ఒకక్షణం మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత ఇంక నటన ఎందుకులే అనుకుందో ఏమో నొసలు చిట్లించి చూసింది.

"ఏం కొన్నావ్ మరి? " కటువుగా అడి గింది.

"ఊరికే ఐడియాకోసం వచ్చాను"

"మంచిదే, ఏదన్నా చేసేటప్పుడు బాగా ఆలోచించి చెయ్యాలి" హెచ్చరిస్తున్నట్లు ధ్వనించింది విమల స్వరం. ఆమె అలా అంటున్నప్పుడు అసహనం మొహంలో కొట్టవచ్చినట్లు కనిపించింది.

"టైమైపోతోంది. వెళ్దామా? " అడిగాడు హేలీ. అతని స్వరం కూడా హెచ్చరిస్తు న్నట్లే ఉండటం ఇందు గమనించింది.

ఇంక ఏమీ చూడకుండా ముందుకి నడి చారు. హేలీ మౌనంగా ఉండిపోయాడు. పార్కింగ్ దగ్గరకి వచ్చారు. హేలీ వెళ్ళి బైక్ తీసుకుని వచ్చాడు. ఇందు ఒక్కదూ కులో సీట్ మీదికి ఎగిరి కూర్చుంది. వెనక నుంచి విమల కోపంగా గమనిం చటం ఇందుకి కనిపిస్తూనే ఉంది.

ఇందు ఆలోచిస్తోంది.

విమల చూసినందుకే తనకు అదోలా ఉంది. ఒకవేళ హరీష్‌గానీ, హేలీ భార్య గానీ చూసి ఉంటే అదెంత అసహ్యంగా ఉండేది. కొలీగ్స్‌మని చెప్పి తేలిగ్గా తప్పిం చుకోవచ్చు. కానీ తమ ప్రవర్తన చూస్తే కేవలం సహోద్యోగులు మాత్రమే కాదని ఎవర్నికైనా అర్థమైపోతుంది. తను ఏమైపో యినా, ఎట్లాంటి అవమానకర స్థితి ఎదు ర్కోవలసి వచ్చినా ఏం ఫర్వాలేదు. కానీ హేలీ మాత్రం బాగుండాలి.

"చూస్తుంటే.. మీ ఆంటీ ఫోన్‌చేసి మళ్ళీ తిట్టేటట్లు ఉంది" అన్నాడు హేలీ.

"నేనేం చెయ్యలేను. చావో లేదా నీతో బతుకడమో నేను తేల్చుకోవాల్సి ఉంది. అంతే. ఇంకెవ్వరినీ పట్టించుకోవాల్సిన అవ సరం నాకులేదు" అంది ఇందు.

అనుకున్నట్లుగానే విమల సాయంత్రం నాలుగుగంటల ప్రాంతంలో ఫోన్ చేసింది.

"నీతో అర్జెంట్‌గా మాట్లాడాలి" అంది.

"నాకు చాలా పనుంది. తర్వాత మాట్లా డుకుందాం" అంది ఇందు.

"అయితే సాయంత్రం ఆఫీసయ్యాక మా ఇంటికిరా. లేకపోతే రేపు నేనే మీ ఆఫీ

సుకి వస్తాను"
"రాకు, నేను వస్తున్నాను" అంది ఇందు.
విమల ఏమేం అడుగుతుందో ఊహించి వాటికి జవాబులు సిద్ధం చేసి పెట్టుకుంది ఇందు. బుకాయించి లాభం ఉండదు. ఉన్నమాట చెప్పేయాలి. ఒకరోజున విమల కూడా ఇదే స్థితిలో ఉంది కాబట్టి తనని అసహ్యించుకునే అవకాశం తక్కువ.
ఆ సాయంత్రం హేలీతో పాటు వెళ్ళి పాపను పికప్ చేసుకుంది. తనని విమల ఇంటికి కాస్త దూరంలో దింపమన్నది.
"ఇక్కడ్నుంచి నడిచివెళ్తే నయం. గుడ్ నైట్" అంది ఇందు.
"అప్పుడే గుడ్‌నైట్ చెప్పకు.. నేను రాత్రి మళ్ళీ ఫోన్ చేస్తాను" అన్నాడు హేలీ.
ఇందు నడిచి విమల ఇంటి ముందుకి వెళ్ళింది. తలుపు దగ్గరకు వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కింది. తలుపు తెరుచుకుంది. విమలను మధ్యాహ్నమే చూసిన ఇందు తెల్లబోయింది. కొద్దిగంటల క్రితం తాజాగా కనిపించిన విమల దీనంగా, కనీసం పదేళ్ళు పైబడ్డట్టు కనిపిస్తోంది. వాచిన కళ్ళు మొహాన్ని మార్చేశాయి. మనిషి ఏదో పెనుభారం మోస్తున్నట్టు ఉంది.
"రా" లోపలకు పిలిచింది.
ఇందు లోపలకు వెళ్ళి సోఫాలో కూర్చుంది. విమల ఆమె ఎదురుగా కూర్చుని పరిశీలనగా చూస్తోంది. ఆచూపు లు ఇందుని ఇబ్బంది పెట్టాయి.
విమల సోఫాలోంచి లేచి వంటింటి వైపు వెళ్ళబోయింది.
"వద్దు, ఇప్పుడేం వద్దు" అంది ఇందు.
"కాస్త కాఫీ తాగు"
"ఇందాకే జ్యూస్ తాగాం" అంది ఇందు.
"తాగారా? అంటే ఎవరెవరు? "
"నేనూ, హేలీ"
"అంటే ఇందాక కనబడ్డవాడేనా? "
"అవును"
"ఎవరతను? ఉట్టి కొలీగేనా? "
"నాకు మంచి స్నేహితుడు కూడా"
"మంచి స్నేహితుడు మాత్రమేనా? " విమల రెట్టిస్తూ అడిగింది. ఇందువైపు కోపంతో చూస్తోంది.
"ఇందూ! నాకు బాడీలాంగ్వేజ్ తెలియ దనుకోకు. మామూలు ఫ్రెండ్‌తోనూ, ఒక లవర్‌తోనూ మాట్లాడటంలో ఎంత తేడా ఉంటుందో, మీ ప్రవర్తన చూడగానే తెలిసి పోతుంది" అంది విమల.
ఇందు మౌనంగా ఉంది.
"అసలు అతనితో నీ సంబంధం ఏమిటి? ప్లీజ్ చెప్పు. నేను నీ శ్రేయోభి లాషిని" అంది విమల.
"ఏ సంబంధమూ లేదు. మా సంబంధం మానసికం. అతడ్ని చూడ కుండా, మాట్లాడకుండా నేను బతకలేను"
"ప్రేమా? "
"అవును"
"ఎందుకు పుట్టిందీ ప్రేమ"
"ఎందుకంటే అతను చాలా మంచి వాడు, నాకు చాలా చాలా సాయాలు చేశా డు. అసలు నాకతనంటే ఎందుకు ఇష్ట మంటే ఏమీ సమాధానం చెప్పలేను. అతడ్ని ప్రేమిస్తున్నానని మాత్రం చెప్పగ లను, అంతే."
"అతనికి పెళ్ళయిందా? "
"అయింది. ఒక కొడుకు కూడా ఉన్నాడు"
విమల కోపం ఆపుకోలేకపోయింది.
"దీన్ని ఎవరూ ప్రేమ అనరు. కామం అంటారు. అది మగవాళ్ళకి సహజమే. కానీ ఆడదానికి ఉంటే దాన్ని పిచ్చి అంటారు" తిట్టేసింది విమల.
"నాకవేవీ తెలియవు. తెలుసుకోను కూడా"
విమలకి కోపం వచ్చి ఇందు చెంపలు వాయించేసింది. దాంతో చెంపలు మండి

పోయాయి. కొన్నిక్షణాలు అసలేం కనిపించలేదు కూడా. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"ఇందూ! ఇదంతా ఎక్కడికి పోతుందో నీకర్థం కావడంలేదు. అనవసరంగా కష్టాలు కొని తెచ్చుకోకు. అర్థం చేసుకోవేం? " విమల అడిగింది.

"నాకు తెలుసు. కానీ దేన్నయినా భరించటానికి, ఎదుర్కోవటానికీ సిద్ధంగా ఉన్నాను"

విమల ఆవేశంతో ఊగిపోయింది. లేచి ఇందు జుట్టుపట్టి లాగి, చెంపలు ఛెళ్ళు ఛెళ్ళున వాయించింది. ఇందూ బాధ భరించలేక ఏడ్చేసింది. తల్లి ఏడుపు చూసి పాప గొల్లుమంది. ఇద్దరూ బిగ్గరగా ఏడుస్తూ ఉంటే విమల కూడా ఏడ్చేసింది.

"ఇందూ నువ్విలాగే ఉంటే చివరకు మిగిలేవి ఈ శోకాలూ ఏడుపులే. మీ ఆయనకి తెలిస్తే ఏమవుతుందో ఆలోచించు. హేలీ పెళ్ళానికి తెలుస్తే ఏం చేస్తుందో తెలుసా? నిన్ను నడిబజార్లో చెప్పు తీసుకుని కొడుతుంది. మొన్న టీవీలో చూశాను. మొగుడికి అక్రమసంబంధం ఉన్నదని పెళ్ళాం వచ్చి ఆ రెండో పెళ్ళాన్ని కొట్టి కొట్టీ చంపి పారేసింది, చివరకు. సాగితే అందరూ ఇంకొకరి పెళ్ళాం కోసమో, మొగుడి కోసమో ఎగబడతారు. ఇట్లా చెప్పు దెబ్బలు తినాల్సి వస్తుందనే తొంభైశాతం మంది నోర్మూసుకుని ఏకపత్నీవ్రతాన్నీ, పతివ్రతా ధర్మాల్నీ పాటిస్తూ ఉంటారు. నీకు ఏ మాత్రం బుద్ధీ, జ్ఞానం ఉన్నా ఆ వెధవతో మాట్లాడటం మానెయ్యి" అంది విమల ఆక్రోశంగా.

"నేను మీరు చెప్పేవి ఏవీ వినే స్థితిలో లేను" అనేసింది ఇందు.

"పొయ్యేకాలం వస్తే ఏవీ వినబడవు. కళ్ళు మూసుకుపోతాయి" కసిగా తిట్టేసింది విమల.

"మళ్ళీ చెప్తున్నాను విను. ఇది కామం కాదు. మాటిమాటికీ కామంతో కళ్ళు మూసుకుపోయాయి అంటున్నావు. అతనితో నాకు శారీరక సంబంధం లేదు. మేము చాలా పవిత్రంగా ఉన్నాం" అంది ఇందు.

"నీ మొహం ఈడ్చ. మానసిక సంబంధం మాత్రం ఎందుకుండాలి? వాడిదంతా డ్రామా. నిన్ను పూర్తిగా నమ్మించాక శారీరక సంబంధంలోకి దిగుతాడు" అంది విమల.

"అతనట్లాంటివాడైతే ఎప్పుడో ఎన్నో అవకాశాలు వచ్చాయి. చాలా మంచివాడు తెలుసా? "

"మగవాడు అనేవాడిలో మంచివాడు అనేవాడే ఉండడు. అవకాశం ఉండటం, లేకపోవటం రెండే వాడికి తెలుసు. వాడెంత దొంగ అయితే అంత సహనంగా వేచి ఉంటాడు"

"అది నీ అనుభవం"

విమల నిరుత్తరురాలైపోయింది.

కాసేపుండి తేరుకుంది.

"ఒకవేళ ఎప్పటికైనా అతను మోసగాడని తెలిస్తే? "

"అట్లాంటి సన్నివేశమే రాదు. గ్యారంటీగా చెప్తున్నాను. కానీ అడిగావు కాబట్టి చెప్తున్నాను. అప్పటికీ అతన్ని ప్రేమిస్తూనే ఉంటాను. అతను దొంగ అయినా, దొర అయినా, రోగి అయినా, యోగి అయినా, ఏమయినా అది ఇప్పుడు నాకు అనవసరం" అంది ఇందు.

విమల నిట్టూర్చింది. "పిచ్చి బాగా తలకెక్కింది. సరే! నీ మొహం కూడా చూడబుద్ధి కావటంలేదు. వెళ్ళు" అంది.

ఇందు పాపను ఎత్తుకుని బయల్దేరింది.

"ఇందూ! ఆఖరిసారి చెప్తున్నాను. వాడితో నీ భాషలో మానసిక సంబంధమో పవిత్ర బంధమో.. ఏదో అన్నావు

చూడు.. దాన్ని వెంటనే మానుకో. ఇదే నా చివరి హెచ్చరిక. ఇక నా బాధ్యత అయిపోయింది. ఇంక ఏం జరిగినా నీదే బాధ్యత. నా దగ్గరకు మాత్రం రాకు" అనేసి భళ్ళున తలుపేసుకుంది విమల.




ఆ రోజు అతను ఫోన్ చెయ్యలేదు. ఇందు ఎంత ప్రయత్నించినా అతనితో మాట్లాడటం కుదరలేదు. ఫోన్ స్విచాఫ్ చేసి ఉంది. ఎక్కడికీ వెళ్ళినట్లు లేదు. ఆఫీస్‌కి ఫోన్ చేస్తే రాలేదన్నారు.

'ఏమయింది?' అనుకున్న ఇందుకి ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. గొంతు తడారిపోయింది. అతని భార్యకిగానీ తమ సంగతి తెలిసిపోయిందా? బావమరిది వచ్చి బెంగళూరు తీసుకెళ్ళిపోలేదు కదా? ఏవేవో ఆలోచనలు, భయాలు! అతను లేకుండా బతకటం ఎట్లా? ఆమె మనసులోని ప్రతి అణువూ పరితపిస్తోంది. ఆమె శరీరంలోని ప్రతికణం అతనికోసం, అతని కాల్ కోసం ఎదురు చూస్తోంది.

అతని ఆఫీస్‌లోని రిసెప్షనిస్ట్‌కి హేలీ రాగానే తనకు ఫోన్ చేసి చెప్పమని చెప్పి ఉంచింది.

మధ్యాహ్నం దాకా నరకయాతన అనుభవించాక హేలీ ఆఫీస్ రిసెప్షనిస్ట్ ఫోన్ చేసింది.

"హేలీకి బాగా జ్వరంగా ఉంది. హాస్పిటల్‌లో చేర్పించారుట?"

"ఏ హాస్పిటల్?" ఇందు వివరాలన్నీ అడిగి తెలుసుకుంది.

నాలుగు గంటల నుంచీ విజిటింగ్ అవర్స్. ఇందు మూడు గంటలకంతా ఆఫీసునుంచి బయల్దేరింది. ఏ.టి.ఎం.లో డబ్బులు డ్రా చేసింది. క్రెడిట్‌కార్డుని ఒకసారి చూసుకుంది. అన్నీ సరిగ్గా ఉన్నాయి. హేలీకి కావాలంటే డబ్బు ఇవ్వటానికి ఏం ఢోకాలేదని రూఢీ చేసుకుని బయల్దేరింది. ఆ తర్వాత పళ్ళు కొన్నది. 'విష్ యూ ఎ స్పీడీ రికవరీ' అని అందంగా అమర్చిన బొకే కొన్నది.

హేలీభార్యని మొదటిసారిగా ఆరోజే చూసింది ఇందు. అంతకుముందు ఆమె ఎట్లా ఉంటుందో చూడాలని ఆసక్తిగా ఉండేది. కానీ ఇప్పుడు ఏమీ ఆసక్తి లేదు. హేలీ గురించిన ఆదుర్దా మాత్రమే. అది కూడా బయటకు కనిపిస్తే హేలీభార్య పసికట్టి ఏం చేస్తుందోనని భయం. కేవలం కొలీగ్స్ అని మాత్రమే ఆమె అనుకోవాలి. అంతే!

హాస్పిటల్‌లోకి వెళ్ళాలంటే ఏదో సంకోచం, జంకు, భయం. ఇదంతా అపరాధ భావన వల్ల కలిగిందే. లేకపోతే ఆమెకి ఇంత భయపడాల్సిన అవసరం ఏముంది? ఒంట్లో బాగాలేకపోతే కొలీగ్స్ వచ్చి పరామర్శించటం అతి సాధారణమే.

గదిలో హేలీ నీరసంగా పడుకుని ఉన్నాడు. మరో నలుగురు కూడా ఉన్నారు. పొరుగింటివాళ్ళుట. హేలీ భార్య నవ్వుతూ ఇందుని ఆహ్వానించింది.

"రండి, రండి... ఆఫీసుకి?" అంటూ ఆగిపోయింది.

"పని ఉండి ఇటువైపు వచ్చాను. పొద్దున్న కాజువల్‌గా రిసెప్షనిస్ట్ చెప్పింది గుర్తుకు వచ్చింది. సరే, ఒకసారి చూసి పోదామనీ..." ఇందు మనసులోని గాభ

రాని, ఆత్రుతనీ అణచుకుంటూ అన్నది.

"ఇప్పుడే అరగంట క్రితం కళ్ళు తెరిచారు. ఒకటే జ్వరం.. ఎంత భయం వేసిందో, హమ్మయ్య జ్వరం తగ్గిపోయింది" గీత చెపుతోంది.

హేలీ కళ్ళు తెరిచి ఇందుని చూసి, లేచి కూర్చోవాలని ప్రయత్నించాడు.

"వద్దు.. పడుకోండి..." అంది ఇందు.

కాస్సేపు కూర్చుని తిరిగి వచ్చింది.

రాత్రంతా నిద్రపట్టలేదు. హేలీకి ఎట్లా ఉందోనన్న ఆత్రుతే. దేవుడికి ప్రార్థన చేసుకుంటూ గడిపేసింది.

★ ★ ★

"మనం పెళ్ళి చేసుకుందాం" అడిగింది ఇందు.

హేలీ హాస్పిటల్ నుంచి డిశ్చార్చ్ అయి వారం అవుతోంది. ఇప్పటికి కాస్త నీరసం తగ్గి మామూలుగా అయ్యాడు.

ఒక్కసారిగా ఇందు బాంబులా పేల్చిన ఆ మాట విని హేలీ నిర్ఘాంతపోయాడు.

'అది అవసరమా? ' అతను అడగలేదు. కానీ ఆలోచిస్తున్నాడు.

అతనికి పిచ్చేక్కేట్లు అనిపిస్తోంది. కానీ ఆలోచించకుండా ఎలా? సమస్య తీవ్రమైనది మాత్రమే కాదు. అతి సున్నితమైనది కూడా. ఎట్లా పరిష్కరించాలి?

'మనసులు ఏకమైతే చాలదా? మనువులు కూడా జరగాలా? '

అమలిన శృంగారం గురించి విని ఉన్నాడు. కానీ అసలు ఎవరైనా అది ఆచరించారో లేదో వాళ్ళకూ దేవుడికీ మాత్రమే తెలియాలి. ఇందుకీ తనకీ మధ్య రేఖ ఏ రోజన్నా, ఏ క్షణంలోనైనా చెరిగిపోవచ్చు. అప్పుడేం చెయ్యాలి?

ఇందు అసలు ఎందుకు పెళ్ళి గురించి ఆలోచిస్తోంది?

"పెళ్ళి ఎందుకు? " అడిగేశాడు.

ఇందు అతనివైపు చూసింది. "నువ్వంటే నాకు పిచ్చిప్రేమ. నిన్ను చూడకుండా బతకలేను" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరగటం చూసి హేలీ గుండె కరిగి నీరైపోతోంది.

"మొన్న నువ్వు హాస్పిటల్లో చేరావు. నీ దగ్గర ఉండి, రాత్రంతా మేలుకుని సేవలు చెయ్యాలని నాకెంత అనిపించిందో తెలుసా? కానీ ఒక మామూలు విజిటర్లా కాస్సేపు కూర్చుని వెళ్ళిపోవాల్సి వచ్చింది. నీ ప్రతికష్టంలో, బాధలో నేను భాగం పంచుకోవాలి. మనల్ని ఎవ్వరూ విడదీయకూడదు. మనకే పరిమితులూ ఉండకూడదు. స్వేచ్ఛగా, హాయిగా బతకాలి. మన బంధాల్ని ఎవ్వరూ ప్రశ్నించకూడదు. ఇవన్నీ మనం భార్యాభర్తలమైతేనే సాధ్యం. లేకపోతే ఎవరి చట్రంలో వాళ్ళు బిగుసుకు పోవలసిందే? " అంది ఇందు.

"అవును " హేలీ ఒప్పుకున్నాడు.

"ఇందూ నీ గురించి చెప్పావు నిజానికి ఈ భావాలన్నీ నాలోనూ ఉన్నాయి. కానీ ఏం చేయగలం? " అన్నాడు.

"హేలీ! ఏక్షణంలోనైనా మనం విడిపోయే భయం ఉంది. నీ భార్యకి గానీ, మా ఆయనకిగానీ తెలిసిపోతే మన బంధం తెగిపోతుంది. అది మనం భరించలేం" అంది ఇందు.

హేలీ తల ఊపాడు.

"అందుకే మనం పెళ్ళి చేసుకుందాం"

"సరే" అంటూ హేలీ ఇందు చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"నీకు తెలుసా హేలీ.. నువ్వు నాచేతిని పట్టుకోగానే ఎంత ధైర్యంగా అనిపిస్తుందో తెలుసా? నువ్వంటే నాకు ఇంకేం అక్కర్లేదు. మంచీచెడూ నాకేం తెలీదు. నువ్వు లేకుండా మాత్రం నేను బతకలేను" అంది ఇందు పిచ్చిగా.

"నేనూ అంతే"

★ ★ ★

హేలీ ఫ్రెండ్ ఒకతను మిత్రా అనే

లాయరు గురించి చెప్పాడు.

మిత్రా పేరున్న అడ్వొకేట్. ఆయన అపాయింట్‌మెంట్ తీసుకున్నాడు హేలీ. మిత్రాకు డైవర్స్ స్పెషలిస్ట్‌గా మంచి పేరుంది. ఎట్లాంటి వాళ్లనైనా ఇట్టే విడదీయగలడని ప్రఖ్యాతి ఉంది.

"ఏంటి కథ అసలు? " మిత్రా అడిగాడు.

ఇందు మిత్రా వైపు చూసింది. అతను జుట్టుని వెనక్కి దువ్వాడు. కళ్ళు చురుగ్గా, జిత్తులమారిగా ఉన్నాయి. పెదవులమీద ఒక వంకర నవ్వు. మొదట్లో తనని చూసి మాత్రమే అతనట్లా వెటకారంగా నవ్వుతున్నాడేమో అనుకుని ఇందు ముఖం చిన్నబోయింది. కానీ అతను ఎవరివైపు అయినా అట్టాగే చూస్తున్నాడని తెలుసుకుని మనసు తేలికపడ్డది. రోజూ కాసిన్ని పెగ్గులు బిగించటం వల్లనో ఏమో కాస్త లావుగా ఉన్నాడు. ఎందుకో గానీ అతని సమక్షంలో ఎవరైనా ఇబ్బందిగానే ఫీలవుతారు. అతి తెలివీ, మాయ మనిషనీ అనిపించే భావాలూ చూసి ఎవరైనా భయపడతారు. నిజానికి తన మొహంలో అట్లాంటి భావాలు తెచ్చి పెట్టుకోవటానికి అతను చాలా కష్టపడాల్సి వచ్చింది కూడా. అవి ఉంటేనే ఎవరన్నా భయపడి, చెయ్యని పనులు కూడా చేశామని ఒప్పుకుంటారు.

అతని వెనక ర్యాక్స్ నిండా లా పుస్తకాలున్నాయి. టేబుల్‌మీద కేసు ఫైల్స్. మరో పక్కన కంప్యూటర్ టేబుల్.

ఆ గదిలోకి వస్తుంటేనే ఇద్దరికీ ఎందుకో భయం వేసింది.

హేలీ, మిత్రాకి అంతా వివరించాడు.

"డైవోర్స్ ఎందుకు? ఇద్దరూ కలిసి జీవించేయవచ్చుగా? " మిత్రా నవ్వాడు.

అతను వెటకారంగా అన్నాడో, నిజంగా సలహా ఇస్తున్నాడో ఇందుకర్థం కాలేదు.

"కలిసి జీవించవచ్చు. కానీ అప్పుడు కూడా మా ఆవిడతో, వాళ్ళాయనతో సమస్యలుంటాయి కదా? మాకు ఎవరికీ భయపడకుండా, స్వేచ్ఛగా మా సంబంధం కొనసాగించాలని ఉంది" హేలీ నిదానంగా చెప్పాడు.

మిత్రా తల ఊపాడు.

"అయితే విడాకులు కావాలి" అన్నాడు.

"అవును" ఇందూ, హేలీ ఒకేసారి అన్నారు.

మిత్రా కాస్సేపు కప్పువైపు చూశాడు. ఆ తర్వాత కళ్ళు తిప్పి, హేలీవైపు చూశాడు.

"ఆమెకి విడాకులు తేలిగ్గా వస్తాయి కానీ... నీకే" అన్నాడు.

ఇందు, హేలీ ఊపిరి బిగపట్టి వింటున్నారు.

"రూల్సన్నీ ఆడవాళ్ళకి అనుకూలం. ఏదో ఒకసాకు చూపి ఆవిడ తేలిగ్గా తన మొగుడ్ని వదిలించుకోవచ్చు. గృహవేధింపులు, గృహహింస కేసేదన్నా బనాయిస్తామని బెదిరిస్తే అతను దండం పెట్టి డైవోర్స్ ఇస్తాడు. కానీ..." మిత్రా ఆగాడు.

"ఆమెకేది వరమో అదే నీకు శాపం అవుతుంది. నీ పెళ్ళాం గనక నీమీద ఆ మాదిరి కేసులు బనాయించిందనుకో, నీ పని గోవిందా!" బెదిరిస్తున్నట్లు అన్నాడు మిత్రా.

ఇందూ, హేలీ బిగుసుకుపోయారు.

మిత్రా బిగ్గరగా నవ్వాడు.

అతని అసిస్టెంట్‌లు చిన్నగా నవ్వారు.

మిత్రా పొడిగించాడు. "అందుకే అంతా రూల్స్ బాగా తెలుసుకోవాలి. సరే, నీ పరిస్థితి ఏంటి? ఆమెకి ఒక కూతురుంది. నీకొక కొడుకున్నాడు. నీ కొడుకుని విడిచిపెట్టి బతకగలవా? " అడిగాడు.

ఇందు, పాపని గుండెకి హత్తుకుంది. పాపని భర్తకి వదిలిపెట్టి, తను ఉండటమంటేనే వణుకు పుట్టింది.

"మేం పిల్లల్ని వదిలిపెట్టి ఉండలేం.

ఆమె పాపంటే, ఆమెకీ, మా బాబంటే నాకూ తగని ఇష్టం" హేలీ ఉన్నమాటనే మిత్రాకి చెప్పాడు.

"అర్థంలేని మాట" మిత్రా మళ్ళీ నవ్వాడు. అతని అసిస్టెంట్లు కూడా నవ్వారు.

చాలా ఇబ్బందికరమైన పరిస్థితి. కానీ ప్రకృతికి విరుద్ధంగా నడుచుకుంటున్న వాళ్ళు ఇట్లాంటి పరిస్థితి ఎదుర్కోక తప్ప దు కాబోలు అనుకుంది ఇందు.

"ఇంక విడాకులెందుకయ్యా? హాయిగా ఎవరి ఫామిలీతో వాళ్ళు సెటిలైపోవ చ్చుగా? " మిత్రా అడిగాడు.

"మేం ఒకళ్ళని విడిచి ఒకళ్లం బతకలేం" ఇద్దరూ ముక్తకంఠంతో చెప్పారు.

అక్కడ అందరి మొహాల్లో ఒక మాదిరి నవ్వు గమనించినా ఇందూ, హేలీ ఏం చెయ్యలేక పోయారు. హేలీని పంపిన ఫ్రెండ్ మిత్రాని కలవమని గట్టిగా సిఫార్సు చేశాడు. మిత్రా అయితే ఏదో విధంగా విడాకులు ఇప్పించగలడని చెప్పాడు.

లాయర్ రాజగోపాల్ వద్ద మిత్రా అసిస్టెంట్‌గా పనిచేశాడు. రాజగోపాల్‌ని చూసి జనం వణికేవాళ్ళు. ఈ కేసూ ఆ కేసూ అని లేకుండా అతడు అన్ని కేసులూ వాదించేవాడు. అతని దగ్గర బోలెడు మంది అసిస్టెంట్‌లుండేవాళ్ళు. వాళ్ళని ఒక్కొక్కళ్ళనీ ఒక్కొక్క కేసుల్లో నిష్ణాతుల్ని చేశాడు రాజగోపాల్. కేసుని ఎలాగో ఒక

లాగ గెల్చేసేవాడతను.

విడాకుల కేసులు మిత్రా తీసుకునే వాడు. లోకంలో ఏవి ఉన్నా లేకపోయినా విడాకులకి మాత్రం కొరత ఉండదు. క్రిమినల్ కేసులూ, ఇతర కేసుల్లాగా ఇందులో పని ఉండదనే ప్రసక్తి లేదు. ఈ రోజుల్లో ఆడవాళ్ళు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. మగవాళ్ళకన్నా, ఎక్కువకూడా చదువుకుని మంచి జీతాలు సంపాయిస్తున్నారు. ఇంట్లో ముద్దుగా పెరిగి వస్తారు. అబ్బాయిలు కూడా ముద్దుగా పెరుగుతారు. గారాబంగా పెరిగి, వాళ్ళకి సర్దుకుపోయే మనస్తత్వం కొరవడుతుంది. అందువల్ల గొడవలు పెరిగి విడాకులదాకా పోతాయి. ఇట్లా ఎన్నెన్నో ఆలోచించి, చివరకు 'విడాకుల కేసులే బెస్ట్' అని భావించాడు. అతని అంచనా తప్పుకాలేదు. కొదవలేకుండా కేసులు దొరుకుతూనే ఉన్నాయి.

రోజూ కేసులు చూసీ చూసీ అతనికి వివాహబంధం మీదే నమ్మకం పోయింది. కానీ తన భార్య మీద మాత్రం నమ్మకం పెరిగింది. కుటుంబాల్లో కలహాలు రావటానికి ఏకైక కారణం సర్దుబాటు ధోరణి ఎవరిలోనూ లేకపోవటమే, భార్య లేక భర్త ఎవరో ఒకరు సర్దుకుపోతే కలహాలుండవు. 'నువ్వు చెప్పింది కరెక్ట్' అంటే పోతుంది. అందుకని భార్య ఏమన్నా 'నువ్వు చెప్పింది కరెక్ట్' అంటాడు మిత్రా. ఆ విధంగా సంసార రథాన్ని సులువుగా లాగించేస్తున్నాడు.

అదే మిత్రాగారి వైభవం.

ఇందూ, హేలీ ఇద్దరూ మిత్రావైపే చూస్తున్నారు. మిత్రా కాస్సేపు మౌనంగా ఉండిపోయి, హఠాత్తుగా నోరు విప్పాడు.

"అమ్మాయ్! నీకు విడాకులు తేలిగ్గా దొరుకుతాయి. మీ ఆయన తాగుతాడా? ఏమన్నా చెడు అలవాట్లు ఉన్నాయా? కొడతాడా? బూతులు తిడతాడా? "

"లేదు, ఆయనకే చెడు అలవాట్లూ లేవు"

"పోట్లాడతాడా? "

"ఎప్పుడో ఒకసారి"

"అయితే ఒకటేదారి!"

"ఏంటది? "

"ఏదన్నా గృహ హింసలాంటి కేసులో ఇరికించామంటే సరి. చచ్చినట్లు ఒప్పుకుంటాడు"

ఇందుకి ఈ ఐడియా నచ్చలేదు. స్నేహపూర్వక వాతావరణంలోనే విడాకులు తీసుకోవాలని అనిపించింది.

మిత్రా తన అపారమైన అనుభవంతో ఆమె భావాలన్నీ గమనించేశాడు.

"నీకు నిజంగా విడాకులు కావాలంటే ఇది మంచిదా? అది తగునా? ఇట్లాంటివి ఆలోచించకు. నిజం చెప్పాలంటే నీ కేసు చాలా సున్నితమైంది. కోర్టులో నిలబడటం చాలా కష్టం. చచ్చీచెడీ నువ్వు విడాకులు సంపాదించినా, అతనికి విడాకులు రావు" అన్నాడు మిత్రా కాస్త కటువుగా.

అతనికి ఈ చిన్నకేసు ఉన్నా ఒకటే, లేకున్నా ఒకటే.

"మరి అతనికి విడాకులు రానిపక్షంలో నేను తీసుకుని మాత్రం ఉపయోగం ఏముంది? " అంది ఇందు ఆందోళనగా.

"మొదట నువ్వు దృఢ నిశ్చయంతో ఉన్నావోలేదో నేను తెలుసుకోవాలి.

### కొత్తగాలి...

**కాలం విలువ తెలిసినవాడు**
**సుముహూర్తం కోసం**
**వేచి చూడడు**

– డి. శిరీష చంద్రశేఖర్,
కర్నూలు

అప్పుడే నేను సీరియస్‌గా ఆలోచిస్తాను. నిన్ను నువ్వు తెలుసుకో ముందు. నీకేం కావాలో తెలుసుకో. అప్పుడు దాన్ని సాధించే మార్గం ఆలోచిద్దాం. సరేనా? " మిత్రా అడిగాడు.

ఇద్దరూ ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"మీరిద్దరూ ఒక వారం టైమ్ తీసుకుని, బాగా ఆలోచించుకుని రండి. అప్పుడు కేసు ఎట్లా నడపాలో మీకు చెపుతాను" అన్నాడు మిత్రా.

ఇద్దరూ సరేనని బయటకువచ్చారు.

"నేను మరోలా అనుకున్నాను. ప్లీడర్లు ఎట్లాగైనా కేసులు రావాలనుకుంటారని విన్నాను. కానీ ఈయన మరోలా ఉన్నాడేంటి? " అడిగింది ఇందు.

"మామూలు కేసులకీ, విడాకుల కేసులకీ చాలా తేడా ఉంది. మనం భారతీయులం, భార్యాభర్తల్ని విడదీయటమంటే మహా పాపమనే భావన మన నరనరాల్లో పేరుకుపోయి ఉంటుంది. ఒక సంసారం నిలబెట్టటానికి ఎంత తాపత్రయమైనా పడతారు. అందుకే భార్యాభర్తలకి రాజీ చేసి ఆనందం పొందుతారు. అవన్నీ వదిలేసినా పెళ్ళనేది ఒక నూరేళ్ళ బంధం. స్వర్గంలో దేవుడు జతపరిచిన జంటని విడదీయకూడదనుకుంటాం" అతను నవ్వాడు.

నిజమే. అందుకే భర్త చావగొట్టినా, చంపినా కూడా భార్యలు నోరెత్తరు. మౌనంగా భరిస్తుంటారు. కానీ తను? ఏం చెయ్యాలి? మనసు తను చెప్పినట్లు వినటం లేదు. ఇందు నిట్టూర్చింది.

హేలీని మర్చిపోవటం అసంభవమని ఇందుకి తెలుసు. అతని నవ్వు, ఆ మెరిసే కళ్ళు, ఆ స్నేహ పూరితమైన ప్రవర్తన అన్నీ ఆమెని అతనికి బానిసని చేసేశాయి. నిజానికి ఇందు అతని బాహ్య రూపాన్నీ, ప్రవర్తననీ కూడా ప్రేమించటం లేదు. ఆమె అతన్ని ఇష్టపడుతోంది, అంతే. ఒక వేళ జానపద గాథల్లో చూపించినట్లు హేలీ హఠాత్తుగా కురూపిగా మారిపోయినా కూడా ఇందు అతడ్నే ప్రేమిస్తుంది. అంతే! దానికి రీజనింగ్ లేదు.

వారం గడిచింది. ఇందు మనసు మారలేదు. పాప తనతో ఉండాలి. హేలీ కూడా కావాలి.

పాప తమతో ఉండేందుకు హేలీ ఒప్పుకున్నాడు.

హేలీ విషయానికి వస్తే అతని భార్య గీత బొత్తిగా అసమర్థురాలు. ఏ పనీ సొంతంగా చేసుకోవటం రాదు. అమాయకురాలు కూడా.

## కొత్తగాలి...

**బేబీ**
**భామ**
**భార్య**
**బామ్మ**
**స్త్రీ జీవితం**

– డి. చందూవంశీ, కర్నూలు

ఆమెని అకస్మాత్తుగా వదిలేస్తే పిచ్చిదైపోతుంది. పిల్లాడిని సమర్థించుకునే తెలివి ఆమెకి లేదు. ఆమెకి అన్యాయం చేసేంత స్వార్థం అతనికి లేదు. నిజానికి ఇందుకి అతనిలో నచ్చింది ఈ మంచితనమే మరి.

ఇద్దరికీ తమ పరిస్థితి అర్థమైంది.

ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలి?

ఇందూ, హేలీ ఇద్దరూ లాయర్ మిత్రా ముందు కూర్చుని ఉన్నారు.

"ఏం నిర్ణయించారు? " మిత్రా అడిగాడు. వాళ్ళు తమ పరిస్థితి వివరించగానే మిత్రా విరగబడి నవ్వాడు.

"మీరు మొదట వచ్చినప్పుడే నేను కని

పెట్టాను. మా అసిస్టెంట్లకి చెప్పాను కూడా. నాకు బోలెడు అనుభవం ఉంది. మీ ఆలోచనలు ఇట్టే కనిపెట్టేస్తాను" అన్నాడు.

ఇందు, హేలీ ఇద్దరూ తలలూపారు.

"ఇప్పుడు ఈ సమస్యకి పరిష్కారం ఏమిటండీ? " అడిగారిద్దరూ.

"ఆమెకు వెంటనే విడాకులు ఇప్పించగలను. సరే, నీ విషయానికొస్తే మీ ఆవిడకి డైవోర్స్ ఇచ్చేందుకు సిద్ధంగా లేవు. అదే సమయంలో ఈ అమ్మాయినీ వదులుకోలేవు. ఒక్క మాటలో చెప్పాలంటే నీకు ఇద్దరూ కావాలి. అంతేగా? " అడిగాడు మిత్రా.

## కొత్తగాలి...

**భూమి తనచుట్టూ**
**తాను తిరుగుతూ**
**మధ్యం చుట్టూ కూడా**
**తిరుగుతోంది**

– వి.వి.ఎస్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

హేలీ, ఇందూ ఇద్దరూ తలలూపేశారు.

"అయితే మరి మరో మార్గం లేదు" మిత్రా ఆగి, హేలీ కళ్ళల్లోకి చూశాడు.

"ఆ అమ్మాయి డైవోర్స్ తీసుకుంటుంది కాబట్టి స్వతంత్రురాలే. లీగల్‌గా నువ్వు నీ భార్యకి విడాకులు ఇవ్వనిదే ఆమెని చేసుకోలేవు. దానికి నువ్వు ప్రిపేర్ అయిలేవు. నీ భార్యకి ఏదో నచ్చచెప్పి, నీ దారికి అడ్డు రావద్దని బతిమాలుకో. ఈమెని పెళ్ళి చేసుకుని పెళ్ళాం హోదా కల్పించలేవు, కానీ ఆమెతో కలిసి ఉండవచ్చు" అన్నాడు మిత్రా.

"అంటే, దాదాపు ఉంపుడుగత్తె హోదా? " వింటున్న హేలీ కోపంగా అరిచేశాడు.

"నువ్వేమనుకున్నా ఇంతకన్నా మార్గం లేదు" అన్నాడు మిత్రా.

"చాల్లెండి..." హేలీ రౌద్రంగా ఏదో అనబోతూ ఉంటే, ఇందు వారించింది.

"ఉండు హేలీ. లాయర్‌గారూ! ఇది నాకు ఇష్టమే" అంది.

"ఇందూ. నీకేమన్నా మతి పోయిందా? " హేలీ అడిగాడు.

"హేలీ! నీకోసం నేను దేన్నికైనా సిద్ధమే" అంది ఇందు.

"ఇప్పుడిలాగే ఉంటుంది. కానీ కొన్నాళ్ళయ్యాక తెలుస్తుంది" అన్నాడు హేలీ.

"తెలియదు. నువ్వంటే చాలు. నాకు భార్య హోదా వద్దు. ఏదీ వద్దు. నువ్వు చాలు" అంది ఇందు. అక్కడ తామిద్దరే లేమని కూడా మర్చిపోయి ప్రేమగా అనేసింది.

"ఇక గొడవే లేదు" అన్నాడు మిత్రా.

హేలీ మొహం అయిష్టంగానే ఉంది.

"రెండ్రోజుల్లో వస్తాం" చెప్పింది ఇందు.

★ ★ ★

ఆ రోజు లాయర్ని కలిసి విడాకులకి నోటీస్ పంపమని చెప్పారు. ఆయన నోటీస్ తయారు చేశాడు. సంతకాలు పెట్టవలసిన చోట పెట్టి, ఆయనకి డబ్బు చెల్లించి, తిరిగి వచ్చారు.

'ఎట్లాగూ విడాకులకి అప్లయ్ చేశాం కదా? ' అని కాబోలు హేలీకీ, ఇందూకీ బాగా ధైర్యం వచ్చేసింది.

హేలీలో ఎంత చిలిపి మనిషి దాగున్నాడో, ఇందుకి అర్థమైంది.

ఇద్దరూ కొత్త పెళ్ళికొడుకూ, కొత్త పెళ్ళికూతురూ లాగే ఫీలవుతున్నారు.

రాకెట్‌ని పైకి పంపటానికి కౌంట్ డౌన్ చేస్తున్న సైంటిస్టుల్లా ఇద్దరూ రోజులూ, పూటలూ, గంటలూ లెక్క పెడు

తున్నారు.

'ఏమేం చెయ్యాలి, ఏమేం చూడాలి, ఏమేం తినాలి' అని ఎప్పుడూ చర్చించుకుంటారు.

మిత్రా విడాకుల నోటీస్ ఒక పది రోజు లాగి పంపిస్తానని చెప్పాడు. ఈ లోపల ఏమన్నా మనసు మార్చుకుంటే చెప్పమని కోరాడు.




ఆ రోజు హేలీ చాలా విచారంగా ఉన్నాడు. కళ్ళు ఎర్రబడి ఉన్నాయి. ఎంత సేపు పనిచేసినా, పగలూ రాత్రీ కూడా కష్టపడ్డా, అలసిపోని అతను చాలా అలసి పోయినట్లు కనిపిస్తున్నాడు. ఎప్పుడూ ఉత్సాహంగా కనిపించే అతను దిగులుగా ఉన్నాడు. ఆ విషాదం అతన్ని వంచేసిందేమో అనిపించేట్లు అతను వంగిపోయి కూడా ఉన్నాడు. మెరిసే అతని కళ్ళు నిర్జీవంగా ఉన్నాయి.

ఇందు అతడ్ని ఎన్నడూ ఆ పరిస్థితిలో చూడలేదు, కాబట్టి హడలిపోయింది.

ఏమైంది? అతని భార్యకు తెలిసిపోయి పోట్లాడిందా? ఏం జరిగింది?

"ఏమైంది? అట్లా ఉన్నావేం? " ఆత్రుతగా అడిగింది.

"బంటీకి ఒంట్లో బాగాలేదు" అన్నాడు హేలీ. బంటీ హేలీ కొడుకు.

"ఏం అయింది? జ్వరమా? "

హేలీ ఆకాశంలోకి చూస్తున్నాడు?

"డాక్టరుకి చూపించావా? " ఇందు మళ్ళీ అడిగింది.

"హాస్పిటల్‌లోనే ఉన్నాడిప్పుడు" హేలీ చెప్పాడు.

"ఏ హాస్పిటల్? అసలేంటి సమస్య? " ఇందు ప్రశ్నల వర్షం కురిపించింది.

అతను కాస్సేపు మౌనంగా ఉండిపోయాడు.

"ఇందూ! నాకు భయంగా ఉంది" అన్నాడు. అతని గొంతు వణుకుతోంది.

ఇందు అతని కళ్ళల్లోకి చూసింది. అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది.

అతను మెల్లగా విడిపించేసుకున్నాడు.

"లివర్ ప్రాబ్లమ్" అన్నాడు.

"ఆc" ఇందు నిర్ఘాంత పోయింది.

"అవును. పది రోజుల్నుంచీ జ్వరం వస్తోంది. మా ఇంటి దగ్గర డాక్టర్‌కి చూపించాం. ఏవో మందులు రాశాడు. అయినా తగ్గలేదు. తర్వాత ఏవో టెస్టులు రాశాడు. అప్పుడు లివర్ ప్రాబ్లమ్ అని బైటపడింది" వణుకుతున్న గొంతుతో చెప్పాడు హేలీ.

"జాండిస్ అయి ఉంటుంది. ఈ రోజుల్లో బోలెడన్ని మందులున్నాయి. భయపడకు" అంది ఇందు.

బంటీకి జ్వరం వచ్చినా తనకు చెప్పలేదు. ఎందుకో? ప్రతి చిన్న ప్రాబ్లమ్‌నీ తనతో పంచుకునే హేలీ బాబుకి జ్వరం వచ్చినా ఎందుకు చెప్పలేదు?

హేలీ తలవంచుకుని కూర్చుని ఉన్నాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగి, బుగ్గల మీదికి జారాయి.

"హేలీ! ఏడుస్తున్నావా? ఇంకా నయం. లివర్ ప్రాబ్లమ్ అంటే పెద్దదేం కాదు. నాకు తెలిసిన చాలా మందికి వచ్చి తగ్గింది" ఇందు ఓదార్చాలని చూసింది.

"లేదు. కాస్త ముదిరిన స్టేజ్. చిన్న

పిల్లాడు. తట్టుకోగలడో లేదోనని భయం వేస్తోంది. గీత చాలా భయపడుతోంది. ఓదార్చలేక పోతున్నాను"

"వైద్యం చాలా అభివృద్ధి చెందింది. భయపడకు"

"డాక్టర్లు ఆపరేషన్ చెయ్యాలేమో అంటున్నారు" ఆ పరిస్థితిలో తండ్రికి ఎంత బాధగా ఉంటుందో ఇందు అర్థం చేసుకోగలదు. మనసంతా హేలీ మీద జాలితో నిండిపోయింది. మృదువుగా అతని భుజం తట్టింది.

అతను ఆమె చేతిని తోసేశాడు.

ఇందు దిగ్భ్రాంతి చెందింది. తన స్పర్శ కోసం తహతహలాడే హేలీ, ఎప్పుడూ ఆమెతోనే ఉండాలని కోరుకునే హేలీ ఎందుకిట్లా చేస్తున్నాడు? ఎంత విషాదంలో ఉన్నాడో అర్థమవుతోంది ఇందుకి.

"దాని గురించి కాదు నా బాధ" అన్నాడు హేలీ.

"మరి దేనికీ? " ఇందు ఆశ్చర్యపోతూ అడిగింది.

"నాకు బంటీ అంటే ప్రాణం. వాడికేమైనా సహించలేను. సరే. అది మరో కోణం. ఇంకో కోణంలో చూస్తే నేను వాడి తండ్రిని. నాకు కొన్ని బాధ్యతలున్నాయి. వాడ్ని బాగా చూసుకోవాలి కదా? కానీ నేనేం చేశాను? అప్పుడే మంచి డాక్టర్‌కి చూపించి అన్ని పరీక్షలూ చేయించి ఉండాల్సింది కదా... నీకు చెప్పాలంటే బాధగా ఉంది. కానీ..." అతను భావోద్వేగంతో వణికాడు.

"ప్లీజ్... బాధ పడకు" ఇందు ఓదార్చింది.

"బాధపడకుండా ఉండలేను. నా ఆవేదనని అర్థం చేసుకో. వాడు రోగంతో బాధపడుతుంటే నేను నీతో రోడ్లూ, పార్కులూ పట్టుకుని తిరిగాను. భగవంతుడా! వాడికేమన్నా అయితే నన్ను నేను క్షమించుకోలేను" కన్నీళ్ళు హేలీ బుగ్గల మీద నుంచి జారిపోయాయి.

ఇందు అట్లాంటి మాటలు ఊహించలేదు. ఏం చెప్పాలో అర్థం కాలేదు. అతని మొహం చూడలేక తలవాల్చుకుని కూర్చుంది.

జీవితంలో మొట్ట మొదటిసారిగా తన సాన్నిహిత్యం అతనిలో ఏ కదలికల్నీ కలిగించ లేకపోతోంది.

ఇందులో అపరాధ భావన చుట్టుముట్టింది. కేవలం అపరాధ భావనే కాదు, ఆవేదనా, విచారం కూడా.

అతను మూర్తీభవించిన విషాదంలా ఉన్నాడు. "వాడికేదన్నా జరిగితే నేను భరించలేను" హేలీ ఏడుస్తూ చెప్పాడు.

"ఏమీకాదు. భయపడకు. నిన్ను నేను అర్థం చేసుకోగలుగుతున్నాను. నువ్వు మొదట గీత భర్తవి. బంటీ తండ్రివి. ఆ తర్వాతే నా ప్రేమికుడివి. హేలీ! బాధపడకు. ఇప్పుడు, పోనీ కనీసం ఇప్పుడన్నా వాడికి ఏం కావాలో చూడవచ్చు. బాధపడకు. అంతా సవ్యంగా జరుగుతుంది. డబ్బు కావాలంటే అడుగు. నువ్వు వాడికి పూర్తిగా నయమైందాకా నువ్వు నన్ను మర్చిపో. నాకు ఫోన్ చెయ్యకపోయినా కూడా నేనేం అనుకోను. సరేనా? అంతా బాగవుతుంది" ఇందు మెల్లగా, అనునయంగా చెప్పింది.

అతని మొహంలో రిలీఫ్ కనిపించింది.

"నువ్వు హాయిగా ఉండాలి. చిక్కుల్లో పడితే నేను భరించలేను. నిన్ను ఎప్పుడూ నవ్వుతూ చూడాలని కోరుకుంటాను" అంది ఇందు.

"నేను కూడా" అతను గొణిగాడు.

"ఇక్కడ ఉండి నీ సమయం వృథా చేసుకోకు. వెళ్ళు, ఏం కావాలన్నా అడుగు. హాస్పిటల్‌కి ఎప్పుడైనా వచ్చి చూస్తాను. కానీ నువ్వు వాడ్ని బాగా చూసుకోవటానికి

మాత్రం నేను ఎన్నడూ అడ్డు రాను" అంది ఇందు.

★ ★ ★

బంటీ హాస్పిటల్‌లో ఉన్నన్నాళ్ళూ హేలీ నరకయాతన అనుభవించాడు. వాడ్ని రకరకాలుగా పరీక్షిస్తుంటే హేలీ, భార్య గీత విలవిల్లాడిపోయేవాళ్ళు.

హేలీకి బంటీని చూస్తే గుండె తరుక్కుపోతుంది. ఇంజక్షన్లు, రకరకాల పరీక్షలు భరించలేక బంటీ గట్టిగా ఏడుస్తుంటే ఏం చెయ్యలేక అసహాయంగా చూస్తూండిపోయేవాళ్ళు గీతా, హేలీ.

బంటీకి ఈ ప్రపంచంలో నెప్పి, బాధ తప్ప మరేం లేవని ఆ వయసులోనే అర్ధమైపోయింది. ఏడ్చినప్పుడు ఏడ్చి, మామూలు సమయాల్లో ఒక యోగిలా కూర్చునేవాడు. వాడ్ని ఆ పరిస్థితిలో చూస్తే గీతకి, హేలీకి కడుపులో మెలితిప్పినట్లు అయ్యేది.

వంతుల వారీగా మేల్కొని బంటీని చూసుకుంటున్నారు.

గీత, హేలీ మొక్కని దేవుడు లేడు. ఊళ్ళో ఉన్న ప్రతి గుడికి వెళ్ళారు. ప్రతి చోటా కొబ్బరికాయలు కొట్టారు.

హేలీకి ప్రపంచంలో అన్నీ మిథ్య, ఒక్క బంటీ జబ్బు మాత్రమే సత్యం అన్నట్లుగా ఉంది. ప్రపంచంలో ఏం జరుగుతోందో కూడా అతనికి తెలియటం లేదు. ఆ హాస్పిటల్‌లోనే ఉంటూ గడిపేవాడు. అక్కడ లేని సమయంలో ఏ గుళ్ళోనో ఉంటున్నాడు. బంటీకి తిండి హాస్పటల్ వాళ్ళే చూసుకుంటారు. గీతా, హేలీ ఏం తింటున్నారో, ఏం లేదో వాళ్ళకే తెలియాలి. మరీ అవసరమైతే ఏదో దొరికింది తిని గడిపేస్తున్నారు.

హాస్పిటల్‌లోని నిశ్శబ్దంలా మూగగా ఏడుస్తూ ఒకరినొకరు ఓదార్చుకుంటూ గడిపేస్తున్నారు.

ఎవరూ శాశ్వతంగా మన కష్టాలు

## అగస్టు - 2012

### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **వరుణాకాంత్**
   - హన్మకొండ, వరంగల్ జిల్లా
2. **యు.వి.ఎస్. శివకుమార్**
   - హైదర్‌షా కోట్, హైదరాబాద్
3. **కటకం శ్రీధర్**
   - రచ్చపల్లి, కరీంనగర్ జిల్లా
4. **కె. సత్యనారాయణ**
   - పెనుగొండ, ప.గో.జిల్లా
5. **సూరి నాగరాజు**
   - ఐ.టి.డి.ఎల్. రోడ్, బెంగళూరు

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. చంద్రకాంత్ | 6. శ్వేత శ్రీ |
| 2. మీనా | 7. గోమతి |
| 3. డేవిడ్ | 8. ఎన్టీ రామారావు |
| 4. జాన్ | 9. కాశ్మీర్ |
| 5. ప్రోగ్రెసివ్ కెన్నల్ | 10. అమెరికా |

పంచుకోరు. విజిటర్స్ ఎవరన్నా వచ్చినా కొద్ది గంటలు ఉంటారు. లేకపోతే కొన్ని రోజులు, నెలలు... ఎవరూ ఎల్లకాలం మనతోటే ఉండరు. హేలీకి, గీతకి ఈ సత్యం బాగా అర్ధమైంది. భార్య భర్త ఒకరికొకరు, అంతే!

ధర్మార్ధ కామ మోక్షాల్లో భార్యాభర్తలు భాగం పంచుకుంటారు. పెళ్ళి ఉద్దేశం అదే.

భార్యాభర్తల బంధం అంటే ఏదో ఆడా

మగా సంబంధం మాత్రమే కాదు. అన్నిటిలో వాళ్ళు సహధర్మం పాటిస్తారు. వారు ఇద్దరు భిన్నవ్యక్తులు కాదు. ఒక్కరే. భార్యాభర్తల సంబంధాన్ని ఏ ధర్మమూ, ఏ మతమూ కాదనదు.

తను గీతతో లేకుంటే ఆమె ఎంత కష్టపడి ఉండేదో హేలీకి అర్ధమైంది.

"దేవుడా! బంటీని కాపాడు" ఇద్దరూ ప్రార్థించేవాళ్ళు.

★ ★ ★

ఆ రోజు మధ్యాహ్నం ఇందు ఆఫీసులో పని చేసుకుంటోంది.

"మిమ్మల్ని మేనేజర్ పిలుస్తున్నారు" అసిస్టెంట్ మేనేజర్ చెప్పాడు.

ఇందూ లేచి వెళ్ళింది.

ఆయన్ని విష్ చేసి, ఎందుకు పిలిచాడా? అని ఆలోచిస్తూ నిలబడింది.

"అయామ్ సారీ. హెడ్డాఫీస్ వాళ్ళ ఆదేశాలు నేను పాటించాలి కదా? " అన్నాడాయన.

ఇందుకి ఏం అర్థం కాలేదు.

"ఏంటి సర్? " అంది.

"నిన్ను ఉద్యోగంలోంచి తీసేస్తున్నాం. ఇంతమంది స్టాఫ్ అనవసరం అని హెడ్డాఫీస్ అంటోంది. నీ పేరు వాళ్ళే ఇచ్చారు. నాదేం లేదు" మేనేజర్ చెప్పాడు.

ఇందు నెత్తిన పిడుగు పడ్డట్లయింది.

"సర్... నేను..." ఏదో చెప్పబోయింది.

"సారీ! ఎకానమీ మెజర్స్. నేనేం చెయ్యలేను. నువ్వు వెళ్ళవచ్చు. రేపట్నుంచి ఆఫీసుకి రానక్కర్లేదు" మేనేజర్ నెమ్మదిగానే అయినా స్థిరంగా, కటువుగా చెప్పాడు.

ఇందుకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కాళ్ళూ చేతులూ వణుకుతున్నాయి. తన సీట్లోకి ఎట్లా వచ్చిందో కూడా తెలియదు.

ఇందు తప్ప అందరికీ ఆ విషయం ముందే తెలిసినట్లుంది. ఎవరూ ఆమెని పలకరించను కూడా లేదు. తమకెందుకన్నట్లు ఎవరికి వాళ్ళు తమ పనిలో నిమగ్నమైపోయినట్లు నటిస్తున్నారు.

కాస్సేపట్లో ఊస్టింగ్ ఆర్డర్ చేతికి వచ్చింది. ఇందుకి అక్కడ ఎవరూ సాయం చేసేట్లు కనబడలేదు. మౌనంగా ఆర్డరు తీసుకుంది.

ఎవరికీ ఏమీ చెప్పబుద్ధి కాలేదు.

మౌనంగా బయటకు వచ్చేసింది.

పాపని తీసుకుని ఇంటికి వచ్చేసింది.

ఏం చెయ్యాలి? ఉద్యోగం లేకుండా ఎట్లా బతకాలి? హేలీని కాంటాక్ట్ చేస్తే? అతనేం పనిలో ఉన్నాడో? అసలే చిరాకులో ఉన్న మనిషికి తన బాధల్ని కూడా చెప్పి మరింత టెన్షన్‌కి గురి చెయ్యటం ఎందుకు?

ఇదేదో కొన్ని రోజులు తనే భరించాలి. బంటీకి నయం అయ్యాక హేలీకి చెప్పాలి. అంతే. పంచుకునేవాళ్ళు లేక ఇందు దుఃఖం మరీ మరీ పెరిగిపోతోంది.

పాపకి స్నానం చేయించి, పాలు తాగించింది. దాన్ని పడుకోబెట్టాక మంచం మీద వాలిపోయి భోరుమని ఏడ్చింది.

ఉద్యోగం లేకపోతే ఎట్లా? మరో ఉద్యోగం ఎప్పుడు దొరుకుతుందో ఏంటో? తన కుటుంబాన్ని పోషించుకోవటానికే నానా కష్టాలూ పడుతున్న హేలీ ఇక



తనకి కూడ ఖర్చు చేయాలంటే మాటలా?

ఇంకో ఉద్యోగం కోసం అప్లై చెయ్యాలి. బాధపడకూడదు. హరీష్ ఇంటికి వచ్చే సమయం అవుతోంది. అతనికి ఏం చెప్పాలి? ఇందుకి అర్థం కావటం లేదు. ఉద్యోగం పోయిందంటే హరీష్‌కే ప్రస్తుతానికి నష్టం. జీతం రాకపోతే ఏయే ఖర్చులు ఆగిపోతాయో తల్చుకుని బాధపడతాడేమో?

ఏవేవో ఆలోచిస్తూ, భవిష్యత్తు ఎట్లాగా? అని బాధ పడుతూ కూర్చుంది.

ఏడు దాటాక హరీష్ వచ్చాడు.

దిగులుగా కూర్చున్న ఇందుని చూశాడు. కానీ ఏమీ అడగలేదు.

"నా ఉద్యోగం పోయింది" చెప్పింది ఇందు.

హరీష్ విన్నట్లు లేదు.

"నా ఉద్యోగం పోయింది" కాస్త గట్టిగా మళ్ళీ చెప్పింది.

హరీష్ ఉలిక్కిపడ్డాడు.

"ఎందుకు? " అడిగాడు.

"ఎకానమీ మెజర్స్ అన్నారు"

"ఇంకా ఎవరెవర్ని తీశారు? "

"నన్నొక్కదాన్నే"

"నిన్నొక్కదాన్నేనా? మరి నన్నొక్క దాన్నే ఎందుకని అడగలేకపోయావా?"

"అడగలేదు" చెప్పింది ఇందు.

"సరే, ఏం చేస్తాం! ఇంకో ఉద్యోగం చూసుకో"

"అట్లాగే" అని ఊరుకుంది ఇందు.

హరీష్ భోజనం చేసి నిద్రపోయాడు.

మర్నాడు అతను వెళ్ళిపోయాక తీరిగ్గా కూర్చుని ఉద్యోగాల కోసం సెర్చ్ ప్రారంభించింది.

అప్పుడు కానీ తను ఇతరుల మీద ఆధారపడిపోయి మారుతున్న ప్రపంచాన్ని ఎంతగా పట్టించుకోకుండా గడిపిందో ఆమెకు అర్థం కాలేదు.

ఏవేవో కోర్సులు, ఇంకేవో ట్రైనింగ్‌లూ అడుగుతున్నారు. తను క్వాలిఫికేషన్‌ని ఇంప్రూవ్ చేసుకోలేదు. పెళ్ళినాటి క్వాలిఫికేషన్లే ఉన్నాయి.

కొన్నింటికి తన అర్హతలు సరిపోతాయనుకుంటే ఎన్నో ఏళ్ళ అనుభవం ఉండాలన్నారు.

నిరాశగా అనిపించింది.

ఇంట్లో ఉండటం అలవాటు లేక చాలా బోర్‌గా ఉంది. వెళ్ళి హేలీతో చెబుదామనిపించింది. కానీ అతని పరిస్థితి అర్థం చేసుకుని నిశ్చలంగా ఉండిపోయింది.

ఆ రాత్రి హరీష్ వచ్చాక ఏమన్నా అడుగుతాడని అనుకుంది. కానీ హరీష్ అడగలేదు.

మాట్లాడకుండా తినేసి, పడుకున్నాడు.

మర్నాడు పొద్దున్నే అత్తగారూ, మామగారూ, ఆడపడుచూ ఆమెభర్తా కూడా వచ్చారు. వాళ్ళు రాత్రే వచ్చారుట. కానీ హోటల్లో దిగారుట.

ఇంకాస్సేపు గడిచేసరికి ఇందుతల్లీ, తండ్రి కూడా వచ్చారు. వాళ్ళ మొహాలు మాడిపోయి ఉన్నాయి.

"చెప్పనే లేదే?" ఇందు ఆశ్చర్యపడింది.

తల్లిమొహం మాడ్చుకుని సమాధానం కూడా ఇవ్వలేదు. తండ్రిమొహం చాలా విషాదంగా ఉంది. ఇద్దరూ కూడా ఏదో బాధని తొక్కిపెట్టుకున్నట్లుగా ఉన్నారు. అవమానాన్ని దిగమింగుకుంటున్నట్లున్నారు.

కాస్సేపు గడిచింది.

అంతా హాల్లో సమావేశం అయ్యారు.

"నువ్విట్లా చేస్తావనుకోలేదు" తల్లి నిష్ఠూరంగా అంది.

"ఆమెనేమీ అనకండి. ఆమె ఇష్టమైనట్లు ఆమె చేసుకుంది" అన్నాడు హరీష్.

ఇందుకి మొదట ఏమీ అర్థం కాలేదు.

అయిదు నిమిషాల్లో వాళ్ళంతా గోలగోలగా మాట్లాడడం మొదలుపెట్టాక అంతా అర్థమైంది.

హరీష్‌కి ప్లీడర్ నోటీస్ అందింది.

ఆ విషయం మాట్లాడటానికే తల్లిదండ్రుల్ని పిలిపించాడు.

ఆ నోటీసు హరీష్‌కి మొన్ననే అందింది. కానీ తొందరపడలేదు. బయటపడలేదు. అంతా మామూలుగానే ఉన్నట్లు నటిస్తూ కావలసిన వాళ్ళందర్నీ పిలిపించాడు.

ఆ తర్వాత కొంచెం సేపటికి హరీష్ ఎంత గొప్పవాడో అర్థం అయింది ఇందుకి.

హరీష్ ఇందు ప్రవర్తనలో తేడాని చాలా రోజుల్నుంచి గమనిస్తూనే ఉన్నాడు.

ఒక రోజున క్యాంప్‌కని బయల్దేరి వెళ్ళాడు. మధ్యలోనే తిరిగి వచ్చి, స్నేహితుడి ఇంట్లో దిగాడు.

ఆ రోజు ఆదివారం, ఆఫీసు లేదు.

ఎటూ హరీష్ లేడు కదా? అని ఇందు పాపను కేర్ సెంటర్లో వదిలి, హేలీతో కలిసి బైక్ ఎక్కి వెళ్ళింది.

ఇద్దరూ ఊరి చివర నిర్జన ప్రదేశానికి

వెళ్లారు. హరీష్‌వాళ్ళను అనుసరిస్తూ వెళ్ళాడు. చాటుగా ఉండి, వాళ్ళ సంభాష ణంతా విన్నాడు. జరిగిందంతా హరీష్ క ళ్లారా చూశాడు.

అతని గుండె మండిపోయింది. రక్తం మరిగిపోయింది. కానీ తెలివైనవాడు కాబట్టి ఆ మంటనీ, మరుగుడునీ తేలిగ్గా చల్లార్చేసుకున్నాడు.

గోపాల్ సంఘటన ఆ మధ్యనే జరి గింది కదా! గోపాల్‌కి పట్టిన గతి హరీష్ కళ్ళారా చూశాడు కూడా. ఇట్లాంటి వ్యవ హారాల్లో ఆవేశపడితే భార్యని ముక్కలు ముక్కలుగా నరకటం తప్పకుండా జరుగు తుంది.

ప్రపంచంలో జరిగే నేరాల్లో, హత్యల్లో తొంభైశాతం సెక్సు, డబ్బు కారణంగానే జరుగుతుంటాయని హరీష్ ఎక్కడో చది వాడు కూడా. అందుకే ఆవేశం తగ్గేదాకా ఫ్రెండ్ ఇంట్లోనే ఉన్నాడు.

తర్వాత తల్లితో, తండ్రితో, చెల్లెలితో తన బాధ పంచుకున్నాడు.

వాళ్ళు నిర్ఘాంతపోయారు. ఇందుని తి ట్టుకున్నారు. తర్వాత జరగాల్సింది ఆలో చించారు.

కోపాలూ, రక్తం కళ్ళ చూడటాలూ దండగ. అందువల్ల జీవితమంతా జైల్లో కూర్చోవటం తప్ప లాభం లేదు. పాప అనాథ అవుతుంది.

ఇంత జరిగాక ఇందుతో కలిసి ఉండటం కల్ల. విడిపోవాల్సిందే. కానీ విడి పోతే ఇందుకి భరణం ఇవ్వాల్సి వస్తుంది. పాపని ఉంచుకుంటానని ఇందు పేచీ పెట్టవచ్చు కూడా. ఇందుని తెలివిగా వది లించుకోవాలి.

అందుకని మనోవర్తి ఏమీ ఇవ్వకుండా, పాపని కూడా తమతో ఉంచుకునేట్లు ప థకం వేశారు.

ఒక డిటెక్టివ్‌కి డబ్బు ఇచ్చి ఇందు మీద నిఘా పెట్టించారు.

## కుటుంబ నియంత్రణపై సర్వే



అమెరికాలో 1960లలో వచ్చిన సెక్స్ రెవల్యూషన్‌కు కొంతవరకు కారణం కండోమ్స్. ఇటీవల ఆ దేశంలో 'ప్లాన్డ్ పేరెంట్‌హుడ్ ఆఫ్ ది గ్రేట్ నార్త్‌వెస్ట్' అనే సంస్థ కుటుంబ నియంత్రణపై చేస్తున్న ఓ సర్వే సందర్భంగా యాభై ఐదు వేల కండోమ్స్‌ను అమెరికా అంతటా ఎంపిక చేసినవారికి ఉచితంగా సరఫరా చేసింది. విశేషమేమంటే ప్రతి కండోమ్‌కు ఒక బార్‌కోడ్‌ను అమర్చారు. ఆ కోడ్‌ను బట్టి ఓ వెబ్‌సైట్ ద్వారా అమె రికాలో ఎక్కడ, ఏ రోజు వాటిని ఉపయో గిస్తున్నారో తెలుసు




కునే సాంకేతిక సౌకర్యం ఉంది. ఆ సైట్ ద్వారా అమెరికాలో కండోమ్స్‌ను అధి కంగా లేదా తక్కువగా ఉప యోగించటాన్ని కనుక్కోవడం సాధ్యమైం ది. ఆ సంస్థ ఆ దేశంలో కండోమ్స్ ఉప యోగం మీద విశ్వసించదగ్గ గణాంకా లను సేకరించగలిగింది. ప్రపంచంలోనే తొలిసారిగా ఇలాంటి ప్రయత్నం అమెరి కాలోనే జరిగింది.

ఇలాంటి ప్రయత్నమే మరొకటి అధిక జనాభాగల చైనా చేపడుతోంది. ఈ ఫలి తాలను శాస్త్రీయంగా విశ్లేషించడం ద్వారా గర్భ నిరోధక ప్రచారాన్ని ఎక్కడ, ఎలా ఉద్ధృతం చేయాలో తెలుస్తుందట.

# చతుర ప్రవేశిక

## సెప్టెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఇందూ భర్త పేరు?
జ.
2. హేలీ అసలు పేరు?
జ.
3. ఇందూతో అసభ్యంగా ప్రవర్తించినవాడు?
జ.
4. విడాకుల లాయర్‌గా ప్రసిద్ధుడైనదెవరు?
జ.
5. బంటీ తల్లి ఎవరు?
జ.
6. ఎమిలీని హత్య చేసిందెవరు?
జ.
7. 'సాక్ష్యం' కథను రాసింది ఎవరు?
జ.
8. లెనార్డ్ కేసును వాదించిందెవరు?
జ.
9. కున్వర్ నారాయణ్‌కు జ్ఞానపీఠం వచ్చిన ఏడాది?
జ.
10. కేమెల్ జంపింగ్ ఆటను కనిపెట్టిన తెగ?
జ.

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: ------------------

------------------------

------------------------

పిన్‌కోడ్:        ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

**విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.**

---

ఇందు, హేలీ ఎక్కడెక్కడకు వెళ్ళిందీ, ఏమేం చేసిందీ అంతా రుజువులూ, సాక్ష్యాలతో సహా ఆ డిటెక్టివ్ సేకరించి ముందుంచాడు.

ఇంతలో ప్లీడర్ నోటీస్ కూడా వచ్చింది. ఇందు తల్లిదండ్రులకి అంతా చెప్పి, పిలిపించారు.

"మీ అమ్మాయి ఎవడితోనో తిరుగుతోంది. ఇప్పుడు ఏకంగా వాడ్నే చేసుకోవాలని విడాకుల నోటీసు కూడా పంపింది. కోర్టుకి వెళ్తే, నేను ఈ రుజువులన్నీ చూపిస్తాను. మీ అమ్మాయి ప్రవర్తన మంచిది కాదని రుజువు చేస్తాను. నాకు అవన్నీ వద్దు. నాకు పాప కావాలి. పాపను నాకు ఇచ్చేసి ఆమె ఇష్టం వచ్చిన చోటుకి పోవచ్చు" అన్నాడు.

ఇందు తల్లిదండ్రులకి తల కొట్టేసినట్లు ఉంది. ఇందుచెల్లెలు వినీలకి పెళ్ళి కావాల్సి ఉంది. అక్క ఇట్లాంటి మనిషంటే ఎవరన్నా చేసుకుంటారో లేదో?! ఇందు అన్నకి పెళ్ళి అయింది. ఇవన్నీ విని, కోడలు తమని కేర్ చెయ్యటం మానేస్తే?

"ఏం పుట్టిందే నీకు? తిన్నగా కాపురం చేసుకోక ఈ పాడు బుద్ధులేంటే? మన ఇంటావంటా ఎక్కడన్నా ఉన్నాయా? ఆ మాయదారి వెధవ ఎక్కడ దొరికాడే? " తల్లి బూతులు కూడా తిట్టేసింది

"మీరు తర్వాత తిట్టుకోండి. ఇప్పుడు మాత్రం జరగాల్సింది తేల్చండి" అన్నాడు హరీష్ నిష్కర్షగా

ఇందు తల్లీ తండ్రీ మౌనంగా కూర్చున్నారు. వాళ్ళకి నిప్పుల మీద కూర్చున్నట్లే ఉంది. ఏ తల్లిదండ్రులకి ఈ పరిస్థితి రాకూడదని మనసులోనే అనుకుంటూ ఏడుస్తూ కూర్చున్నారు.

"ప్లీడర్ దగ్గరకు వెళ్దాం. ఉభయులు సమ్మతితో విడిపోవటం చాలా తేలిక. పాప నా దగ్గరే ఉండాలని కూడా అగ్రిమెంట్ చేసుకోవాలి" అన్నాడు హరీష్

"పాప నాక్కావాలి అంది" ఇందు.

"అట్లా అయితే నేను నీ ప్రవర్తన గురించి రుజువు చెయ్యాల్సి వస్తుంది. పెళ్ళయి సంసారం చేస్తూ, ఇంకొకడిని పెట్టుకున్న నీలాంటి ఆడదాని దగ్గర నా పాప క్షేమంగా ఉండలేదు. రేప్పొద్దున్న వాడికి నచ్చలేదని పాపని చంపినా చంపు తావు. ఎన్ని వార్తలు రావటం లేదు. అక్రమ సంబంధానికి అడ్డు అని కన్నబి డ్డనే కడతేర్చిన తల్లి అని" అన్నాడు హరీష్ కటువుగా.

ఇందు తల్లీ తండ్రీ హడలిపోయారు. "బాబ్బాబు అంతపని చెయ్యకు, దానికి మేం నచ్చచెపుతాం" అని బతిమాలి ఇందు వైపు తిరిగారు. "నీకు సిగ్గులేదు, బుద్ధి లేదు, ఏ బంధమూ లేదు. వాడుంటే చాలు. ఇంక పిల్లెందుకే దొంగముండా? అతను చెప్పింది కరెక్ట్‌గానే ఉంది. నోరు మూసుకుని చావు" అని అరిచారు.

హరీష్ విజయగర్వంతో చూశాడు. "నా యనా! దాని బుద్ధి ఇట్లా తగలబడింది గానీ మాది చాలా మంచి కుటుంబం నాయనా. సంప్రదాయమంటే పడిచస్తాం" ఇందు తల్లి అంది.

ఏ కళనున్నాడో హరీష్ తల ఊపాడు.

"కాస్త ఆలోచించు నాయనా. మా రెండో పిల్ల వినీల చాలా మంచిపిల్ల. నీ కభ్యంతరం లేకపోతే దాన్ని చేసుకో" ఇందుతల్లి దీనంగా అడిగింది.

"మీరన్నా చెప్పండి" ఇందు తండ్రి హరీష్ తండ్రిని బతిమాలాడు.

ఈ ప్రపోజల్‌కి ఇందుతో పాటు హరీష్ కూడా ఆశ్చర్యపోయాడు.

ఇందు సిగ్గుతో చచ్చిపోయింది.

హరీష్ పురుషాహంకారం పురులు విప్పి నాట్యమాడింది. ఆనందంతో నోట మాట రాలేదు. ఇందుకి అవమానం జరగటం ఒకటి. తన విలువని అత్తమామలు కని పెట్టి, రెండో అమ్మాయిని, ఇందు కంటే నాలుగేళ్ళు చిన్నదీ, ఇంకాస్త అందగత్తె అయిన పిల్లని ఇస్తామని బతిమాలడం మరొకటి. కానీ ఆ ఆనందాన్నంతా అణచి పెట్టుకుని విషాదం నటించాడు.

"వద్దు, నాకు పెళ్ళిమీద గౌరవం పోయింది" అన్నాడు.

హరీష్ తల్లిమాత్రం ఊరుకోలేదు.

"ఒక పిల్లని చేసుకుని అనుభవిస్తున్నది చాలదా తల్లీ? నీ కళ్ళింకా చల్లబడలేదా? చాల్లే ఊరుకో" అని తీవ్రంగా ఇందు తల్లి దండ్రులపై విరుచుకు పడింది.

ఇందు తల్లి బిక్క చచ్చిపోయి మౌనంగా కూర్చుంది. 'అంతే లే. ఒకసారి దెబ్బతి న్నాక ఎవరు మాత్రం ఆ ఇంట్లోంచే మళ్ళీ చేసుకుంటారు?' అని సరిపెట్టుకున్నాడు ఇందుతండ్రి.

ఇందుకీ ఆమె తల్లిదండ్రులకే తెలియని మరొక భయంకరమైన నిజం ఉంది. హరీష్ దూరపు బంధువు అపూర్వ. అపూర్వని బాగా డబ్బున్న అబ్బాయికిచ్చి పెళ్ళి చేశారు. ఆమెకేదో లోపం ఉండి, పిల్లలు పుట్టే ఛాన్స్ లేదని డాక్టర్లు చెప్పే శారు. ఇంతలో అపూర్వ భర్త ఏదో యాక్సి డెంట్‌లో చచ్చిపోయాడు. అపూర్వ చాలా అందగత్తె. పై పెచ్చు బాగా డబ్బు కూడా ఉంది. అందుకని ఆమెని పెళ్ళి చేసుకోవ టానికి చాలామంది ముందుకి వచ్చారు. కానీ అపూర్వకి మాత్రం ఎవరినన్నా బీద వాళ్ళని చేసుకోవాలని ఉంది. ఇందు సంగతి తెలియగానే హరీష్ తల్లిదండ్రులు అపూర్వని సంప్రదించారు. హరీష్ మంచి మనిషి, భార్య అట్లాంటిదైతే అతను మాత్రం ఏం చేస్తాడు? ఆమె కోరినట్లే విడాకులు ఇస్తున్నాడు. ఇవన్నీ తెలిసిన అపూర్వ పెళ్ళికి ఒప్పుకుంది. కానీ ఒక షరతు పెట్టింది. తనకి పిల్లలు కలిగే యోగం లేదు. ఆస్తి బోలెడు ఉంది. పిల్లల

కోసం తపించిపోతోంది. ఎవర్నో పెంచుకునే బదులు హరీష్ తన కూతురితో సహా వస్తే సరేనంది.

ఈ పరిణామాలతో హరీష్ ఎగిరి గంతేశాడు. ఇప్పుడు ఇందుని వదిలించుకుని, పాపను తీసుకుని వెళ్ళి, అపూర్వ ఒడిలో వెంటనే వాలిపోవాలని అతని మనసు ఉవ్విళ్లూరుతోంది.

పాప విషయమై ఏం చేయలేనని ఇందుకి అర్థమైపోయింది. తను నిస్సహాయురాలు.

తల్లీ తండ్రీ తనకు ఏమాత్రం సహకరించరు. సాయం చేసేవాళ్ళెవరూ లేరు.

హేలీని డిస్టర్బ్ చెయ్యటం ఇందుకి ఇష్టంలేదు. హేలీ పాపం ఎంత బాధలో ఉన్నాడు. ఇంకా తన బాధలు కూడా చెప్పి బాధపెట్టటం దేనికి?

ఇది తను పరిష్కరించుకోగల విషయమే. తనే పరిష్కరించుకోవాలి.

ఇందు మౌనంగా హరీష్ పెట్టమన్న చోట సంతకాలు పెట్టింది.




**ఇం**దు సూట్‌కేస్‌తో బయటకు వచ్చింది. విడాకులు మంజూరు అయ్యాక ఎక్కడ ఉండాలో అర్థం కాలేదు ఆమెకి.

"నువ్వు మాతో ఏ సంబంధం పెట్టుకోవటానికి వీల్లేదు. మమ్మల్ని సంప్రదించే వాడితో తిరిగావా? ఇంతవరకూ నీ ఇష్టం వచ్చినట్లు ఎట్లా బతికావో అట్లాగే బతుకు. నీ చావు నువ్వు చావు, అసలు ఇంతకన్నా నువ్వు చచ్చివుంటే కొన్ని రోజులు ఏడ్చి ఇంతే కర్మని సరిపెట్టుకునేవాళ్ళం. ఆ యోగం కూడా లేకుండా చేశావు. జీవితాంతం ఏడుస్తూ గడపాలి మేము. మమ్మల్ని తలెత్తుకుని తిరగకుండా చేశావు. మమ్మల్ని ఇంత బాధ పెట్టి నువ్వేం బాగుపడతావే? అనుభవిస్తావు" తల్లి ఇందుకు శాపనార్థాలు పెట్టింది.

తండ్రి ఆ మాటలేవీ అనలేదు గానీ, ఎంతో బాధనీ, అవమానాన్నీ అణచుకుంటున్నట్లు ఆయన మొహమే చెపుతోంది.

"డబ్బున్నవాళ్ళు ఏం చేసినా చెల్లుతుంది. మనకు డబ్బులేదు. ఇప్పుడు నువ్వు చేసింది ఎత్తిచూపి, నీ చెల్లెలి పెళ్ళికి ఇంకాస్త డబ్బు గుంజాలని చూస్తారు. నీ వదినె మా మీద ఇంకాస్త పెత్తనం చెలాయిస్తుంది. కాలం మారింది, లోకం మారింది. కానీ అది మనలాంటి వాళ్ళకి మాత్రం కాదు. ఏ కాలం అయినా డబ్బున్నవాళ్ళకే అనుకూలం. మధ్యతరగతి మానవుడికి స్వతంత్రంగా జీవించే హక్కు లేదు. నీతోపాటు మా అందరి జీవితాలూ ముడిపడి ఉన్నాయని మర్చిపోయావు" అన్నాడు తండ్రి.

"ఇంక నీ దారి నీది. మా దారి మాది. మాతో మాట్లాడటానికి గానీ, కలుసుకోవటానికి గానీ వీల్లేదు" ఇద్దరూ నిష్కర్షగా చెప్పారు.

ఉద్యోగం పోయింది.

వివాహబంధం పోయింది.

పేగు తెంచుకుని పుట్టిన పాప వెళ్ళిపోయింది.

తల్లిదండ్రులూ బంధం తుంచుకున్నారు.

అన్నిటినీ, అందర్నీ పోగొట్టుకుని, ఇందు ఒంటరిగా మిగిలిపోయింది.

అయినా అధైర్య పడలేదు.

హేలీ మెరుగైన వైద్యంకోసం బంటీని ముంబయి తీసుకెళ్ళాడు. మరో పదిరో జుల్లో వచ్చేస్తాడు.

ఈ లోపల ఎక్కడుండాలి? ఏం చెయ్యాలి?

ఇందు తనమెళ్ళో గొలుసు అమ్మేసింది.

ఇందిరానగర్‌లో ఒకావిడ హాస్టల్ నడుపుతోంది. నలుగురు అమ్మాయిలకి ఒక గది. కాస్త చవగ్గానే ఉంది. కాఫీ, భోజనం ఆవిడే ఇస్తుంది. అక్కడ చేరి ఉద్యోగం వెతుక్కోవాలని నిర్ణయించుకుంది ఇందు.

పొద్దున్నే లేవటం, కాఫీ తాగటం, స్నానం చేసి ఏదన్నా తిని, ఉద్యోగాలేమన్నా దొరుకుతాయేమోనని చూడటం తప్ప ఇంకే కార్యక్రమాలూ లేవు.

హరీష్ పెళ్ళి కుదుర్చుకుని, అందరికీ పార్టీ కూడా ఇచ్చాడు. అపూర్వ అందం, డబ్బు, వైభవం చూసి అంతా వెయ్యి నోళ్ళతో హరీష్ అదృష్టాన్ని పొగిడారు.

'మంచివాడివి. నీకంతా మంచే జరుగుతుంది', 'దాని మొహాన కొట్టినట్లు భలే చేశావులే' అంటూ ఒక్కొక్కళ్ళూ పొగుడుతూంటే హరీష్ ఉప్పొంగిపోయాడు.

ఇట్లాంటివి పనిగట్టుకుని మరీ చెవిన వేసిపోయేవాళ్ళు ఉంటారు. అట్లాంటి వాళ్ళొకళ్ళు ఇందుకు చెప్పారు. ఇందు పట్టనట్లు ఉండిపోయింది. హేలీ రాకకోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తోంది.

★ ★ ★

హేలీ తిరిగివస్తే తనను కలుసుకోవటం ఎట్లాగో, అతనికి తెలుస్తుందో లేదో? ఇందు మనసునిండా అదే ఆలోచన. ఇందుఫోన్ హరీష్ తీసేసుకున్నాడు. అది అతని పేరు మీదే ఉంది. ఇంకొక ఫోన్ కొనేందుకు ఇందు దగ్గర డబ్బు లేదు కూడా. అయినా ఏం అనకుండా ఊరుకుంది. ఇందు ఆఫీసులో పని చెయ్యటం లేదు. కాబట్టి హేలీ ఆఫీసుకి వచ్చే అవకాశం లేదు. అతనికి తెలిసిన ఇల్లు వదిలి వచ్చేసింది. అందుకే ఇందు హేలీకి తన విషయం తెలియాలని అతని ఆఫీసుకి వెళ్ళింది. హేలీ హైదరాబాద్ రాగానే తనకు చెప్పమంది. హాస్టల్ నెంబర్ ఇచ్చింది.

"హేలీ వచ్చేశాడు" ఆ రోజు ఇందుకి ఫోన్ చేసి చెప్పింది రాగిణి.

"ఆ.. నిజంగానా? బాబుకి ఎలా ఉంది? " ఇందు ఆత్రంగా అడిగింది.

"బాగుంది. అందుకే మొక్కులు తీర్చేయాలని గుళ్ళకి తిరుగుతున్నారు. లీవ్ కూడా పొడిగించాడుట" రాగిణి చెప్పింది.

ఇందుకి ఆనందంతో ఇంకేం అడగబుద్ధి కూడా కాలేదు. హేలీతో మాట్లాడాలి. ఎన్నెన్నో చెప్పాలి. ఎన్నో అడగాలి. హేలీని చూడాలని మనసు తహతహలాడిపోతోంది. ఇందు అణువణువూ హేలీ కోసం కలవరిస్తోంది.

ఏం చెయ్యాలో తోచటం లేదు.

హేలీని ఎట్లా కలుసుకోవాలి?

చివరకు ఒక మార్గం కనబడింది.

హేలీఫ్రెండ్స్ ఫోన్ నెంబర్లు కూడా లేవు. హేలీ బెస్ట్‌ఫ్రెండ్ శ్రీధర్. అతని ఆఫీసుకి ల్యాండ్‌లైన్ తప్పకుండా ఉంటుంది.

## కొత్తగాలి...

**దాహం వేస్తే**
**తాగాలి నీరు**
**అధికార దాహం వేస్తే**
**తిరగాలి ఊరూరు!**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

టెలిఫోన్ డైరెక్టరీ వెతికింది. నెంబర్ దొరికింది.

శ్రీధర్‌ని కాంటాక్ట్ చెయ్యటం కష్టం కాలేదు.

"హలో" అన్నాడు శ్రీధర్.

"శ్రీధర్! నేను ఇందూని. హేలీని కాంటాక్ట్ చెయ్యటం కుదరటంలేదు. నువ్వే ఎట్లాగో అతనితో మాట్లాడు. ఇవాళ సాయంత్రం ఆరుగంటలకి ఎట్టి పరిస్థితుల్లోనూ మీ ఇంటికి రమ్మను. నేనూ వస్తాను" అంది ఇందు.

"సరే" అన్నాడు శ్రీధర్. తన అడ్రస్ చెప్పాడు.

సాయంత్రం ఎప్పుడవుతుందా అని నిరీక్షిస్తోంది ఇందు. అయిదు గంటలకంతా స్నానంచేసి, తయారైపోయింది. హేలీకి ఇష్టమైన గులాబీ రంగు డ్రెస్ వేసుకుంది. తలకు గులాబీరంగు బ్యాండ్ కట్టి, పల్చగా పౌడర్ వేసుకుని తయారైంది. అన్నాళ్ళ నిరీక్షణలో, నీరసంగా ఉన్న కళ్ళు కాజల్‌తో తళతళలాడుతున్నాయి. హేలీని చూసి, అతనితో మాట్లాడి కొన్ని నెలలవుతోంది. ఇన్నాళ్ళూ తను జీవంలేని కట్టె. కరెంట్ ఉంటేనే బల్బ్ వెలుగుతుంది. లేకుంటే అది ఒక గాజుగోళం మాత్రమే. హేలీ ఉంటేనే ఆమె జీవితంలో వెలుగు. లేకుంటే చిమ్మ చీకటి.

ఇందు డబ్బుని జాగ్రత్తగా ఖర్చు పెడుతోంది. ఎక్కడికి వెళ్ళినా బస్‌లోనే వెళ్తోంది. అయినా హేలీని చూడాలన్న తొందరలో ఆటో ఎక్కి బయల్దేరింది.

హేలీని ఎప్పుడెప్పుడు చూస్తానా? అని తపించిపోతోంది.

★ ★ ★

ఇందు శ్రీధర్ ఫ్లాట్‌లోకి అడుగుపెట్టింది. ఆమెకళ్ళు ఆ గది మొత్తం వెతికేశాయి. కానీ హేలీ ఎక్కడా కనిపించలేదు. ఇంతలో పక్కగదిలోంచి శ్రీధర్ వచ్చాడు.

"హేలీ రాలేదా? " ఇందు అడిగింది.

"వచ్చాడు, పక్కగదిలో ఉన్నాడు" అన్నాడు శ్రీధర్.

"రమ్మను"

"నాకు కొంచెం పనుంది. మా ఆవిడ ఊళ్ళో లేదు. కిందకెళ్ళి కూరలు కొనుక్కొని వస్తాను" అన్నాడు శ్రీధర్.

ఇందు కోరుకుంది కూడా అదే. ఇన్నాళ్ళకి కనిపించిన హేలీని చేతుల్తో చుట్టేసి, గట్టిగా ఏడ్చేయాలని ఉంది. 'వచ్చేశావా హేలీ? ' అని ఆత్రంగా అడగాలని ఉంది. 'నువ్వు లేకుండా నిర్జీవంగా బతికాను హేలీ. నువ్వు వచ్చాకే నాలో జీవం వచ్చింది' అని చెప్పాలని ఉంది.

శ్రీధర్ బయటకు వెళ్ళటం, ఇందు హేలీ ఉన్న గదిలోకి ఒక్క అంగలో ప్రవేశించటం ఒకేసారి జరిగాయి.

ఆమె రావటం చూసిన హేలీ తటాల్న ముందు గదిలోకి వచ్చాడు. ఇందు కూడా అక్కడికి వచ్చింది.

"ఇందూ! నీకు ఎట్లా చెప్పాలో తెలీటం లేదు" అన్నాడు హేలీ.

"చెప్పు హేలీ. నువ్వేం చెప్పినా నాకు బాగానే ఉంటుంది. నీ మాట విని ఎన్నాళ్ళయిందో నీ నోట్లోంచి వచ్చే ప్రతీ మాటా నాకు అమృతపు తునకే" అంది ఇందు.

## కొత్తగాలి...



**భూమాత**
**రక్షణకు పెట్టుకున్న**
**భటులు**
**చెట్లు**

- కిలపర్తి దాలినాయుడు,
సాలూరు, విజయనగరం జిల్లా

"ఇందూ, నన్ను మర్చిపో" అన్నాడు హేలీ.

ఇందూ నెత్తిన పిడుగు పడినట్లయింది. మనిషి నిలువునా కంపించిపోయింది.

"హేలీ!" ఆమె పెదవులు అస్పష్టంగా పలికాయి.

"అవును ఇందూ. నీతో ఇక ఏ సంబంధమూ కొనసాగించనని ఒట్టేసుకున్నాను. ఇవాళ కూడా నీతో మాట్లాడటానికి గంట సేపు ప్రార్థించుకుని, పర్మిషన్ తీసుకుని వచ్చాను" అన్నాడు హేలీ.

"ఎవరి పర్మిషన్? మీ ఆవిడదా? " ఇందు అయోమయంగా చూస్తూ అడిగింది.

"కాదు, దేవుడిది"

ఇందు అయోమయం ఇంకాస్త పెరిగింది.

"ఏం మాట్లాడుతున్నావు హేలీ? నాకేం అర్థం కావటం లేదు" అంది.

"ఇందూ! బంటీ చావు చివరి అంచు వరకూ వెళ్ళాడు. మృత్యువు బంటీని తన చేతుల్లోకి తీసుకుంది కూడా. కానీ ఇందూ.. నీకు తెలుసుగా. నేను ఎంత భక్తుడినో" హేలీ మెల్లగా చెబుతున్నాడు.

"నాలో పాపచింతన మొదలైంది. నేను ధర్మం తప్పాను. పరస్త్రీని ఆశించాను. కొడుకుని నిర్లక్ష్యం చేశాను. అందుకే దేవుడు ఆగ్రహించి, బంటీని దూరం చెయ్యాలని చూశాడు. నేను ఒక రాత్రంతా ఏడుస్తూ, దేవుడ్ని ప్రార్థిస్తున్నాను. ఇక నుంచీ బుద్ధిగా భార్యనీ, కొడుకునీ చూసుకుంటానని వేడుకున్నాను. నీతో ఇక మాట్లాడనని ఒట్టేసుకున్నాను" హేలీ చెప్పాడు.

ఇందు చెవుల్లో ఘోష. ఏ క్షణాన్నైనా కింద పడిపోయేట్లు ఉంది.

హేలీ ఆమె భావాలేవీ గమనించకుండా చెప్పుకుని పోతున్నాడు.

"చిత్రం. దేవుడు నా మొర ఆలకించాడు. అద్భుతం జరిగింది. అంతవరకూ

ఏ మందుకీ లొంగని జబ్బు మర్నాడే తగ్గు ముఖం పట్టింది. బంటీ బతికి బయటపడ్డాడు"

ఇందు గుడ్లప్పగించి వింటోంది.

"నీతో ఎట్లా చెప్పాలో తెలియక ఎంత బాధ పడ్డానో, దేవుడు నా బాధ తీర్చేశాడు. నీతో చెప్పేశాను" అన్నాడు హేలీ.

ఇందు శిలలా నిలబడిపోయింది.

శరీరం చచ్చుబడి, నిలువునా బిగదీసుకుపోయినట్లయింది.

"ఇందూ, నన్ను మర్చిపో" అన్నాడు హేలీ.

ఇంతలో శ్రీధర్ తిరిగి వచ్చాడు.

## కొత్తగాలి...

**పోపుల పెట్టె**
**అమ్మ**
**కిడ్డీ బ్యాంక్**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

ఇందూని ఓదారుస్తున్నట్లు చూశాడు.

"ఇందూ! హేలీ ప్రాబ్లం అర్థం అయింది కదా? కానీ నీ కర్మానికి నిన్ను వదిలెయ్యం. మాకు చేతనైన సాయం చేస్తూనే ఉంటాం. నీకు ఉద్యోగం చూస్తాం. అట్లాగే పెళ్ళీ జరిపిస్తాం. ఈ రోజుల్లో పెళ్ళిళ్ళు తేలిగ్గా జరిగిపోతున్నాయి. నువ్వు అన్నీ మర్చిపోయి, కొత్త జీవితం మొదలు పెట్టుకోవచ్చు" అన్నాడు శ్రీధర్.

కట్టెలా నిలబడిపోయిన ఇందుకి ఆ మాటలతో అగ్ని రగిలింది. ఆ అగ్ని ఆమెని ఆపాదమస్తకం దహించి వేస్తోంది.

"నీ పెళ్ళానికి చేసుకోరా నాలుగు పెళ్ళిళ్ళు" అంది కోపంగా అరుస్తూ.

"ఇందూ!" శ్రీధర్ బిత్తరపోయాడు.

ఇందు కోపంతో నిలువునా వణికిపోతోంది. నిప్పులు కురిపిస్తున్న కళ్ళతో హేలీవైపు తిరిగింది.

"ఇంతకన్నా... నీకన్నా నాకు పెళ్ళాం పిల్లలే ఎక్కువ. ఏదో మోజుపడి నీవెంట తిరిగాను. ఆ మోజు తీరిపోయిందని చెప్తే బాగుండేది కదా? " అంది ఆగ్రహంతో ఊగిపోతూ.

"ఇందూ..." హేలీ ఏదో చెప్పబోయాడు.

ఇందు అతడ్ని మాట్లాడనివ్వలేదు.

"హుఁ.. భక్తుడివి. రోజూ పూజ కూడా చేస్తావు. నీ భక్తి కొత్తగా పుట్టిందేం కాదుగా! మరి ఆనాడు పరస్త్రీ అని తెలియలేదా? నీకు పెళ్ళాం, కొడుకూ ఉన్నారని గుర్తు రాలేదా? " అరిచేసింది.

"ఇందూ! శారీరకంగా మనం పాపం చెయ్యలేదు" హేలీ హీన స్వరంతో అన్నాడు.

"శారీరకం, మానసికం అని ఇన్ని పాపాలు ఉండవు. శారీరక సంబంధం ఉంటేనే, పూర్తి సంభోగం జరిగితేనే పాపం అని కాదు. ఒక స్త్రీని ఆ దృష్టితో చూడటం కూడా పాపమే"

"ఇందూ! పరిస్థితి అర్థం చేసుకో"

"బాగానే అర్థం చేసుకున్నాను. దేవుడ్ని అడిగి, నీ కొడుకుని తిరిగి తెచ్చుకున్నాననుకుంటున్నావు కదూ? ఆ దేవుడు, నీ కొడుకుని తిరిగి తీసుకుపోకుంటే, అసలు దేవుడే లేడనుకుంటాను" అంది ఏడుస్తూ.

హేలీ వణికిపోయాడు.

శ్రీధర్ మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

"ఇందూ! ప్లీజ్... శపించకు. అయ్యో దేవుడా? " హేలీ ఏడుస్తూ, మోకాళ్ళ మీదికి వాలిపోయాడు.

"శపిస్తాను. నాకింత అన్యాయం చేసినందుకు, నీ కొడుకు నీ కళ్ళ ముందే చస్తే,

# అతిచెడ్డ పర్యాటకులు!




అమెరికన్ ట్రావెల్ వెబ్‌సైట్ 'లివింగ్ సోషల్' ఇటీవల ప్రపంచంలోని టూరిస్టుల మీద ఓ సర్వేను నిర్వహించింది. 5600 మంది టూరిస్టులను ప్రపంచవ్యాప్తంగా ఇంటర్వ్యూ చేశాక, అందరికన్నా అమెరికన్లు అత్యంత అధమ టూరిస్టులని కనుగొన్నది. తర్వాతి స్థానాలు చైనీస్, ఫ్రెంచ్ పర్యాటకులకు దక్కాయి.

ఉత్తమ టూరిస్టులు ఆస్ట్రేలియా, స్విట్జర్లాండ్, ఐర్లాండ్ దేశస్థులని కూడా ఈ సర్వేలో తేలింది. దేశంతో సంబంధం లేకుండా ప్రతి పదిమంది టూరిస్టులలో నలుగురు హోటల్ గది నుంచి ఏదో ఒక వస్తువు దొంగిలించారని కూడా ఈ సర్వేలో తేలింది.



టూరిస్టులు దొంగిలించిన వాటిలో టవల్స్ 28 శాతం, బాత్‌రోబ్స్ ఎనిమిది శాతం, పిల్స్ నాలుగు శాతం, రిమోట్ కంట్రోల్స్ మూడు శాతంగా ఉన్నాయి.. 2011లో టూరిస్టుల ప్రధాన గమ్యం పారిస్ అయింది.

2008లో ఆరు దేశాలలోని హోటల్ వర్కర్స్ తమ అభిప్రాయాలను కలబోసుకున్నాక యూరప్‌లోని టూరిస్టులలో ఫ్రెంచ్ వాళ్లు అధములని పేర్కొన్నారు. టిప్పులివ్వడంలో పిసినారితనం, దురుసుగా ప్రవర్తించడం వారిలోని ప్రధానమైన చెడ్డ లక్షణాలుగా వారు చెప్పారు.

---

ఇంతకన్నా ఏడుస్తావు. నీ కొడుకు చస్తాడు, చస్తాడు" గట్టిగా ఏడుస్తూ, హేలీని శాపనార్థాలు పెడుతూ బయటకు పరుగెత్తింది ఇందు.

ఇందు ఎంత బాధపడుతుందో హేలీకి తెలుసు. అయినా ఈ మాట చెప్పి తీరాలి. తనకి శక్తిని ప్రసాదించమని దేవుణ్ని ప్రార్థించాడు. ఇందుకి చెప్పక తప్పదు కాబట్టి ఈ ఒక్కసారికీ ఆమెతో మాట్లాడనిమ్మని కూడా వేడుకుని వచ్చాడు.

తన గుండెల మీద మోస్తున్న ఆ నిప్పుల కుంపటిని అతను ఇందు గుండెల మీదకి మార్చగలిగాడు.

హేలీ కిందపడి ఏడుస్తున్నాడు.

ఇందు గట్టిగా ఏడుస్తూ పరుగెత్తుతుంటే అంతా ఆశ్చర్యం, భయంతో చూశారు.

ఏడుస్తూనే ఇందు గబగబా మెట్లన్నీ ఎక్కేసింది.

"హేలీ! ఇందూ పైకి వెళ్తోంది" శ్రీధర్ అరిచాడు.

హేలీ ఒక్క ఉదుటన లేచి బయటకు వచ్చాడు.

ఇద్దరూ ఇందూ వెనకే పరిగెత్తారు.

ఇందూ వెర్రి ఆవేశంతో, పిచ్చి కోపంతో ఉంది. ఆవేదన, ఆగ్రహం, అసహాయత, ఆవేశం ఆమెకి వెర్రిబలాన్ని కలిగిస్తున్నట్లున్నాయి. మగవాళ్ళై ఉండికూడా హేలీ, శ్రీధర్ ఆమెపరుగు అందుకోలేకపోయారు.

వాళ్ళు చూస్తుండగానే ఇందు టెర్రస్ మీద నుంచి కిందకు దూకేసింది.

ఇద్దరు అప్రతిభులైపోయారు. గోడ దగ్గరకు పరుగెత్తి కిందకు చూశారు. రక్తపు మడుగులో పడి ఉన్న ఇందు కనిపించింది.

రక్తపు మడుగులో పడున్న ఇందును చూసి, ఫ్లాట్స్‌లోవాళ్ళు అంబులెన్స్‌కి, పోలీ

సులకి ఫోన్ చేశారు.

ఇందులో కొన ఊపిరి ఉంది. కాళ్ళూ చేతులూ కదిలిస్తోంది.

అంబులెన్స్‌లో హాస్పిటల్‌కి తీసుకువెళ్ళారు. నిమిషాల్లో ఆ వార్త అంతా పాకిపోయింది.

ఇందుకి పక్కటెముకలు విరిగాయి. ఒక చెయ్యి, కాలు కూడా విరిగాయి. రక్తం బాగా పోయింది. అసలు బతకదనే అనుకున్నారు అంతా.

ఛానల్స్, న్యూస్‌పేపర్స్, ఆ వార్తని కవర్ చేశాయి. పబ్లిసిటీ పుణ్యమా అనేమో డాక్టర్లు ఇందుని బతికించటానికి చాలా శ్రమ పడ్డారు.

## కొత్తగాలి...



**తెరవగానే పుస్తకం**
**రెక్కలు విచ్చుకున్న**
**పక్షి అవుతుంది**

– సిరి,
పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

మృత్యువుతో కొన్ని రోజులు పోరాడాక ఇందు కోలుకోవటం మొదలు పెట్టింది.

డిశ్చార్జ్ చెయ్యాలంటే ముందు ఇందు ఎక్కడికి వెళ్ళాలనేది తేలాలి.

'హర్షిత' అనే స్వచ్ఛంద సంస్థ ఇందుకి ఆశ్రయం ఇవ్వటానికి ముందుకొచ్చింది.

★ ★ ★

ఇందు శారీరకంగా కోలుకుంది. కానీ మానసికంగా కోలుకోవటానికి ఎంతకాలం పడుతుందో, అసలు కోలుకోగలదో లేదో హర్షిత నిర్వాహకులకి అర్థం కాలేదు. ఆమె తీవ్రమైన డిప్రెషన్‌లో ఉంది.

మనిషినీ, మనసునీ, ఆత్మనీ, దేహాన్నీ, ఆమె సర్వాన్నీ కుదిపి కుదిపి వేసిన ప్రేమ ఇప్పుడామెలో లేదు. అట్లాగని ద్వేషమూ లేదు. తీవ్ర నిరాశ మాత్రం ఉంది.

అసలేమైందని? చక్కటి కాపురాన్ని చేజేతులా కూలదోసుకుంది తను. హేలీ కోసం తపించింది. అతని ప్రేమలో సమిధలా కాలిపోయింది. అతడ్ని ఎంత ప్రేమించిందంటే, చివరికతను పచ్చి మోసగాడైనా, కుష్ఠురోగైనా, హంతకుడైనా, ఆ ప్రేమ మారనంత. కానీ ఏం జరిగింది? మరి అంతగా ప్రేమించాననుకున్న మనిషిని తను ఎట్లా శాపనార్థాలు పెట్టగలిగింది? తను పతివ్రతా శిరోమణి కాదు, తన శాపాలు ఫలించేందుకు. కానీ తను హేలీని దూషించిన మాట సత్యం.

ఏ ప్రేమకోసం ప్రపంచాన్నీ, సమాజాన్నీ, కట్టుబాట్లనూ ధిక్కరించిందో.. ఏ ప్రేమకోసం సంసారాన్నీ సర్వస్వాన్నీ తృణప్రాయంగా త్యజించగలిగిందో, ఆ ప్రేమ కూడా నిలువలేదు చివరకు. తనది స్వచ్ఛమైన ప్రేమే అయితే అతను తనతో మాట్లాడకపోయినా సరే, అతని ఊహల్లోనే జీవించి, అతన్నే తల్చుకుంటూ గడిపేయాల్సింది. తను అట్లా చెయ్యలేదు.

అతని ప్రేమ కూడా సత్యం కాదు. అది సత్యం అయివుంటే ఎట్లాంటి కష్టం వచ్చినా భరించేవాడే కానీ ఇట్లా తనని వదిలేస్తానని దేవుడి ముందు ప్రమాణం చేసేవాడు కాదు. చిత్రమేమిటంటే తమది ప్రేమ కాదనీ, కేవలం వ్యామోహమో, శారీరక ఆకర్షణో అని తామిద్దరికీ తప్ప, సమస్త ప్రపంచానికీ ముందే తెలుసు. పీకలదాకా వచ్చి, పీక తెగే పరిస్థితి వచ్చేవరకూ తమకి మాత్రం తెలియలేదు.

తను మూర్ఖురాలు. ఎంతమంది చెప్పినా వినలేదు. ఎన్ని సంఘటనలు చూసినా మారలేదు. తనకి బతకటం చేత కాలేదు.. సరికదా! చావటమూ చేతకా

లేదు. తను అసమర్థురాలు. లోకంలో బతికేందుకు పనికిరాదు.

ఇందు ఎవరితోనూ మాట్లాడదు. ఎప్పుడూ ఏటో చూస్తూ కూర్చుంటుంది. లేకపోతే ఏడుస్తూ ఉండిపోతుంది. ఆమె విషయం ఏం చెయ్యాలో 'హర్షిత' నిర్వాహ కులకీ అర్థం కాలేదు. 'పోనీలే' అని వది లేస్తే మళ్ళీ ఆత్మహత్య చేసుకుంటుందేమో నన్న భయం. చివరికి ఆమెని సైకియాట్రి స్టుకి చూపించాలనే నిర్ణయానికి వచ్చారు.

★ ★ ★

నిశ్చలంగా తనముందు కూర్చున్న ఇందుని చూశాడు సైకియాట్రిస్ట్ సోమసుం దరం.

**కొత్తగాలి...**

**భూమిని అమ్మే వ్యాపారులకు**
**లాభాల పంట**
**భూమిని నమ్ముకున్న రైతన్నలకు**
**నష్టాలు, కష్టాలేనంట**

– టి.వి.ఆర్. నర్సయ్య,
మహబూబాబాద్, వరంగల్ జిల్లా

నిజానికి ఈ కేసు టేకప్ చేసినపుడు ఆయనకి చాలా క్లిష్టంగా అనిపించింది. ఎందుకంటే నష్టాలనేవి రెండు రకాలు. ఒకటి ఇతరుల మూలంగా జరిగేవి. అవే ఎక్కువ శాతం కూడా. వాటిని మరిపిం చటం తేలిక. అవతల వ్యక్తి తనను మోసం చేస్తేనో, నష్టం చేస్తేనో, వాడిని క్షమించి, మర్చిపోవటం తేలిక. అట్లాగే ప్రయత్నించి, అవతల వ్యక్తి తప్పుల్ని క్షమించెయ్యటం కూడా తేలికే. అక్కడ కనీసం తృప్తి, ఆనందం ఉంటాయి.

కానీ తనను తానే మోసం చేసుకుని, తనకు తాను నష్టపోవటం అనేది రెండో రకం. అట్లా నష్టపోయి, విలపిస్తున్న వ్యక్తిని మరిపించటం కష్టం. ఆ వ్యక్తి తనను తాను క్షమించుకోవటం కష్టం.

ఇందుది ప్రస్తుతం అదే స్థితి.

స్వయంకృతం వల్ల సర్వం కోల్పో యింది. తననుతాను క్షమించుకోలేని స్థితిలో ఉందామె. ఆమెని మామూలు మనిషిని చెయ్యటం సోమసుందరంకి చాలా కష్టమే అయింది. మెల్లమెల్లగా నచ్చ చెప్పి, మామూలు మనిషిని చెయ్యగలుగు తున్నాడు.

'ఈ రోజుల్లో ఉద్యోగాలకోసం ఆడవాళ్ళు బయటకు రావాల్సి వస్తోంది. ఇంటా బయటా ఎన్నో సమస్యలు. మగవాళ్ళకీ అంతే. ఎవరికీ ఉద్యోగాల్లో భద్రతలేదు. పోటీ ప్రపంచంలో రకరకాల కష్టాలు పడి నిలబడాల్సి వస్తోంది. భార్యాభర్తా ప్రశాం తంగా కూర్చుని గడిపే సమయం తక్కువ. ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకుని త మ సమస్యలు కలబోసుకుని సాంత్వన పొందడం తక్కువ. ఇద్దరికీ ఆర్థిక స్వాతంత్ర్యం ఉండటం వల్ల అహమూ అ డ్డొస్తుంది. భార్యాభర్తలు కూడా కొన్ని పరి మితులు ఏర్పరచుకుని, ఒకళ్ళ పరిధిలోకి మరొకళ్ళు వెళ్ళక, ఒకే ఇంట్లో ఉంటున్న ఇద్దరు వేర్వేరు మనుషుల్లా మాత్రమే జీవి స్తుంటే అపార్థాలు, కోపాలు వస్తాయి. తామిద్దరం ఒకటే అనుకుంటే సమస్యలు రావు.

విడాకులు తీసుకోవచ్చు. కానీ అది విధి లేని పరిస్థితిలో మాత్రమే. పెళ్ళి అనేది ఒక బంధం. భార్యా భర్తా దానికి కట్టు బడి ఉండటానికి ప్రయత్నించాలి. ముఖ్యంగా పిల్లలు ఉన్న తల్లిదండ్రులు!'

ఇందు ఆలోచిస్తోంది. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు ఉంది తన పరిస్థితి.

ఆమె కళ్లలో నీళ్లు తిరుగుతున్నాయి. "ఇందూ! బాధపడకు. నువ్వు చేసింది

తప్పు అయితే, తప్పులు చెయ్యటం మానవ సహజం" సోమసుందరం అన్నాడు.

తను చేసింది తప్పే. అయితే ఆ తప్పు చేయటానికి పరోక్షంగా కారణం అయిన వాళ్ళ సంగతేమిటి? కట్నం ఎక్కువ వస్తుందని, ముందు ఉద్యోగం చేయకపోయినా ఫర్వాలేదని ఒప్పుకుని, ఆ తర్వాత ఉద్యోగం చెయ్యమని బలవంతం పెట్టిన అత్తా, మామా, భర్తా.. ఉద్యోగం చెయ్యటానికి వచ్చిన అమాయకపు ఆడపిల్లని పీక్కుతిన్న పరంజ్యోతి, అధికారం, అహంకారం తప్ప మరోటి తెలియని షీనాదేవీ, తనని నట్టేట్లో వదిలేసిన అమ్మానాన్నా, తన ఒక్కడి సంసారం బాగుంటే చాలనుకున్న హేలీ! హుఁ.. అంతా ఎవరికివారు స్వార్థపరులు. తను అంతా మౌనంగా భరించింది. తనకి బతకటం కుదరలేదు. సరే, చావటం కూడా చేతకాలేదే?

ఇందు వెక్కి వెక్కి ఏడుస్తోంది.

సోమసుందరం ఒక్కొక్కటే విడమరచి చెప్తూ, ఇందుని మామూలు మనిషిని చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు.

"నువ్వు మౌనంగా అన్నీ భరించావు. అది గొప్పేంకాదు. నీ బలహీనత మాత్రమే. నేరుగా ఎక్కడికక్కడ తేల్చేసుకోగల తెగువ, ధైర్యం నేటి ఆడపిల్లలకి ముఖ్యం. అన్ని పనులూ చేస్తూ, ఆర్థికంగా సంసారాన్ని ఆదుకుంటూ కూడా నువ్వు వెన్నెముక లేనిదానిలా ప్రవర్తించావు. చివరికి నీ మీద కాస్త సానుభూతి చూపిస్తూ చిన్న సాయాలు చేసిన వ్యక్తిమీద కృతజ్ఞతని ప్రేమగా మార్చుకుని మోసపోయావు. నీ బలహీనత వల్ల ఎవరికివారు నిన్ను దోపిడీ చెయ్యగలిగారు. ఈ దోపిడీని నువ్వు మొదట్లోనే ఎదిరించి వుండాల్సింది" ఒక్కొక్కటీ చెపుతుంటే ఆమెకళ్ళు తెరుచుకుంటున్నాయి.

"ఇందూ! ఆ జీవితం అయిపోయింది. చవటలా ఒకళ్ళకి లోబడి, ఎవరో ఏదో చేస్తారని ఆశించే కాలం పోయింది. లే ఇందూ. ధైర్యంగా నిలబడి గుండె నిండా ఆత్మవిశ్వాసం పెంచుకో" సోమసుందరం చెప్తుంటే ఆమె అణువణువులో శక్తి నిండిపోతోంది.

"రేపే నీ ప్రయాణం" అన్నాడాయన.

"ఎక్కడికి? " ఆశ్చర్యపోతూ అడిగింది.

"అనఘా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ రిలేషన్స్‌కి"

"నేనేం చెయ్యాలి అక్కడ? " ఇందు ఇంకాస్త ఆశ్చర్యపోయింది.

"చదువుకోవాలి. అక్కడ చదువు విలక్షణంగా ఉంటుంది. నిన్ను పరిపూర్ణమైన వ్యక్తిగా తీర్చి దిద్దుతారు. అంతేకాదు, ఆ సంస్థకి అంతర్జాతీయంగా చాలా పేరు ఉంది. అక్కడ చదివినవాళ్ళకి మంచి జీతంతో ఉద్యోగాలు దొరుకుతాయి"

"కానీ... నేను..."

"నీ అనుమానాలన్నీ తెలుసు. అక్కడ సీట్ దొరకడం సామాన్యమైన విషయం కాదు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకో. ఆ ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు నామీద అభిమానంతో అడగగానే అంగీకరించారు. సరే, ఇక నీ రెండో అనుమానం నువ్వు ఆ కోర్సు చెయ్యగలవా లేదా అనేనా? "

"అవును"

"చెయ్యగలవు. చేస్తావు"

ఇందు ఆలోచిస్తోంది. ఆ రోజు చెట్టు కాండం పుచ్చి, చెట్టు పడిపోయిన దృశ్యం కళ్ళముందు కదిలింది. చెట్టుపడిపోతే తలా కాస్తా కాయలూ, కొమ్మలూ నరికి తీసుకుపోయారు. అందులోంచి కూడా లాభం పొందాలని చూశారే తప్ప దాన్ని తిరిగి నిలబెట్టగలమా అని ఎవరూ ఆలోచించనే లేదు. తన జీవితమూ అలాగే కూలిపోయింది. అందులోంచి ఎవరికి వారు లాభం పొందుదామనే చూశారు

తప్ప దాన్ని నిలబెట్టాలని చూడలేదు.

కానీ లోకం అంతా చెడ్డది కాదు. అందులోనూ మంచివాళ్ళున్నారు. కాబట్టే తను బతికి బయటపడగలిగింది. పడిపోయిన చెట్టుని తిరిగి నిలబెట్టాలనుకునే మహానుభావులూ ఉన్నారు.

ఇందు తలూపింది.

రెండేళ్ళు గడిచాయి. ఇందు చదువు పూర్తి చేసుకుని బయటికొచ్చింది. ఈ ఇందు పాత వ్యక్తి కాదు. ఆత్మవిశ్వాసంతో వెలిగిపోతున్న మొహం, ధైర్యంతో తళుక్కుమంటున్న కళ్ళు, ఆమె పూర్తిగా మారిపోయింది.

ఎన్నో మంచి అవకాశాలు వచ్చినా, కాదనుకుని ఒక స్వచ్ఛంద సంస్థలో అసిస్టెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా చేరిందామె. మోసపోయిన స్త్రీకీ, అన్యాయాలకి గురైన ఆడవాళ్ళకీ వాళ్ళు అండగా నిలుస్తారు. స్త్రీలకి తమ హక్కులు తెలుసుకునేలా చేస్తారు.

ఇందు ప్రాజెక్ట్‌సభ్యులతో రంగంపల్లి వైపు ప్రయాణిస్తోంది. దారికి ఇరువైపులా గుబురుగా పెరిగినచెట్లు. వాటిని చూస్తుంటే ఇందుకి ఆనాడు చెట్లు పడిపోవడం గుర్తు వచ్చింది. చెట్టూ జీవితం రెండూ ఒకటేననిపించింది. చెట్టుని ఆశించే చీడపురుగుల్లా స్త్రీకి చెరుపు చేయాలని చూసే విషపు మనుషులుంటారు. పాపం చెట్టుకి తననుతాను రక్షించుకునే సామర్థ్యం లేదు. కానీ స్త్రీ తన మెదడుతో ఆలోచించి మంచీచెడూ తెలుసుకోవాలి. తనను తాను రక్షించుకోవాలి. ఒకవేళ పొరపాటు జరిగితే దాన్ని చక్కదిద్దుకోవాలి. చీడను తొలగించుకోవాలి.

చెట్టు పడిపోతే తిరిగి నిలబెట్టే ప్రయత్నం చేయాలి. అప్పుడు ఆ చెట్టు వృక్షమై తను నిలబడటమే కాకుండా ఎంతోమందికి చల్లటి నీడనిస్తుంది. చక్కటి ఫలాలను అందిస్తుంది. ©



మల్లికార్జున్ నుంచి మరో ఎస్సెమ్మెస్..

ఈ వారం ఆంధ్రదీపిక ఇరవై ఐదో పేజీలో తన కథ పడింది చదవమంటూ.

ఈ మధ్య తరచూ అతడి నుంచి ఇలాంటి మెసేజ్‌లు వస్తున్నాయి.

అతడు రాసిన కథలు పత్రికల్లో విపరీతంగా ప్రచురితమవుతున్నాయి. కొన్నింటికి బహుమతులు వస్తున్నాయి కూడా. వాటి సమాచారం ఎప్పటికప్పుడు నాకు పంపుతున్నాడు.

నిజానికి మల్లికార్జున్‌కి కథలపైన ఆసక్తి కలిగించింది నేనే. రోజూ పత్రికల్లో వస్తున్న కథలను అతడికి వినిపిస్తూ, వాటి గురించి వివరంగా చర్చించేవాడ్ని.

'ఈ కథలో ప్రారంభం ఎంత గొప్పగా ఉందో...పాఠకుడు కథపైన విపరీతంగా ఆసక్తిని పెంచుకుంటాడు...'

'ఇందులో ముగింపు చాలా భిన్నంగా ఉంది. దీన్ని అంత తేలిగ్గా మరిచిపోవటం సాధ్యం కాదు. చాలాకాలం ఇది వెంటాడుతుంది'

'ఇతివృత్తం, కథనం రెండూ గొప్పగా ఉన్నాయి...' ఇలా అనేక సాయంత్రాలు వాడితో ముచ్చట్లు... నిత్యం 'కథా'కేళి సాగేది.

ఇప్పుడు అతను రచయితగా ఎదగటం నాకు సంతృప్తి కలిగించే విషయమే అయినా...

## చతుర కతే

అప్పట్లో అడపాదడపా పత్రికల్లో కథలూ, వ్యాసాలూ రాసే నా గురించి ఏమాత్రం అతడు వాకబు చేయకపోవటం ఆశ్చర్యం కలిగించేది.

'ఈ పత్రికలో... ఫలానా పేజీలో...'

అంటూ వాడి ఎస్సెమ్మెస్‌లు నడిచేవి.

మనసులో ఈ విషయం బాధపెట్టేది.

చాలాకాలం పాటు చిన్నా చితక ఉద్యోగాలతో కాలక్షేపం చేసిన నాకు...

అదృష్టవశాత్తు ఓ పేరున్న దర్శకుడి ప్రాపకం లభించింది. అతని దగ్గర పనిచేస్తున్న పది, పన్నెండు మందిలో నేనొకడ్ని. మిగతా అందరి కంటే చురుకైన వాడినని తరచూ ఆయన నన్ను మెచ్చుకుంటాడు. నెలవారీ ఇతరులకి చెల్లించే దాని కంటే ఓ వెయ్యి రూపాయలు ఎక్కువే ఇస్తాడు.

# తెర వెనక మనిషి

- చిరువోలు పార్థసారథి



'బ్రదర్! రాత్రికి బ్లూమూన్‌లో పార్టీ ఇస్తా...' కొత్తగా చేరిన కుర్రాడు అక్కడున్న మిగతా నలుగురితో పాటు నన్ను కూడా విం దుకు ఆహ్వానిం చాడు.

'పెళ్లి కుది రిందా! ఏమిటి?' ఆట పట్టిస్తున్న ట్టుగా ఒకరు అడి గారు.

'అదేం లేదు. ఈ మధ్య ఓ కొత్త బేరం తగి లింది. ఓ గవర్న మెంట్ ఆఫీసులో పెద్ద ఆఫీసరు. రచయితగా పేరు కనిపించాలని పి చ్చి అతనికి. తన పేరుతో రచనలు చేస్తే బాగా ముట్ట చెబుతానన్నాడు.

తాజాగా ఈ మధ్యనే ఓ నవల రాసిచ్చా...' చెప్పుకుంటూ పోతున్నాడు ఆ కుర్రాడు.

'అతని పేరు...?' మధ్యలో అడ్డుపడి అడిగా రెవరో...

అతని పేరు చెప్పాడు.

మీరు ఊహించింది కరక్టే.

మ... ల్లి... కా... ర్జు...న్...!

అయితే ఏం లాభం? రచయితగా నా పేరు ఎక్కడా కనపడదు. నా రచనల ఖ్యాతి ఆ దర్శ కుడికే దక్కుతుంది.

నేను కేవలం తెరవెనక మనిషినే.

ఆ రోజు మనసంతా దిగులుగా అనిపించింది.

సాయంత్రం స్టోరీ సిట్టింగ్‌కి రమ్మని దర్శకుడి నుంచి పిలుపు వచ్చింది.

అభావంగా వెళ్లాను. అక్కడున్న రెండు గంటలూ యాంత్రికంగా మసిలాను.

Ⓒ

# నవ్య కవితోద్యమ సారథి

**విశిష్ట భారతీయ సాంస్కృతిక మూల్యాలు, సృజనశీలం భూమికగా చేసుకుని ఆధునిక విశ్వజనీన భావజాలాన్ని జీర్ణించుకున్న కవి తల్లజుడు కున్వర్ నారాయణ్ హిందీ సాహిత్యక్షేత్రంలో నవ్య కవితోద్యమ సారథిగా ప్రఖ్యాతి గాంచారు. చారిత్రక-పౌరాణిక నేపథ్యాల్లో వర్తమానాన్ని దర్శించడం ఆయనలోని ప్రత్యేకత. హిందీ సాహిత్యానికి చేసిన అమూల్య సేవలకుగాను ఆయన 2005 లో జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నారు.**

**నారాయణ్** 1927 సెప్టెంబరు 19న ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫైజాబాద్‌లో జన్మించారు. వారిది చాలా సంపన్న కుటుంబం. ఆయన బాల్యం కొద్దికాలం ఫైజాబాద్, అయోధ్యలలో గడిచింది. తర్వాత ఎక్కువ కాలం లక్నోలో ఉన్నారు. 'విష్ణు కుటి' భవనం లక్నోలో ప్రసిద్ధమైనది. నారాయణ్ కుటుంబ నివాసం పేరది. లక్నో సందర్శించే ప్రముఖులను ఆ కుటుంబం అతిథులుగా గౌరవించేది. నిత్యం ఆ భవనంలో కవితా సుగంధం గుబాళిస్తూ ఉండేది. అంతేకాదు, ప్రఖ్యాత కళాకారులు విచ్చేసి అనేక విషయాలు చర్చించేవారు. ఉత్తమ సాంస్కృతిక వాతావరణం అక్కడ విరాజిల్లేది. ఆ విధంగా నారాయణ్‌లో చిన్ననాటనే సాహిత్యాభినివేశం, కళాభిరుచి పెంపొందాయి. వారి ఇంటికి వచ్చే అతిథుల్లో సత్యజిత్‌రే ఒకరు. నారాయణ్ వీరందరి నుంచీ స్ఫూర్తి పొందారు. విద్యతోపాటు చరిత్ర, పురాణేతిహాసాలు, గాంధీ, కబీర్, అమీర్ ఖుస్రో రచనలు, బౌద్ధమతం, మార్క్సువాదం మొదలైనవి అధ్యయనం చేశారు. ఆచార్య కృపలానీ, నరేంద్రదేవ్ వంటి నాయకోత్తముల ప్రభావం ఆయనపై ప్రసరించింది. విద్యార్థిగానే నారాయణ్ కవితా రచన ప్రారంభించారు. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో మంచి ప్రవేశమున్న నారాయణ్ 1951లో లక్నో విశ్వవిద్యాలయం నుంచి ఇంగ్లీషు సాహిత్యంలో ఎం.ఏ. పట్టం స్వీకరించారు. రాజకమల్ ముఖర్జీ వంటి



ప్రతిభామూర్తులు గురువులుగా లభించడం అదృష్టమని భావించారు.

కులీన కుటుంబం కావడం చేత నారాయణ్ ప్రత్యేకంగా ఉపాధి కోసం ఉద్యోగాన్వేషణ చేయవలసిన అవసరం ఏర్పడలేదు. సాహిత్య సృజనే వ్యాసంగంగా స్వీకరించారు. 'యుగచేతన' పత్రిక నెలకొల్పి, దానికి సహ సంపాదకత్వం వహించారు. సాహిత్యంలో వినూత్న మార్గానికి అది నాంది పలికింది. 'నయా పత్రిక', 'ఛాయానత్' పత్రికలకు కూడా ఆయన సహ సంపాదకులుగా వ్యవహరించారు. భారత ప్రభుత్వ హిందీ సలహా మండలి, ఉత్తరప్రదేశ్ హిందీ సంస్థాన్‌ల సర్వసభ్యమండలి సభ్యులుగా సేవలందించారు. ఉత్తరప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఉపాధ్యక్ష బాధ్యతలు నిర్వహించారు.




భారతేందునాట్య కేంద్రం అధ్యక్షులుగా పనిచేశారు. నేషనల్ బుక్ ట్రస్ట్ కార్యవర్గ సభ్యులుగా ఉన్నారు. ఇంకా పెక్కు పదవులు నిర్వహించారు. నారాయణ్ గొప్ప చింతనాశీలి, వక్త కూడా కావడం చేత దేశవిదేశాల నుంచి పెక్కు ఆహ్వానాలు అందుకున్నారు. వెనిస్ విశ్వవిద్యాలయంలో పురాణాలపై, ఆధునిక హిందీ కవితపై ప్రసంగించారు. వార్సా, స్టాక్ హోం, గోథెన్‌బర్గ్,

కేంబ్రిడ్జ్, లండన్ మున్నగు తావుల్లో కావ్యపఠనం చేశారు. అమెరికా, ఇటలీ, ఇంగ్లండు, రష్యా, చైనా, నేపాల్, పాకిస్థాన్ మొదలైన దేశాలలో సాహిత్య సమ్మేళనాలలో పాల్గొన్నారు. పర్యటనల సందర్భంగా నజీమ్ హిక్మత్, పాబ్లొనెరుడా, వలేరీ,

> సమ్యక్ జీవనం అంటే క్రూర తర్కవితర్కాలు కాదు.. కంటక సదృశ ఈర్ష్యాద్వేషాలు కాదు.. స్నేహసౌహార్ద్రాల మధురిమలు కురవాలి - కున్వర్ నారాయణ్



కవాఫీ, బోర్జెస్ వంటి కవిశేఖరుల్ని కలుసుకుని అనేకానేకాంశాల మీద చర్చలు జరిపారు.

1950 నుంచి కవితా రచనకు ఉపక్రమించిన నారాయణ్ సాహితీ కృషి బహుముఖీనంగా సాగింది. సామాజిక నిబద్ధత ఉన్న సాహితీవేత్త ఆయన. కవిత, విమర్శ, కథ, కళ-చారిత్రక వ్యాసాలు మొదలైన ప్రక్రియల్లో ఆయన రచనలు విశేష ప్రాచుర్యాన్ని పొందాయి. వీటిలో నూతన దృక్పథం ఆవిష్కృతమయింది. ఆయన సమన్వయవాదిగా ఖ్యాతి గాంచారు. 1956లో వెలువడిన 'చక్రవ్యూహ్' అనే కవితా సంపుటి ఆధునిక హిందీ సాహితీరంగంలో ఆయనకు సముజ్జ్వల స్థానం లభింపచేసింది. అజ్ఞేయ సంపాదకత్వంలో వెలువడిన 'తీస్రాసప్తక్' కవుల్లో నారాయణ్ ఒకరు కావడం వల్ల ఆయన కీర్తి ఇనుమడించింది.

'పరివేశ్‌హమ్‌తుమ్' ఆయన రెండవ కవితా సంపుటి. అది భావంలో, అభివ్యక్తిలో సమున్నత స్థాయి చేకూర్చుకుంది. 1965లో ప్రచురితమైన 'ఆత్మజయీ' మహాకావ్యంగా గణుతికెక్కింది. కఠోపనిషత్తులోని నచికేతోపాఖ్యానం ఆధారంగా వర్తమాన పరిస్థితులను మేళవిస్తూ రచించిన ఈ ప్రబంధంలో నారాయణ్ తన తాత్త్విక చింతనను అద్భుతంగా చిత్రించారు. భౌతిక సుఖాల కంటే సత్యాన్వేషణ, ఆత్మ స్వరూప దర్శన ప్రాధాన్యాన్ని కవితా పాటవంతో విశదీకరించారు. 'ముఝ్‌కో ఇస్‌సినాజఫ్టమె విశ్వాస్ నహీ/ ముఝ్‌కో ఇస్ దునియా దారిమే విశ్వాస్ నహీ/ యహ్ దునియా యహ్ భవిష్య్ తుమ్‌కో సాదర్ వాపస్/ మిల్‌సకే అగర్‌తొ ఏక్ దృష్టి ఛాహియే ముఝే/ జీవన్ బచ్‌నెకె అంతర్‌కె ధ్యాన్' - ఈ పంక్తులు నారాయణ్‌ను సత్యాన్వేషిగా నిలుపుతాయి.

సమకాలీన సాంఘిక సమస్యలపై కవితలు 'అప్నేసామ్నే'లో చోటుచేసుకున్నాయి. 'కోయీ దూసరా నహీ', 'ఇన్‌దినో' కవితా సంపుటాల్లో ఉత్తమ ప్రశంసలందుకున్న కవితలెన్నో ఉన్నాయి. 'ఆజ్ ఔర్ ఆజ్‌సే పహలే' గ్రంథం నారాయణ్ విమర్శనా పటిమకు దర్పణం వంటిది. ఆయన జరిపిన ముఖాముఖి విశేషాలు 'మేరే సాక్షాత్కార్'లో పొందుపరిచారు. 'ఆకారోంకే ఆస్‌పాస్' కథల సంపుటి కథన కౌశలానికి గీటురాయి. మరొక మహాకావ్యం 'వాజశ్రవాకే బహనే' లో నారాయణ్ సమ్యక్ జీవనం గురించి విస్పష్టంగా వెల్లడించారు. ఆయన చాలా గ్రంథాలు అనువదించారు. సంకలనాలు ప్రచురించారు. 'సాహిత్యకే కుచ్ అంతర్ విషయక్ సందర్భ్' లో అనేక సాహిత్యాంశాలను చర్చించారు.

ఆయన ప్రేమ్‌చంద్, తులసి, కుమరన్‌ఆసాన్, వ్యాస్ సమ్మాన్, హిందీ సంస్థాన్, భవాన్ ప్రసాద్‌మిశ్రా, లోహియా, కబీర్ సమ్మాన్, హిందూస్థాన్ అకాడమీ, పూణె పండిత్ ఇత్యాది పురస్కారాలు అందుకున్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. ఇటలీ దేశం ఆయనను 'ప్రీమియొ ఫెరొనియా' గౌరవంతో, భారత ప్రభుత్వం 'పద్మభూషణ్' పురస్కారంతో సత్కరించాయి.

యాభై సంవత్సరాలకుపైగా లక్నోలో గడిపిన కున్వర్ నారాయణ్ ప్రస్తుతం తన నివాసాన్ని ఢిల్లీకి మార్చారు. ఆయన తన సాహిత్య వ్యాసంగాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు.

**- గోవిందరాజు రామకృష్ణారావు**

- అగాథా క్రిస్టీ

# సాక్ష్యం

అనువాదం : ముక్తవరం పార్థసారథి

**డిటెక్టివ్ కథల్లో కొసమెరుపుంటుందని పాఠకులు ముందే ఊహిస్తారు. అలా ఊహించినవాళ్ళను మరోసారి సర్‌ప్రైజ్ చేస్తుంది దీని ముగింపు. అగాథా క్రిస్టీ రాసిన డిటెక్టివ్ కథలన్నింటిలోకీ అత్యంత ఆశ్చర్యకరమైన ముగింపు ఇదే అనేవాళ్ళూ ఉన్నారు. ఈ కథ నాటకంగా, సినిమాగా కూడా పెద్ద ఇంటర్నేషనల్ హిట్. ఈ ముగింపును ముందే ఊహించగలిగిన పాఠకులకి డిటెక్టివ్ కథ మర్మం తెలిసినట్టే.**

కళ్ళద్దాలు తీసి, తుడిచి, మళ్ళీ పెట్టుకుని చిన్నగా దగ్గాడు డిఫెన్స్ లాయర్. ఆయన పేరు మేహెర్న్. ఈ కేసులోంచి బతికి బయటపడతానని ఆశలేని క్లయింట్ తలవంచుకుని నిల్చున్నాడు. ఉద్దేశపూర్వకంగా హత్య చేసినట్టుగా అతని మీద అభియోగం మోపబడింది.

లాయర్‌గా మేహెర్న్‌కు మంచి పేరే ఉంది. ముద్దాయిపట్ల ఎక్కువ సానుభూతి ప్రదర్శించకూడదని కూడా తెలుసతనికి..

"ఇది చాలా సీరియస్ కేసు. ఏమీ దాచుకోకుండా జరిగిందంతా చెబితే తప్ప నేను సాయం చెయ్యలేను"

"అవునండీ! నా కర్మ ఇలా కాలింది. నా మీద హత్యా నేరం మోపారంటే నమ్మలేక పోతున్నాను. హత్యా! నేను చెయ్యటమే! పైగా పిరికిపందలా చంపటం!" అంటూ దిగులుగా నిట్టూర్చాడు లెనార్డ్.

"చూడండి మిస్టర్ లెనార్డ్, మిమ్మల్నీ కేసు నుండి తప్పించటానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను. మనం గెలుస్తామని నాకు నమ్మకం ఉంది. కాని జరిగింది జరిగినట్లు చెప్పాలి. డిఫెన్సు ఆర్గ్యుమెంట్ బలంగా ఉండాలంటే ప్రతి చిన్న విషయమూ ముఖ్యమే"

లెనార్డ్ యువకుడు. ఒక వైపు నోరు తెరుచుకుని కబళించబోతున్న మృత్యువు! మరోవైపు పేరు ప్రఖ్యాతులున్న డిఫెన్సు లాయర్! అయినా అతనికి నమ్మకం కుదరటంలేదు.

ముద్దాయి నేరం చెయ్యలేదని నిరూపించడం ఇంచుమించు అసాధ్యమని లాయర్‌కూ తెలుసు. క్లయింటుకు భరోసా ఇచ్చాడు గాని లోపల అనుమానం తొలుస్తూనే ఉంది.

"లాయర్‌గారూ! నేను నేరం చేశానని మీకేమైనా అనుమానముందా? ఏ ఒట్టేసుకోమంటే ఆ ఒట్టేసుకుని చెబుతాను. నేను హత్య చెయ్యలేదండీ. ఎవరో నన్ను ఈ కేసులో ఇరికించారు. వలలో చిక్కుకున్నానని తెలుసు. బయటపడటం కష్టమనీ తెలుసు. కానీ నా మాట నమ్మండి. నేను

అమాయకుణ్ణి"

ఏ ముద్దాయీ నేరం అంగీకరించడని డిఫెన్సు లాయర్‌కు తెలుసు. అయినా ఎందుకో లెనార్డ్ హత్య చేసి ఉండకపోవచ్చనిపించింది.

"మీ మాట నమ్ముతాను. అంతమాత్రానా కేసు బలహీనంగా ఉందనుకోకండి. అన్ని సాక్ష్యాలూ మీకు వ్యతిరేకంగానే ఉన్నాయి. ఇక అసలు విషయానికొద్దాం. ఎమిలీతో మీకు పరిచయమెలా అయ్యిందసలు? "

"ఒకనాడు ఓ ముసలావిడ ఏవో పార్శిళ్లు పట్టుకుని రోడ్డు దాటుతున్నప్పుడు, చేయి జారి అవి కిందపడ్డాయి. అంతలో ఒక బస్సు అటుగా వచ్చింది. ఆమె దాని కింద పడేదే కానీ తృటిలో తప్పించుకుని ఫుట్‌పాత్‌మీదకి గెంతింది. చూసుకోకుండా నడిచినందుకు అందరూ ఆమెనే తిట్టారు. నేను కిందపడిన పార్శిళ్లు తీసి వాటిమీది మట్టి తుడిచి ఆమెకందించాను"

"అంటే, ఆమె ప్రాణం రక్షించటానికి ప్రయత్నించలేదన్నమాట? "

"ఆ పరిస్థితిలో అందరూ చేసే పనే నేనూ చేశాను. ఆమె నాకు థాంక్స్ చెప్పింది. ఈ కాలం కుర్రాళ్లలాకాక, పెద్దవాళ్ళంటే గౌరవం చూపినందుకు సంతోషించింది. ఆమె మాటలు సరిగ్గా జ్ఞాపకం లేవు. నేను 'నో మెన్షన్' అని వెళ్లిపోయాను. ఆమెను మళ్లీ చూస్తాననుకోలేదు. అన్నీ అనుకోని సంఘటనలే జరుగుతుంటాయి. ఆ సాయంత్రమే ఒక ఫ్రెండు ఇంట్లో పార్టీకి వెళ్లినప్పుడు మళ్లీ కనిపించింది. ఆమె పేరు ఎమిలీ అని తెలిసింది. క్రిక్‌ల్‌వుడ్‌లో ఉందట వాళ్ల ఇల్లు. కాసేపు ఇద్దరం మాట్లాడుకున్నాం. ఆమెకు ఎందుకు ఎవరి మీద కోపమొస్తుందో, ఎవరి మీద ఇష్టం కలుగుతుందో చెప్పటం కష్టం. నేను చేసిన ఒక చిన్న సహాయానికి, నా మీద అభిమానం పెంచుకుంది. ఒకసారి వాళ్లింటికి తప్పక రావాలని పదే పదే అడిగింది. కాదనలేక తలూపాను. ఎప్పుడొస్తానో కచ్చితంగా చెప్పమంది. నాకు నిజంగా వెళ్లాలనిలేదు. కాని ఆమె కోరికను నిరాకరించటం అమర్యాద. మరుసటి శనివారం తప్పక వస్తానని వాగ్దానం చేశాను. ఆ తర్వాత తెలిసింది, ముసలావిడ చాలా సంపన్నురాలనీ, తలతిక్కమనిషనీ, ఎనిమిది పిల్లుల్ని పెంచుకుంటూ వుందనీ"

"ఓహో! ఆవిడ దగ్గర బాగా డబ్బుందని అప్పుడే తెలిసిందన్నమాట" అంటూ తన క్లయింట్ కళ్ళలోకి సూటిగా చూశాడు మేహెర్న్.

"ఆవిడ గురించి నేనేమీ ప్రత్యేకంగా వాకబు చెయ్యలేదు..."

"పబ్లిక్ ప్రాసిక్యూటర్ నిన్ను ఎలా క్రాస్ ఎగ్జామిన్ చేస్తాడో ఊహించి ఆ ప్రశ్నలడుగుతున్నాను.. ఎందుకంటే ఆవిడ వాలకం చూసిన ఎవర్నికైనా ఆవిడ పేదరాలనే అనిపిస్తుంది. ఇంతకూ ఆవిడ దగ్గర డబ్బుందని మీకెవరు చెప్పారు? "

"మా ఫ్రెండ్ జార్జి ఇంట్లో జరిగింది పార్టీ. అతడే నాకీవిషయం చెప్పాడు"

"నీకలా ఉప్పందించిన విషయం అతడు గుర్తుంచుకునే అవకాశం ఉందా? "

"తెలియదు. పార్టీ జరిగి చాలా కాలమైంది గదా? "

"అవునవును. నువ్వు ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నావని నిరూపించటానికి ప్రయత్నిస్తాడు ప్రాసిక్యూటర్. నీకు నిజంగా డబ్బు సమస్యలున్నాయా? లేవా? "

అవమానంతో లెనార్డ్ మొహం ఎర్రబడింది.

"అవును. దురదృష్టం నన్ను వెంటాడుతున్నది. ఏం చెయ్యమంటారు? "

"గుడ్! ఈ ఒక్క విషయమైనా అంగీక

రించావు. అంటే, నీ సమస్యల నుండి గట్టె క్కటానికి ఆమెను పరిచయంచేసుకుని, వాళ్లింటికి వెళ్లి స్నేహం పెంచుకుని, ఒక ప్లాన్ ప్రకారం... ఏమంటావు? అంతేకాని కేవలం ఆమె ఆహ్వానించింది గనక, మర్యాదకోసం వెళ్లాను.. మరే ఉద్దేశం లేదంటావా? "

"ఆమె మాట కాదనలేక వెళ్లానన్నది వాస్తవం"

"మిమ్మల్ని నేను నమ్ముతాను. కాని ప్రత్యర్థి లాయరు నమ్మడుగా! మీ ఫ్రెండు జార్జి ఏం సాక్ష్యం చెబుతాడో మరి. ఆనాటి సంభాషణ అతడికి జ్ఞాపకం ఉంటుందంటారా? ప్రాసిక్యూటర్ అతణ్ణి కన్ఫ్యూజ్ చేసి తనకు కావలసిన సమాధానం రాబట్టుకోలేడంటావా? "

కాస్త ఆలోచించి "అలా జరిగే అవకాశం లేదు. అతడు నాకు చెప్పిన విషయం చాలా మంది విన్నారు. కాకతాళీయంగానైనా ఓ ధనవంతురాలితో పరిచయమైనందుకు ఇద్దరు, ముగ్గురు నన్ను ఆటపట్టించారు కూడా"

తన క్లయింట్ ధోరణి మేహెర్న్‌కు నిరాశ కలిగించింది. "ఉన్నదున్నట్టు చెబుతున్నందుకు సంతోషంగానే ఉందిగాని, కొన్ని ప్రశ్నలకు నాకు సమాధానాలు కావాలి. నా వాదనను గైడ్ చెయ్యాల్సింది మీరే. ఇంతకూ నాకో విషయం అర్థం కావటం లేదు. మీ వయస్సు ముప్పై మూడు. చూడటానికి బాగానే ఉంటారు. ఎ హాండ్సమ్ యంగ్‌మాన్. ఫన్ లవింగ్. ఫ్రెండ్సుతో పార్టీలకే మీకు టైం సరిపోదు. అలాంటి వ్యక్తి ఒక వృద్ధురాలితో స్నేహం చేసి, ఆమెను రెగ్యులర్‌గా కలిశాడంటే మీ ఇద్దరికీ కామన్ ఇంటరెస్టులు ఏమైనా న్నాయా? "

"తెలియదు. స్పష్టమైన సమాధానం చెప్పలేను. మొదటిసారి వెళ్ళినప్పుడే, ఆవిడ ఒంటరితనాన్ని భరించలేకపోతున్నాననీ, తరచుగా వచ్చిపోతుండమనీ ప్రాధేయపడింది. పెద్దావిడ అంతగా అడిగితే ఎలా కాదనగలను? ఆమె ఆపేక్షకు నేను కరిగిపోయాను. లాయర్‌గారూ! నాక్కొన్ని బలహీనతలున్నాయి. ఎవరైనా ఏదైనా అడిగితే నేను నిరాకరించలేను. నా చిన్నప్పుడే మా అమ్మ మరణించింది. పది హేనేళ్లప్పుడు నన్ను పెంచిన నా పిన్ని కూడా చనిపోయింది. ముసలావిడలో నాకు మా అమ్మ కనిపించింది. అదే ప్రేమ, అదే ముద్దు చెయ్యటం. ఇంక ఎక్కువ చెబితే మీరు నవ్వుతారు. ఆవిడకు నేనంటే ప్రాణం"

మేహెర్న్ నవ్వలేదు. కళ్లద్దాలు తీసి మరోసారి తుడుచుకున్నాడు.

"మీ వివరణ నాకు హేతుబద్ధంగానే కనిపిస్తున్నది. కాని కోర్టువారు దాన్ని అంగీకరిస్తారా? అన్నదే ప్రశ్న. కంటిన్యూ చెయ్యండి. ఆవిడ ఎప్పుడు మిమ్మల్ని తన వ్యాపార లావాదేవీలన్నీ చూడమని అడిగింది? "

"మూడోసారి వెళ్లినప్పుడు. డబ్బున్నదన్న మాటేగాని, ఆ వ్యవహారాలేవీ ఆవిడకు తెలియవు. అయితే, తన పెట్టుబడులలో నష్టం వస్తుందేమోనని ఎక్కువగా భయపడేది"

**కొత్తగాలి...**

**ముప్పది రోజుల**
**కాయకష్టం - జీతం**
**మూడు నిమిషాల్లో**
**ఖర్చు చేయడం - జీవితం**

– డి. చందూవంశీ,
కర్నూలు

"జాగ్రత్త! ఆలోచించుకుని మరీ చెప్పండి. ఇంట్లో ఉన్న పనిమనిషి, ఆమెకు వ్యాపారం బాగా తెలుసనీ, స్వయంగా అన్నీ చూసుకొనేదనీ వాంగ్మూలమిచ్చింది"

"నన్నేం చెయ్యమంటారు? ఎమిలీ నాతో చెప్పిందే నేను మీకు చెప్పాను"

మేహెర్న్ క్లయింట్‌ను పరికించి చూశాడు.

ఆ మాటపైకి చెప్పలేదుగాని, అతడు నేరం చేసి ఉండడని నమ్మకం కుదిరింది. కనీసం ఆ క్షణాన అలా అనిపించింది. వృద్ధ స్త్రీల మనస్తత్వం తనకు బాగానే తెలుసు. యువకుడు. అందగాడు. అతణ్ణి తరచూ రప్పించుకోవాలంటే ఇలాంటివేవో ఎరవేసే ఉంటుంది. వ్యాపార బాధ్యత తీసుకొమ్మంటే తప్ప రోజూ కనిపించడు మరి. పైగా వ్యాపార విషయాల్లో తను మూర్ఖురాలినని చెప్పడంవల్ల తనను రక్షించటానికి మరెవరూ లేరని గర్వంగా ఫీలవుతాడు. డబ్బు ఎవర్నైనా ఆకర్షిస్తుంది. దానిమీద నిర్ణయాధికారం తనదే అనుకున్నప్పుడు అతడు పొంగిపోడా? అతణ్ణి రప్పించుకోవాలంటే ఇలాంటి గాలం వెయ్యక తప్పదు. మేహెర్న్ ఇవన్నీ ఆలోచించాడుగాని వాటి గురించి కాక, "ఇంతకూ ఆమె కోరిక మన్నించి, వ్యాపార విషయాలు హాండిల్ చేశారా, లేదా? " అని అడిగాడు.

"చేశాను"

"మిస్టర్ లెనార్డ్! మిమ్మల్నో ముఖ్యమైన ప్రశ్న అడగదలచుకున్నాను. దాచుకోకుండా ఉన్నదున్నట్టు చెప్పాలి. కోర్టులో నా ఆర్గ్యుమెంట్ అంతా దీనిమీదే ఆధారపడి ఉంటుంది. మీరు ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నారు. మీ స్టేట్‌మెంట్ ప్రకారం వృద్ధురాలికి డబ్బు గురించి ఏమీ తెలియదు. ఆ సంపన్నురాలు తన వ్యాపార విషయాలు చూసి పెట్టమంది. ఆమె డబ్బును మీరెప్పుడూ స్వంత అవసరానికి వాడుకోలేదా? ఆ షేర్లు అమ్మినప్పుడో, కొన్నప్పుడో మీకంటూ ఎలాంటి లాభమూ కలగలేదని చెప్పగలరా? "

క్లయింట్ ఏదో చెప్పబోతుంటే చూపుడు వేలితో అతణ్ణి వారించి "ఒక్క నిమిషం ఆగండి. మనం రెండు రకాలుగా వాదించొచ్చు. ఒకటి ఆవిడ డబ్బంతా మీకే అప్పచెప్పింది గనుక, దానికోసం ఆవిడను హత్య చెయ్యవలసిన అవసరం మీకు లేదు. అయితే ప్రాసిక్యూషన్ మాత్రం మీరామె డబ్బుకాజేసి, నేరం కప్పిపుచ్చుకోవటానికి హత్య చేశారని ఆరోపిస్తుంది. వాళ్ళు ఈ విషయం నిరూపించే అవకాశమూ లేకపోలేదు. డబ్బు ఎలాగూ మీ చేతిలో పెట్టింది గనుక, మీరామెను హత్య చెయ్యవలసిన అగత్యం లేదని మనం కోర్టును నమ్మించగలగాలి. ఈ రెండు వాదనల మధ్య తేడా ఏమిటో మీకు అర్థమైందనుకుంటాను. ఇప్పుడు చెప్పండి" అన్నాడు మేహెర్న్.

ఒక్క క్షణమైనా ఆలోచించకుండా "ఆమె బిజినెస్ నేను సమర్థవంతంగా హాండిల్ చేసి ఆమెకు లాభాలార్జించి పెట్టాను. నా స్వార్థంకోసం ఏమాత్రం ఉపయోగించుకోలేదు. ఈ విషయంలో ఎవరు దర్యాప్తు చేసినా నాకభ్యంతరం లేదు" అన్నాడు లెనార్డ్ ఉద్వేగంగా.

"థాంక్యూ! ఇంత ముఖ్యమైన విషయం గురించి మీరు అబద్ధం చెప్పరని నాకు తెలుసు" అన్నాడు మేహెర్న్.

"నిస్సందేహంగా. నాకసలు ఆమెను హత్య చెయ్యవలసిన అవసరమే లేదు. డబ్బుకోసమే ఆమెతో స్నేహం నటించానని ఎవరైనా ఆరోపించినా, ఆమె మరణం వల్ల నష్టం నాకేగదా? నేనెందుకు చంపుతాను? "

"ఆమె తన వీలునామాలో మీకోసం

## నవ్వే బుద్ధుడి కథా కమామిషు...

చాలామంది లాఫింగ్ బుద్ధ విగ్రహాన్ని చూసే ఉంటారు. ఇంట్లోకి రాగానే కనబడేలా దాన్ని అలంకార వస్తువులా కూడా ఉంచుకుంటారు. ఈ విగ్రహం వెనక ఓ వ్యక్తి జీవిత చరిత్ర ఉంది. వెయ్యేళ్ల క్రితం చైనాలో హోటై అనే జెన్ మహాత్ముడు ఉండేవాడు. ఆయన సదా నవ్వుతూండేవాడు. ఆయన ఓ గ్రామం నుంచి ఇంకో గ్రామానికి వెళ్ళి నగర కూడలిలో నిలబడి నవ్వుతూండేవాడు. ఆయన రూపం అందరికీ నవ్వు పుట్టించేది. తల పైకెత్తి ఆకాశాన్ని చూస్తూ ఆయన పకపకా నవ్వుతుంటే, చుట్టూ చేరిన ప్రజలు కూడా నవ్వుని ఆపుకోలేకపోయేవారు. ఇలా ఆ గ్రామస్తులంతా కలిసి నవ్వేవారు. తర్వాత పిల్లలకి మిఠాయిలు, ఆటవస్తువులు పంచి పక్క గ్రామానికి వెళ్లేవాడు.



ఆయన జీవితకాలమంతా చేసింది ఇదే. ఈ సాధనతో ఆయన నిర్యాణాన్ని పొందాడని ప్రజలు నమ్ముతారు.

నవ్వినప్పుడు శరీరంలో ఉత్పత్తయ్యే ఎంజైమ్స్ వల్ల పెద్ద సమస్యలు కూడా చిన్నవిగా కనిపిస్తాయట. హోటైకి ప్రజలు 'నవ్వే బుద్ధుడు' అనే ముద్దుపేరు పెట్టారు. ఆయన మరణించాక ఆయన కోరిక ప్రకారం మృతదేహాన్ని చితి మీదకి చేర్చి అంటించగానే టపాకాయలు పేలి తారాజువ్వలు గాల్లోకి లేచాయి. తన మరణానికి ముందే హోటై వాటిని తన దుస్తుల్లో వాటిని దాచి, తన మరణానికి దుఃఖించే ప్రజలని ఆఖరిసారిగా అలా నవ్వించాడట.

చాలా డబ్బు వదిలివెళ్లింది. ఈ విషయం మీకు తెలుసా? లేదా? "

"ఏమిటీ? !" అంటూ అరచి ఎగిరి గంతేశాడు లెనార్డ్.

"నమ్మశక్యంగా లేదు. ఏం చెబుతున్నారు? నా పేర నిజంగా డబ్బు రాసిందా? " అడిగాడతడు.

అవునన్నట్టుగా తలాడిస్తూ, "వీలునామా సంగతి మీకు తెలియదా? తెలియనట్టు నటిస్తున్నారా? " ప్రశ్నించాడు మేహెర్న్.

"నటించటమా? నాకు నిజంగా ఆ సంగతి తెలియదు" అన్నాడు లెనార్డ్.

"ఆమె పనిమనిషి జానేట్ మీకీవిషయం తెలుసని చెప్పిందే? ఆమె ఈ విషయంలో మిమ్మల్ని సంప్రదించిందనీ, డబ్బు మీ పేర రాస్తున్నానని మీకు స్పష్టంగా చెప్పిందనీ స్టేట్‌మెంట్ ఇచ్చింది"

"ఆమె అబద్ధమాడుతోంది. జానేట్ కూడా వృద్ధురాలే. తన యజమానిని కంటికి రెప్పలాగ చూసుకునేది. అయితే ఆమెకు నేనంటే గిట్టదు. ఎమిలీ నన్ను ప్రేమగా చూసినందుకు జెలసీ కూడా ఉండొచ్చు. బహుశా ఎమిలీ వీలునామా సంగతి ఆమెతో చెప్పివుండవచ్చు లేదా నేను ఎమిలీని నాకు లాభం కలిగేటట్టుగా వీలునామా రాయమని ఒప్పించి ఉంటానని అనుకుని ఉండొచ్చు లేదా ఈ వీలునామా విషయం నాతో చర్చించిందని తననుతాను నమ్మించుకుని ఉండవచ్చు"

"వీలునామా విషయం మీకు తెలియదని అబద్ధమాడుతున్నందుకు కూడా ఆమె మిమ్మల్ని అసహ్యించుకునే అవకాశం లేదా? "

లెనార్డ్ షాకైనట్టుగా చూశాడు.

"అలా జరిగే అవకాశంలేదు. ఆమె నన్నెందుకసహ్యించుకుంటుంది? "

"ఏమో!? కానీ ఆమెకు మీరంటే అసహ్యం"

నిస్పృహాయంగా చూస్తూ, "వాళ్ళేం ఆరో పించబోతున్నారో అర్థమవుతోంది. మొదట విల్లు నాపేర రాయమని ఆమెను ఒప్పించాను. ఆ తర్వాత ఒక రాత్రి ఆమె ఇంటికెళ్లాను. ఇంట్లో ఎవరూ లేరు. తెల్లవారి ఆమె శవం కనిపించింది. అంతేనా? అంతేనా? " అంటూ ఆక్రోశించాడు లెనార్డ్.

"ఇంట్లో ఎవరూ లేరన్నది వాస్తవం కాదు. జానెట్ ఎక్కడికోవెళ్ళి, తొమ్మిదిన్నర ప్రాంతంలో తన బ్లౌజు డిజైన్ తీసుకుపోదామని ఇంటికి వచ్చి, వెనకద్వారం గుండా లోపలికి ప్రవేశించింది. అప్పుడు డ్రాయింగ్ రూంలో రెండు గొంతులు వినిపించాయి. ఒకటి ఎమిలీది, మరొకటి పురుషుడిది"

"తొమ్మిదిన్నర అన్నారు గదూ! హమ్మయ్య! నాకేం ప్రమాదం లేదు" అన్నాడు లెనార్డ్, ఇక తన మీద ఏ ఆరోపణా రుజువు కాదన్న ధీమాతో.

"ఏం మాట్లాడుతున్నావు? నాకేమీ అర్థం కావటం లేదు" అన్నాడు మేహెర్న్.

"రాత్రి తొమ్మిదిన్నరకు నేనింట్లో ఉన్నాను. మా ఆవిడే దానికి సాక్ష్యం. ఎనిమిది యాభై అయిదుకు ఎమిలీ ఇంటి నుండి బయల్దేరి తొమ్మిది ఇరవైకి ఇంటికి చేరుకున్నాను. నా భార్య నాకోసం వెయిట్ చేస్తున్నది. జానెట్ బ్లౌజ్ డిజైన్ నన్ను రక్షించింది" అంటూ ఉత్సాహంగా చెప్పుకుపోతున్న లెనార్డ్, మేహెర్న్ తన వైపు సీరియస్‌గా చూడటం గమనించలేదు.

"మీ ఉద్దేశంలో హంతకుడెవరు? " అని ప్రశ్నించాడు మేహెర్న్.

"దొంగతనానికి వచ్చిన వ్యక్తే ఆ పని చేసివుంటాడు. మొదట అలాగే అనుకున్నారు గదా? ఇనపకడ్డీతో తలమీదమోది చంపారు. ఇంట్లోంచి చాలా విలువైన వస్తువులు కూడా దొంగిలించారు. జానెట్ అనవసరంగా నా మీద అనుమానం సృష్టించి పోలీసులను తప్పుదోవ పట్టించింది"

"మిస్టర్ లెనార్డ్! మీరు చెప్పింది ఏమాత్రం నమ్మశక్యంగా లేదు. దొంగిలించిన వస్తువులు అంత ఖరీదైనవేమీ కాదు. పోలీసుల దృష్టిని మళ్లించటానికి హంతకుడు కొన్ని వస్తువులు తీసికెళ్లినట్టుగా ఉంది. తొమ్మిదిన్నరకు మీరు ఆ ఇంట్లో లేరంటున్నారు. మరి ఆ సమయంలో ఆమె ఎవరితో మాట్లాడింది? దొంగతో కబుర్లు చెబుతూ కూర్చుందని అంటారా? "

తికమకపడ్డట్టుగా నుదురు చిట్లించి "ఏమో? నాకలా అనిపిస్తుంది. మీరు అర్జెంటుగా నా భార్య రొమేన్‌తో మాట్లాడాలి"

"మిమ్మల్ని, పోలీసులు అరెస్టు చేసినప్పుడు ఆమె ఈ ఊళ్లో లేదు. నేను స్కాట్లండుకు సమాచారం పంపించాను. ఈ రాత్రికి ఆమె ఇక్కడికి చేరుకోవాలి. ఆమెనెట్లాగూ ప్రశ్నించక తప్పదు"

"హమ్మయ్య! రొమేన్ వచ్చిందంటే నా సమస్యలన్నీ తీరిపోతాయి"

"ఎక్స్‌క్యూజ్ మి, మిస్టర్ లెనార్డ్! మీకు మీ భార్యంటే చాలా ఇష్టమా? "

"ఆఫ్‌కోర్స్"

"ఆమెక్కూడా మీరంటే ఇష్టమా? "

"నేనంటే ఆమెకు ప్రాణం. నాకోసం ఏమైనా చేస్తుంది" అన్నాడు లెనార్డ్ ఉత్సాహంగా.

కాని మేహెర్న్ దిగులుగా చూశాడు. అలాంటి భార్య ఇచ్చిన స్టేట్‌మెంట్‌ను కోర్టు నమ్ముతుందా?

"తొమ్మిది ఇరవైకి మీరు ఇంటికి చేరుకోవటం ఇంకెవరైనా చూశారా? మీ ఇంట్లో పనిమనిషి వగైరా.. "

"మాకు పనిమనిషి లేదు"

"వస్తున్నప్పుడు వీధిలో ఎవరైనా కనిపించారా? "

"లేదు. కొంతదూరం నేను బస్సులో వచ్చాను. బస్సు కండక్టర్ నన్ను గుర్తుపట్టి ఉండవచ్చు"

లాభంలేనట్లు మేహెర్న్ అడ్డంగా తలూపాడు.

"మీ తరపున సాక్ష్యం చెప్పటానికి ఇంకెవరూ లేరంటారు? "

"లేరు. కాని అవసరమంటారా? "

"అవసరం లేకపోవచ్చుగాని, మరో విషయం చెప్పండి. ఆ ముసలావిడకు మీరు వివాహితులని తెలుసా? "

"ఓ యస్"

"మీరెప్పుడూ మీ భార్యను ముసలావిడకు పరిచయం చెయ్యలేదు. ఎందుకంటారు? "

లెనార్డ్ తడబడ్డాడు.

"తెలియదు"

"మీకు పెళ్ళికాలేదనే ముసలావిడ నమ్మిందని జానెట్ చెబుతున్నది. మిమ్మల్ని వివాహం చేసుకోవాలని కూడా అనుకున్నదట"

"నాన్సెన్స్! నాకూ, ఆవిడకూ నలభై ఏళ్ల తేడా" అంటూ పెద్దగా నవ్వాడు లెనార్డ్.

"ఓకే. మొత్తంమీద మీ భార్య, ఆవిణ్ణెప్పుడూ కలుసుకోలేదు. అంతేగదా? "

"నా ఉద్దేశం ఏమంటే..." అంటూ అడ్డుపడ్డాడు లెనార్డ్.

"మీరేం చెప్పదలచుకున్నారో నాకర్థం కావటం లేదు" అంటూ అసహనంగా చూశాడు మేహెర్న్.

"సరే, జరిగిందంతా చెబుతాను. ఏమీ దాచుకోను. నేను డబ్బు సమస్యల్లో ఉన్నాను. ఆవిడ నాకేమైనా చేబదులివ్వక పోతుందా? అని ఆశపడ్డాను. ఆమెకు నేనంటే ఇష్టమే. కానీ మా సమస్యలు ఆమెకు పట్టవు. మొదటినుండీ నా భార్య నానుండి వేరుగా ఉంటున్నదని అనుకుందామె. లాయర్‌గారూ! నాకు డబ్బెందుకు? నా భార్యను సుఖ పెట్టటానికే గదా? ఎలాగైనా సరే, డబ్బిస్తే చాలునని, నేను కూడా నా కుటుంబ విషయాలు ఆమెకు ఎక్కువగా చెప్పలేదు. ఆమె నన్ను పెంపుడు కొడుకులాగ చూసుకుంటానంది. మా ఇద్దరి మధ్య పెళ్లి ప్రస్తావనే రాలేదు. జానెట్ అనవసరంగా ఏవేవో ఊహించుకుంది"

"అంతేనంటారు? "

"సరిగ్గా అంతే"

అయితే మేహెర్న్‌కు తన క్లయింట్ మాటల్లో తొందరపాటు కనిపించింది.

**కొత్తగాలి...**

**జీవితం**
**చీకటి వెలుగుల**
**మధ్యన**
**చిందులాట**

– సుపాణీ,
గుంటూరు

కుర్చీలోంచి లేచి, లెనార్డ్‌తో కరచాలనం చేస్తూ, "మీకు వ్యతిరేకంగా అనేక బలమైన సాక్ష్యాలున్నప్పటికీ, మీరు అమాయకులనే నమ్ముతున్నాను. అదే విషయం కోర్టులో నిరూపించటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు.

లెనార్డ్, అప్పుడే కేసు గెలిచినంత సంతోషంతో "ఎలిబీ (నేరం జరిగినప్పుడు తను ఆ ప్రదేశంలోకాక వేరొకచోట ఉండటం) సరిపోయిందంటారా? " అనడిగాడు.

లాయర్ గంభీరంగా చూస్తూ "అంతా జానెట్ ఇచ్చే సాక్ష్యం మీద ఆధారపడి

ఉంటుంది. ఆమెకేమో మీరంటే అసహ్యం" అన్నాడు.

"నిష్కారణంగా ఆమె నామీద ద్వేషం పెంచుకుంది"

ఇంటర్వ్యూ ముగించిన మేహెర్న్, తను సేకరించిన సమాచారాన్ని విశ్లేషిస్తూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

★ ★ ★

లెనార్డ్ దంపతులు, పాడింగ్టన్‌లోని ఒక చిన్న ఇంట్లో ఉంటారు. అక్కడికి చేరుకుని కాలింగ్‌బెల్ నొక్కాడు మేహెర్న్.

బాగా లావుగా ఉన్న ఒక స్త్రీ, బహుశా పనిమనిషి కావచ్చు, తలుపు తీసింది.

"మిసెస్ లెనార్డ్ తిరిగి వచ్చిందా? "

"వచ్చి గంటసేపైంది. కాని ఆమె మిమ్మల్ని చూసే పరిస్థితిలో లేదేమో"

"ఇదామెకు చూపించండి" అంటూ తన విజిటింగ్‌కార్డ్ తీసిచ్చాడు మేహెర్న్.

అతడివైపు అనుమానంగా చూస్తూ, చేతులు తుడుచుకుని కార్డు తీసుకొని మొహంమీదే దభీమని తలుపులేసి, లోపలికెళ్లిందావిడ.

మేహెర్న్ ఏదో చెప్పబోయి మానేశాడు.

అంతలోనే తలుపు వారగా తెరుచుకుంది.

"లోపలికి రండి, ప్లీజ్" అంటూ ఒక స్త్రీ గొంతు వినిపించింది.

అది చాలా చిన్న డ్రాయింగ్ రూం. ఆమె పొడుగ్గా ఉందిగాని మొహం పాలిపోయింది.

"మీరు మా ఆయన లాయర్ కదా? ఆయనకోసం వచ్చారా? రండి, కూర్చోండి" అంది బలహీనంగా.

ఉచ్చారణను బట్టి ఆమె ఇంగ్లీష్ వనిత కాదని తెలిసింది. ప్రస్ఫుటంగా కనిపిస్తున్న ఆమె దవడ ఎముకలు, ఊదా రంగు వేసుకున్న నల్లజుత్తు, చేతులు ముడుచుకుంటూ, విప్పుతూ ఆమె మాట్లాడే పద్ధతి- ఎదుటివాళ్లకు ఆమె ఓ పట్టాన అర్థమయ్యే వ్యక్తికాదని అనుకున్నాడు మేహెర్న్.

"మేడం, మీరు దిగులు పడవలసిన అవసరంలేదు" అంటూ ఆమె ముఖ కవళికలను పరిశీలించాడు.

ఆమెలో దిగులు ఎంతమాత్రం లేదు. ప్రశాంతంగా, ఆత్మ స్థయిర్యంతో చూస్తున్నాయా కళ్ళు.

"కేసు రిజల్టు ఎలా ఉండబోతోందో వివరించండి.. నాకు ధైర్యం చెప్పవలసిన పని లేదు. ఏం జరిగినా నేను ఆశ్చర్యపడను"

లెనార్డ్‌తో తాను మాట్లాడిన విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు మేహెర్న్.

అంతా విని, ఆమె "అయితే తాను తొమ్మిది ఇరవైకి ఇంటికి వచ్చాడని నేను సాక్ష్యం చెప్పాలన్నమాట" అంది.

"ఆ సమయానికతడు రాలేదా? "

"అది ముఖ్యం కాదు. నేను అలా చెబితే అతనిమీద కేసు కొట్టేస్తారా? నా సాక్ష్యం వాళ్లు నమ్ముతారా? "

ఆమె అంత త్వరగా కేసులోని కీలక విషయాన్ని గ్రహించటం అతణ్ణి విస్మయానికి గురి చేసింది.

మేహెర్న్‌కు ఎలా స్పందించాలో అంతు పట్టలేదు.

"నాకు స్పష్టంగా చెప్పండి. నా సాక్ష్యం సరిపోతుందా? లేక నేను చెప్పినదాన్ని మరెవరైనా సమర్థించవలసిన అవసరముందా? "

ఆమె ప్రశ్నల పరంపర, అనుభవజ్ఞుడైన లాయర్ను కూడా తికమక పెట్టింది.

"ఇంత వరకూ మీ తరఫున సాక్ష్యమివ్వటానికి మరెవరూ ముందుకు రాలేదు" అన్నాడు.

ఒకటి రెండు నిమిషాలు ఏదో ఆలోచించి చిరునవ్వు నవ్వింది రొమేన్.

ఆమె సామాన్యురాలు కాదనిపించింది లాయర్‌కు.



"మేడం! మీ బాధ అర్థం చేసుకోగలను"

"అలాగా..."

"కాని ప్రస్తుత పరిస్థితుల్లో..."

"ఫరవాలేదులెండి. నేనే ఏదో ఒకటి చెయ్యాలిక..."

ఆమె మాటల్లోని ఆంతర్యం అతడికర్థం కాలేదు.

"మీరు బాధల్లో ఉన్నారు. భర్తే లోకంగా బతికే మీలాంటి గృహిణులు..."

"ఏమన్నారు? మరోసారి చెప్పండి!"

చురకత్తి ఝుళిపించినట్టుగా వినిపించాయా మాటలు.

తనను అతడర్థం చేసుకోలేడన్న ధీమాతో ఆమె వ్యంగ్యంగా నవ్వుతూ "అతడంటే నాకు ప్రాణమని చెప్పాడా? మగాళ్లెంత మూర్ఖులు..." అంటూ గబుక్కున కుర్చీలోంచి లేచింది.

తనను తాను కంట్రోల్ చేసుకుంటూ

"అతడంటే నాకసహ్యాం. ఐ హేట్ హిమ్. ఐ హేట్ హిమ్. ఆ నీచుడికి ఉరిశిక్ష పడాలి. అదే నా కోరిక..." అంది పళ్లు బిగపట్టి.

అగ్నిగోళాల్లా మారిన ఆమె కళ్ళు చూసి లాయరు కూడా భయపడ్డాడు.

ఒక్కొక్క అడుగే ముందుకేస్తూ, లాయర్‌ను సమీపించి, "ఆరోజు అతడు తొమ్మిది ఇరవైకి కాదు, పది ఇరవైకి వచ్చాడని చెబితే ఏమవుతుంది? ఆ వీలునామా వల్ల తను లాభపడతానని తెలియదని చెప్పాడా? అతడికా విషయాలన్నీ ముందర్నించీ తెలుసని నేను స్టేట్‌మెంట్ ఇస్తే? ఆ కారణంతోనే అతడు హత్య చేశాడని చెబితే? అతడు ఆ రోజు ఇంటికి రాగానే హత్య చేశానని నాతో చెప్పాడనీ, అతడి కోటుమీద నెత్తుటి మరకలున్నాయనీ కోర్టులో సాక్ష్యమిస్తే... ఏమవుతుంది? చెప్పండి!"

ఆమె లాయర్ను ఛాలెంజి చేస్తున్నట్టుగా, ధిక్కారంగా మాట్లాడింది. గొంతు తగ్గించి, ఆమెకేమైనా సలహా ఇవ్వాలన్నట్టుగా "భర్తకు వ్యతిరేకంగా మీరు సాక్ష్యమివ్వాలని మిమ్మల్ని ఎవరూ ఒత్తిడి చేయరు" అన్నాడు మేహెర్న్.

"అతడు నా భర్త కాడు"

ఎంత త్వరత్వరగా మాట్లాడుతున్నదంటే, ఆమె ఏమన్నదో అతడికర్థం కాలేదు.

"ఎక్స్యూజ్ మీ.."

"అతడు నా భర్త కాడు"

గదిలో ఎంతటి నిశ్శబ్దం ఆవరించిందంటే, గుండుసూది కింద పడినా శబ్దం వినిపించేదే.

"నేను వియెన్నాలో రంగస్థల నటిని. వివాహితనేగాని నా భర్త మెంటల్ హాస్పిటల్‌లో ఉన్నాడు. అందువల్ల మేమిరువురం (తనూ, లెనార్డ్) పెళ్లి చేసుకోలేకపోయాం. పెళ్లి జరగకపోవటమే మంచిదైందని ఇప్పుడనిపిస్తున్నది"

"ఓకే.. ఓకే మేడం. ఇంతకూ మీకు లెనార్డ్ అంటే అంత కోపమెందుకో అర్థం చేసుకోలేకపోతున్నాను" అన్నాడు లాయర్.

"కారణాలు తెలుసుకోవాలని మీకు మహా కోరికగా ఉంది. కాని నేను చెప్పదలచుకోలేదు. ఆ రహస్యం నా దగ్గరే ఉంటుంది"

చిన్నగా దగ్గి "ఈ సంభాషణను ఇక ముగించటం మంచిది. నా క్లయింట్‌తో మాట్లాడిన తర్వాత మళ్లీ మిమ్మల్ని సంప్రదిస్తాను" అన్నాడు లాయర్.

ఆమె అతడికి మరీ సమీపంగా వచ్చి "నిజాయితీగా చెప్పండి. అతడు అమాయకుడని మీరు నిజంగా నమ్ముతున్నారా?" అంటూ ప్రశ్నించింది.

"అవును, నమ్ముతున్నాను."

"మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది" అంటూ నవ్విందామె.

'ఈ కేసు మరెన్ని మలుపులు తిరుగుతుందో!' అనుకుంటూ వీధిలో నడక ప్రారంభించాడు మేహెర్న్.

మొదటి నుండీ అన్నీ వింతలే. అన్నింటికన్నా వింత రొమేన్! చాలా ప్రమాదకరమైన వ్యక్తిలా ఉంది.

ఇప్పుడేం చెయ్యాలి? కేసు తన క్లయింట్‌కు వ్యతిరేకంగా బలం పుంజుకుంటున్నది. అతడు చెప్పిందంతా నమ్మటమెందుకు? నేరం చేసే ఉంటాడు.

నో... లెనార్డ్ మీద నేరం ఆరోపించటంలో ఆమెకేదో ప్రయోజనమున్నది. ఇలాంటి స్త్రీలను నమ్మకూడదు. ఆమె తన సాక్ష్యం కోర్టులో వినిపించకుండా చూడటం సాధ్యపడుతుందా? ...

లాయర్‌లో ఒకరకమైన ఊగిసలాట ప్రారంభమైంది.

కోర్టులో విచారణ చకచకా కొనసాగింది.

ముఖ్యసాక్షులు జానేట్ (హతురాలి పని మనిషి), రొమేన్ (ముద్దాయి భార్య) తాము చెప్పవలసిందంతా చెప్పారు.

లాయర్, ఈ ఇద్దరు స్త్రీల వాంగ్మూలం నిశ్శబ్దంగా విన్నాడు. తనతో చెప్పిన విషయాలే రొమేన్ మరింత వివరంగా కోర్టు వారికి విన్నవించుకుంది. మేహెర్న్‌కు ఆశా రేఖ కనిపించలేదు. లెనార్డ్ ఈ ఉచ్చులోంచి బయటపడటం అసంభవం అనిపిస్తుంది. లాయర్ గొప్పవాడే. గొప్ప వాదనా పటిమగలవాడే. ప్రతిభావంతుడే. కాని తన ముద్దాయి కనుకూలంగా ఒక్కరూ సాక్ష్యం చెప్పటానికి ముందుకు రానప్పుడు, ఎవరైనా చెయ్యగలిగిందేమిటి?

రొమేన్ చెప్పింది తప్పని నిరూపించగలిగితే తప్ప తను కేసు నెగ్గలేడు. ప్రస్తుతం అతణ్ణి తీవ్రంగా కలచివేస్తున్న విషయమొక్కటే. లెనార్డ్ నిజం చెప్పాడని అంగీకరించిన పక్షంలో (అంటే తొమ్మిదింటికే హతురాలి ఇంటినుంచి బయల్దేరి ఉంటే) తొమ్మిదిన్నరకు ఆమె ఎవరితో మాట్లాడింది? ఆమె గతమంతా పరిశోధిస్తే ఒక చిన్న ఆశాకిరణం కనిపించింది. ఆమె మేనల్లుడొకడు, అప్పుడప్పుడూ వచ్చి కొన్నిసార్లు బతిమాలి, కొన్నిసార్లు బెదిరించి ఎంతో కొంత డబ్బు పట్టుకు పోయేవాడు. ఇంటి పనిమనిషి జానేట్‌కు ఈ కుర్రాడంటే ఇష్టం. ముఖ్యంగా ఇప్పుడు అతడు ఆచూకీ లేకుండా మాయమయ్యాడు గనక, ఆ రాత్రి వచ్చిన వ్యక్తి అతడే అయ్యే అవకాశముంది.

ఇదొక్కటి తప్ప, లెనార్డ్‌కు అనుకూలమైన ఆధారం ఒక్కటీ లభించలేదు. తొమ్మిది ఇరవైకి అతను ఇంట్లోకి ప్రవేశించినప్పుడు ఎవరూ చూడలేదు. అంతకన్నా ముందు, హతురాలి ఇంటినుండి బయటికి వచ్చినప్పుడు కూడా చూసినవాళ్లు లేరు...

★ ★ ★

కేసు విచారణకు ఒక రోజుముందే, మేహెర్న్‌కు ఒక ఉత్తరం వచ్చింది. అది చదివిన అతడి అలోచనలు కొత్త దిశలో కొనసాగాయి. సాయంత్రం ఆరింటికి తనకు చేరిన కవరు మురికిగా ఉంది. పోస్టల్ స్టాంపు వంకరగా అంటించారు. అక్షరాలు చదువురానివాళ్లు రాసినట్లుగా అడ్డదిడ్డంగా ఉన్నాయి. రెండు మూడు సార్లు చదివితేగాని, సారాంశం బోధపడ లేదు.

"డియర్ మిస్టర్!
నువ్వా కుర్రాడికి సాయం చెయ్యాలనుకుంటే, మొహానికి రంగు పులుముకున్న ఆ ఆడమనిషి ఆట కట్టించాలంటే ఈ రాత్రికి 'షాస్ రెంట్స్ స్టెప్నీ'కి రా. రెండువందల పౌండ్లు ఖర్చవుతుంది. మిస్ మాగ్సన్ అని అడుగు"

కింద సంతకం లేదు. నమ్మాలనిపించ లేదు. ఇలాంటి బోగస్ ఉత్తరాలు వస్తూనే ఉంటాయి. కాని ఆ దస్తూరి, కూడబలుక్కుని రాసినట్టుగా ఉన్నభాష- ఇది ప్రాక్టికల్ జోక్ కాదనిపించాయి. తన ముద్దాయిని రక్షించటానికి ముందున్న ఒకే ఒక ఆధారం... రొమేన్ చెప్పింది తప్పని నిరూ

## కొత్తగాలి...

**ఒక చినుకు**
**ప్రళయం**
**ఒక ఆలోచన**
**విలయం సృష్టిస్తాయి**

- ధవ్వూరి శ్రీధరాచార్యులు,
హైదరాబాద్

పించలేకపోయాడు. ఆమెకు మరొకరితో వివాహమైంది. పెళ్లి చేసుకోకుండానే లెనార్డ్‌తో కలిసి ఉంటున్నది. ఇలాంటి అనైతిక జీవితం గడుపుతున్న స్త్రీ మాటల్ని కోర్టు వారు నమ్మకూడదనే వాదన ఎంత బల హీనంగా ఉంటుందో ఎవర్కైనా తెలుసు.

తను షాస్‌రెంట్స్‌కు వెళ్లక తప్పదు. డిఫెన్స్ లాయర్‌గా క్లయింట్‌ను రక్షిం చటం తన ధర్మం.

షాస్‌రెంట్స్ ఒక మురికివాడ. ఇల్లు కనుక్కోవటానికి కూడా ఇబ్బందిపడ్డాడు. ఎప్పుడు కూలిపోతుందోననిపించే ఒక పాత బిల్డింగు మూడో అంతస్తులోని ఒక చిన్నగదిలో ఉంటుందావిడ. తలుపు త ట్టాడు. జవాబులేదు. మళ్లీ తట్టాడు. లోపల ఏవో సామాన్లు సర్దుతున్న శబ్ద మయింది. మరికాసేపటికి తలుపు కొద్దిగా తెరుచుకుంది. తల మాత్రం కనిపించింది.

“ఎవరూ? నువ్వా? వెంట ఎవరూ లేరుగదా? నాతో డబుల్‌గేమ్ ఆడొద్దు” అంటూ అటూ ఇటూ చూసి, “దా లోప లకి” అందావిడ.

లోపలికి ప్రవేశించాడు లాయరు. చాలా చిన్నగది. అసహ్యంగా ఉంది. ఒక గ్యాస్ లైటు వెలుగుతున్నది. మంచంమీద గుడ్డలు చిందరవందరగా, కుప్పలుగా పడి ఉన్నాయి. ఒక టేబుల్, కూర్చుంటే విరిగి పోతాయేమోననిపించే రెండు కుర్చీలు. ఆమె మధ్య వయస్కురాలు. కాస్త వంగింది. దువ్వుకోని జుత్తు. సగం మొహం స్కార్ఫ్‌తో కప్పుకుంది.

గదిని పరిశీలిస్తున్న లాయర్ని చూసి నవ్వి “నా అందమైన మొహం ఎందుకు కప్పుకున్నాననుకుంటున్నావా? నువ్వు నా మీద మనసుపారేసుకుంటే నాకు చిక్కులే గదా!” అంటూ పెద్దగా నవ్వి, స్కార్ఫ్ తొలగించింది మాగ్సన్.

ఆకారంలేని పెద్ద మాంసం ముద్దలాంటి ఎర్రటి మొహం చూసి ఒక క్షణం జడుసు కున్నాడు మేహెర్న్.

“అందంగా ఉన్నానా? ముద్దు పెట్టుకో వాలనిపిస్తోందా? అలా బెదిరిపోకు.. ఒక ప్పుడు నేనూ అందగత్తెనే. విట్రియోల్ (సల్ఫ్యూరిక్ ఆసిడ్)ను మొహం మీద పోశారు దుర్మార్గులు. నేను వాళ్లను వదిలి పెట్టను. దొంగలం...లు” అంటూ బూతు లు లంకించుకుంది. అవి వినలేక లాయరు చెవులు మూసుకున్నాడు. ఆ వాక్ప్రవాహాన్ని ఆపటానికి ప్రయత్నిం చాడు. కాని ఆమె తిట్టి, తిట్టి అలసిపోయి చాలా సేపటికి గాని శాంతించలేదు.

“నీ శాపనార్థాలు వినటానికి నేనిక్కడికి రాలేదు. ఏదో సమాచారం ఇస్తానన్నా వుగా.. దానివల్ల నా క్లయింట్‌కు లాభమై తేనే ఇక్కడుంటాను” అన్నాడు మేహెర్న్ కాస్త కోపంగా.

“డబ్బు! మొదట డబ్బు సంగతి తేల్చు. రెండు వందలు” అంటూ చేయి చాచింది మాగ్సన్.

“ఒక సిటిజన్‌గా సాక్ష్యమివ్వటం నీ బాధ్యత. కోర్టు నీకు సమన్లు పంపించ వచ్చు” అన్నాడు లాయర్.

“ఆ పప్పులు నా దగ్గర ఉడకవు. ముస ల్దాన్ని, చదువురానిదాన్ని, నాకేమీ తెలి యదు. అయితే రెండొందలు చేతిలో పడితే ఏమైనా జ్ఞాపకమొస్తుందేమో ప్రయ త్నిస్తాను”

“అదెంత కీలక సమాచారమో ముందు చెప్పు”

“ఆమె రాసిన ఉత్తరం నీకిచ్చాననుకో. అది నా చేతికి ఎలా వచ్చిందన్నది వేరే విషయం. ఈ కబుర్లన్నీ ఎందుకు? మొదట రెండొందలు.. ఆ తర్వాతే నేను నోరు విప్పుతాను”

ఇలాంటివాళ్లను ఎలా దారికి తెచ్చుకో వాలో లాయరుకు బాగానే తెలుసు.



"పది పౌండ్లిస్తాను. అంతకన్నా ఎక్కువ ఇచ్చేది లేదు. అది కూడా ఆమె రాసిన ఉత్తరమని తేల్చుకున్నాకే"

"పది పౌండ్లా? " అంటూ బిగ్గరగా అరిచింది. మీదపడి రక్కుతుందేమోననిపించింది.

"ఇరవై. చచ్చి గీపెట్టినా ఇంకా పెంచేది లేదు" అంటూ వెళ్లిపోవటానికన్నట్టు లేచి

తలుపువైపు నడిచాడు.

ఆశ నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ. దీనంగా, కోపంగా అతడి వైపు చూసింది మాగ్నస్.

లాయర్, జేబులోంచి ఒక పౌండు నోట్ల కట్టను తీసి, ఇరవై లెక్కపెట్టాడు.

"ఇదిగో, నా దగ్గరున్నది ఇంతే. నీ ఇష్టం ఇక" అంటూ తలుపువైపు మరో అడుగేశాడు.

పేదవాళ్లను డబ్బు ఎలా ఆకర్షిస్తుందో అతడికి తెలియందికాదు. ఈసారి ఆమె తనను తాను తిట్టుకుంది. తన అదృష్టం ఇలా తగలబడ్డందుకు నొసలు కొట్టు కుంది. కాని అతడి చేతుల్లో కనిపిస్తున్న డబ్బును కాదనలేకపోయింది. మంచం దగ్గిరకెళ్లి, పరుపు కింది నుండి ఒక ఉత్తరాల కట్టతీసి "నాకెక్కడ దాపురించావురా నాయనా! రెండొందలడిగితే ఇరవై ఇస్తున్నావు. అందరూ నన్ను దగా చేసే వాళ్లే" అంటూ అతడి వైపు విసిరేసింది.

మేహెర్న్ ప్రశాంతంగా, ఒక్కొక్క ఉత్తరాన్నే చదివాడు. అతడు దేనికోసం వెదుకు తున్నాడో ఆమెకర్థం కాలేదు. అవి రొమేన్ రాసిన ప్రేమలేఖలు. అయితే అందులోని ప్రేమికుడు లెనార్డ్ కాదు. అతడు అరెస్టు అయిన రోజున రాసిన లేఖ కూడా ఉంది.

అవి కోటు జేబులో పెట్టుకుని "నీకెలా దొరికాయి ఇవి?" అని అడిగాడు.

"మరో విషయం కూడా చెబుతాను. కోర్టులో అది (రొమేన్) చెప్పింది విన్నాను. ఆ రాత్రి అది పది గంటల పది నిమిషాలకెక్కడుందో అడుగు. లయన్ రోడ్ సినిమా హాలువద్ద దాని గురించి వాకబు చెయ్యి. అలాంటి పతివ్రత ఆ సమయంలో అక్కడేం చేస్తోందో!"

"ఈ ఉత్తరాలన్నీ ఆమె ఎవరికి రాసింది?"

ఆమె స్వరం కటువుగా మారింది. చేతులు వణికాయి. కోపం కంట్రోల్ చేసుకోలేకపోతున్నది.

"నా మొహం మీద విట్రియోల్ పోసిన వాడే దాని ప్రియుడు. అనేక సంవత్సరాల క్రితం, అది, నా ప్రియుణ్ణి నా నుంచి లాక్కుంది. ఎందుకు మోసం చేశావని నా ప్రియుణ్ణి నిలదీశాను. ఇదిగో.. ఇదీ ఫలితం! మొహం మీద ఆసిడ్ పోశాడు. కాలిన నా మొహం చూసి అది నవ్వింది. నీచురాలు! నాలో పగ రగిలింది. అదెక్కడికి వెళితే అక్కడికి దాన్ని వెంబడించాను. దాని రహస్యాలన్నీ తెలుసుకున్నాను. ఇప్పుడు అది నా చేతికి చిక్కింది. ఇంక దాన్ని వదిలిపెట్టే ప్రసక్తిలేదు. నా ఉసురు పోసుకున్నందుకు అది శిక్ష అనుభవించాల్సిందే. లాయరూ, నువ్వు దానికి ఎంత శిక్ష వేయిస్తావు?" అంటూ దీనంగా అడిగింది మాగ్నస్.

"దొంగ సాక్ష్యం చెప్పినందుకు ఎంతో కొంత శిక్ష పడకపోదు" అన్నాడు మేహెర్న్.

"మొత్తం మీద జైలుకెడుతుంది గదా! అదే నాక్కావలిసింది" అంటూ, వెళ్లిపోతున్న అతణ్ణి ప్రాధేయపడుతున్నట్టుగా, "డబ్బిస్తానన్నావు. అదికూడా ఇవ్వవా?" అంది.

నోట్లు టేబుల్ మీద పెట్టి ఏదో గుర్తుకు వచ్చినట్టు గబగబా నడిచివెళ్లాడు మేహెర్న్.

లయన్ రోడ్ సినిమా వద్ద రద్దీగా ఉంది. ఒక పోలీసు కానిస్టేబుల్, లాయర్ చూపిన రొమేన్ ఫొటోను గుర్తుపట్టాడు. ఆ రోజామె రాత్రి పదిదాటిన తర్వాత ఒక వ్యక్తితో కలిసి అక్కడికి వచ్చింది. అతణ్ణి గుర్తుపట్టలేక పోవచ్చేమోగాని, ఆమె సినిమా గురించి అడిగింది. తర్వాత సినిమా చూసి వెళ్లింది.

అర్థమైంది. రొమేన్ ఒక అబద్ధాల

పుట్ట. ఆమె సాక్ష్యాన్ని చీల్చి చెండాడొచ్చు. ద్వేషంతో పగ తీర్చుకోవటానికే ఆమె బోనులో నిల్చున్నది. అయితే ఆమె ద్వేషానికి కారణమేమిటి? ఎప్పటికైనా ఆ రహస్యం తెలుస్తుందా? లెనార్డ్ ఆమెకేం ద్రోహం చేశాడు? కాకతాళీయంగా లాయర్‌కు కొన్ని విషయాలు చెవినబడ్డాయి. అయితే అవి నమ్మశక్యంగా లేవు. వాస్తవం తెలుసుకోవాలి.

క్షణం ఆలస్యమైనా సాక్ష్యాలు తారుమారయ్యే అవకాశం ఉంది. అర్ధరాత్రి కావస్తున్నది. హుటాహుటిన టాక్సీలో బయల్దేరాడు మేహెర్న్.

★ ★ ★

ఎమిలీ హత్య విచారణ జనం దృష్టిని బాగా ఆకర్షించింది. లెనార్డ్ ప్రధాన నిందితుడు. అతడు యువకుడు, అందగాడు కావటం కూడా ఒక కారణం. అటువంటి సంస్కారవంతుడు ఎందుకింత నీచానికొడిగట్టాడు? రొమేన్ ప్రధాన సాక్షి. ఆమె ఫొటోలూ, ఆమె గురించిన కథనాలూ పలు పత్రికలలో ప్రచురించారు. సహజంగానే అనేక విషయాలు కల్పించి రాశారు.

విచారణ తొలిదశ ఏమంత అసక్తికరంగా లేదు. సాంకేతిక పరమైన సాక్ష్యాలను ప్రవేశపెట్టారు. పోలీసుల ముందు చెప్పిన విషయమే మళ్లీ చెప్పింది జానేట్. డిఫెన్సు లాయర్ (మేహెర్న్), లెనార్డ్‌కూ, హతురాలికీ ఉన్న సంబంధం గురించి ఆమె వాంగ్మూలంలోని వైరుధ్యాలను క్రాస్ ఎగ్జామినేషన్ సమయంలో ఎత్తిచూపాడు. హత్య జరిగిన రాత్రి సిట్టింగ్ రూంలో ఆమె ఒక పురుషుడి గొంతు వినటం నిజమే అయినప్పటికీ, అది లెనార్డ్ గొంతేననటానికి ఆధారాలు లేవు. ముద్దాయి పట్ల ఉన్న ద్వేషం వలనే జానేట్ ఇలా అపోహ పడిందని వాదించాడు.

తరువాతి సాక్షిని కోర్టులో ప్రవేశపెట్టారు.

"మీ పేరు రొమేన్ గదా? "

"అవును"

"మీరు ఆస్ట్రియా దేశస్థులు? "

"అవును"

"మూడేళ్లుగా మీరు ముద్దాయితో కలసి ఉంటూ అతని భార్యనని చెప్పుకున్నారు? "

ఆమె, దూరంగా నిల్చున్న లెనార్డ్‌వైపు భావగర్భితంగా చూసింది. కళ్లతో ఏదో మాట్లాడుకున్నట్టే ఉంది.

"అవును"

ప్రశ్నల పరంపర కొనసాగింది. వాస్తవాలు ఒక్కొక్కటే తెలిసి వచ్చాయి. ఆ రాత్రి ముద్దాయి తన వెంట ఇనప కడ్డీ తీసుకుని వెళ్లాడు. పదిగంటల ఇరవై నిమిషాలకు ఇంటికి తిరిగి వచ్చాడు. ఆమెను హత్య చేశానని, తనతో (రొమేన్‌తో) చెప్పాడు. అతడి షర్టు ముంజేతికి నెత్తురు మరకలుండటం తను చూసింది. తరువాత ఆ గుడ్డల్ని అతడు వంటింటి స్టవ్‌లోవేసి కాల్చేశాడు. అతడు తనను బెదిరించి, నోరు విప్పకుండా కట్టడి చేశాడు.

మొదట, కొద్దిగానైనా ముద్దాయిపట్ల సానుభూతిగా ఉన్న కోర్టు, రొమేన్ వాంగ్మూలంతో పూర్తి విరుద్ధంగా మారింది. లెనార్డ్, తలవంచుకుని ఇక

### కొత్తగాలి...

**మనసును మీటితే**
**ప్రేమ గీతం**
**మనసును చిదిమితే**
**విషాద గీతం**

– కాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

తనకు మరణ శిక్ష తప్పదని దిగులుగా నిల్చున్నాడు.

డిఫెన్సు లాయర్, రొమేన్ వాంగ్మూలం అంతా కట్టుకథ అని ఆర్గ్యూ చేశాడు. ఆ రాత్రి, ఆమె స్వయంగా, ఇంటి వద్ద లేదు. ఆమె మరొక వ్యక్తిని ప్రేమిస్తున్నందువల్ల, లెనార్డ్‌ను జైలుకు పంపటానికి ప్రయత్నిస్తున్నది. చెయ్యని నేరానికి అతడెందుకు శిక్ష అనుభవించాలి? "

డిఫెన్సు వాదన తప్పుల తడక అంది రొమేన్.

అప్పుడు, ఆమె రాసిన ప్రేమలేఖను చదివి కోర్టువారికి సమర్పించాడు మేహెర్న్. అందులో-

"మై డియర్ మాక్స్!

మనకు అదృష్టం కలిసి వచ్చింది. హత్యా నేరం మీద అతణ్ణి అరెస్టు చేశారు. అవును, ఒక వృద్ధ మహిళను కొట్టి చంపినందుకు. చీమకుట్టినా అపకారం తలపెట్టని లెనార్డ్ కటకటాల వెనుక ఉన్నాడు. పగ తీర్చుకునే సమయం వచ్చింది. హత్య జరిగిన రాత్రి నెత్తుటి మరకలతో ఇంటికి వచ్చాడనీ, నాతో నేరం అంగీకరించాడనీ చెబుతాను. అతడు ఉరికంబం ఎక్కక తప్పదు. రొమేన్ తనకు ఉరి బిగించిందని అతడు తెలుసుకోవాలి. అతడి పీడా విరగడైంది. ఇక మనం హ్యాపీగా, జాలీగా జల్సాలు చేసుకుందాం"

హాండ్‌రైటింగ్ నిపుణులు, ఆ దస్తూరి రొమేన్‌దేనని నిర్ధారించారు. నిజానికా అవసరం లేదు.

లాయర్ మేహెర్న్ ఆ ఉత్తరం చదవగానే, వెక్కివెక్కి ఏడుస్తూ రొమేన్ తన నేరాన్ని అంగీకరించింది. లెనార్డ్ ఆ రోజు తొమ్మిది ఇరవైకే ఇంటికొచ్చాడు. అతడి జీవితం నాశనం చెయ్యటానికి తనే కొత్త కథ అల్లింది.

రొమేన్ కన్‌ఫెషన్‌తో, లెనార్డ్ మీద

మోపిన నేరం వీగిపోయినట్టే. పబ్లిక్ ప్రాసిక్యూటర్ మరికొందరు సాక్షులను రొటీన్‌గా క్రాస్ ఎగ్జామినేషన్ చేశాడు. సంప్రదింపుల తర్వాత 'లెనార్డ్ నాట్ గిల్టీ' అని తీర్పుచెప్పింది కోర్టు.

హమ్మయ్య, గండం గడిచింది. లెనార్డ్‌కు స్వేచ్ఛ లభించింది. డిఫెన్సు లాయర్, తన క్లయింట్‌ను అభినందించాలి. మేహెర్న్, కళ్లద్దాలు తుడుచుకున్నాడు. అదో దురలవాటు. తమకు కొన్ని అలవాట్లున్న విషయం గుర్తించకపోవటమే వ్యక్తుల బలహీనత. తరచూ కళ్లద్దాలు తుడుచుకోవటం గురించి, మేహెర్న్‌ను ఆయన భార్య ఎన్నోసార్లు వారించింది.

రొమేన్‌లో వచ్చిన మార్పును చూసి మేహెర్న్ అవాక్కయ్యాడు. ఇంట్లో, ఆమె అణిగి మణిగి, బలహీనంగా, దీనంగా కనిపించింది. కోర్టులో చిరుతపులిలా విజృంభించింది. కాస్త వంగిన శరీరం, మాట్లాడినంతసేపూ పిడికిళ్లు బిగించి, తెరిచి, మళ్లీ మూసుకోవటం. అవును అలవాట్లు మార్చుకోవటం ఎవరితరమూ కాదు. మరొకటి కూడా, అలా పిడికిళ్లు బిగించడం, తెరుచుకోవటం తను ఎక్కడో చూశాడే? మేహెర్న్ ఆలోచనలో పడ్డాడు. అవును, ఇటీవలే చుశాడు. ఎవరది? ఎవరా వ్యక్తి?

అవును. ఆవిడే షాస్‌రెంట్స్‌లో ఉంటున్న మాగ్నస్, తల తిరిగింది. గాడ్! ఎలా తనను బురిడీ కొట్టించింది. అవును. రొమేన్ రంగస్థల నటి అని తాను మరచిపోయాడు!

"మీ క్లయింట్‌ను కంగ్రాట్స్ చెయ్యరా? చావుతప్పి కన్ను లొట్టపోయింది. పాపం, లెనార్డ్" అంటూ మేహెర్న్ భుజం తట్టాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్

కాని మేహెర్న్ మరో విషయం గురించి బుర్ర బద్దలు చేసుకుంటున్నాడు.

రొమేన్‌ను ఒకసారి చూడాలి. అయితే ఆ అవకాశం అంత త్వరగా రాలేదు.

మేహెర్న్ ఆమెను ఎప్పుడు, ఎక్కడ కలిశాడన్నది అప్రస్తుతం.

"అయితే, మీరూహించారన్న మాట" అంటూ ప్రారంభించింది, అతడి ప్రశ్నలకు జవాబుగా ఆమె.

"గ్యాస్‌లైట్ వెలుగులో నేను మేకప్ చేసుకున్న విషయం మీరు గుర్తించలేదా? "

"కాని ఎందుకు చేశావిలా? కారణం కావాలి"

"సింపుల్! నేనతణ్ణి రక్షించక తప్పదు. అతణ్ణి ప్రేమించే భార్యగా, నా వాంగ్మూలాన్ని కోర్టు అంగీకరించదు. ఆ విషయం మీరే చెప్పారు. నేను నటిని. ప్రేక్షకుల మనస్తత్వం నాకు బాగా తెలుసు. సాక్ష్యం నాకై నేను చెప్పకూడదు. అతడి డిఫెన్సు లాయరుగా మీరు దాన్ని నానుండి రాబట్టాలి. అప్పుడే నా మాటల్ని కోర్టు నమ్ముతుంది. నేను చెప్పింది అబద్ధమని తేలటం వల్లనే గదా లెనార్డ్‌పట్ల కోర్టుకు సానుభూతి పెరిగింది"

"మరి ఆ ఉత్తరాల కట్ట? "

"ప్రేమికులు ఒకే ఒక ఉత్తరం రాసుకున్నారంటే ఎవరూ నమ్మరు. అందుకే ఓ కట్ట తయారు చేశాను"

"మాక్స్ ఎవరు? "

"అతడు నా కల్పన"

"కాని, ఇంత డ్రామా లేకపోయినా అతణ్ణి సులభంగానే రక్షించేవాణ్ణి"

"కాని నేను రిస్కు తీసుకోదలచలేదు. అతడు అమాయకుడని మీరు నమ్మారు. ఆ విషయం నాతో కూడా చెప్పారు"

"అవును, ఆ విషయం నీకూ తెలుసు"

"మిస్టర్ మేహెర్న్! నేనిదంతా ఎందుకు చేశానో ఇప్పటికైనా అర్థమైందా? హత్యచేసింది అతడే"

అన్ని సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కె.వి. దుర్గామోహనరావు**
ప్లాట్ నెం. 18/19, స్ట్రీట్ నెం.6,
ద్వారకామయినగర్,
వనస్థలిపురం, హైదరాబాద్-70

## చతురంగం - 17 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ద | శా | 2 వ | 3 తా | రం | | 4 ప్ర | తం | | 5 హం |
| శ | | 6 ర | వి | | 7 ర | ణం | | 8 వ | స |
| 9 ప | ల్ల | వి | | 10 వీ | సా | | 11 క | ల | |
| తి | | 12 క్ర | మం | | 13 య | 14 ము | డు | | 15 గా |
| | 16 కా | యం | | 17 కా | నం | న | | 18 రా | జు |
| 19 ద | ళం | | 20 కా | రా | | 21 గ | 22 జ | ము | |
| లై | | 23 ప | డి | గా | పు | | యం | | 24 ల |
| 25 లా | 26 వా | | 27 వ | ర | | 28 ఉ | ప | ద్ర | వం |
| 29 మా | న | వా | | 30 ము | 31 త్తు | | రా | | గ |
| | రం | | 32 దే | న | మ | శం | | 33 పా | ము |

### సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎస్.ఎస్. పిళ్ళై, తిరుపతి, 2. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 3. ఎన్. సాయికృష్ణప్రసాద్, ఎల్.బి. నగర్, 4. కటకం శ్రీధర్, రచ్చపల్లి, కరీంనగర్ జిల్లా, 5. గుండిమెడ శ్రీదేవి, మోతెర, అహ్మదాబాద్, 6. అనిత, అనంతపురం, 7. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 8. క్రోవి లలితావాణి, సికింద్రాబాద్, 9. ఇందన మల్లిఖార్జున్‌రావు, ఏలూరు, 10. కె. స్వరలయ, చీరాల, 11. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 12. పి. సూర్యకిరణ్, కొత్తపేట, హైదరాబాద్, 13. బందా శివనారాయణ శ్రీనివాసరావు, చందానగర్, 14. గేదెల రామారావు, ఏలూరు, 15. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 16. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 17. అడపా ధనలక్ష్మి, పర్లాకిమిడి, ఒడిశా, 18. పచ్చిగోళ్ల పూర్ణచంద్రరావు, రాయకుదురు, ప.గో.జిల్లా, 19. కె. రాజేశ్వరి, సికింద్రాబాద్, 20. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 21. ఎం. విజయలక్ష్మి, కొత్తగూడెం, 22. డా.సి. జనార్ధనసింగ్, కాచిగూడ, 23. ఆదూరి పద్మావతి, హైదరాబాద్, 24. యల్లాప్రగడ కృష్ణమూర్తి, హైదరాబాద్, 25. భారతుల అరుణ, సికింద్రాబాద్, 26. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 27. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, విశాఖ, 28. బోడపాటి కృష్ణవేణి, టి.నగర్, చెన్నై, 29. కె. సుబ్రమణ్యం, అనంతపురం, 30. కె. సత్యనారాయణ, పెనుగొండ, ప.గో.జిల్లా, 31. ఎస్. మణిమేగలై, తిరుపతి, 32. కె.ఇ. నిలమంగై, ఈస్ట్ ఆనందబాగ్, 33. అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, 34. యు. విజయశేఖర్‌రెడ్డి, కూకట్‌పల్లి, 35. సాధనాల నాగవర్ధని, నూజివీడు, 36. కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో. జిల్లా 37. ఆలూరి పార్థసారథి, చెన్నై, 38. ముదివర్తి అరుణ కుమారి, ఒంగోలు, 39. సూరి నాగరాజు, బెంగళూరు, 40. రావులపల్లి రామలక్ష్మి, విశాఖ, 41. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 42. గరికపాటి చైతన్యకృష్ణ, కాకినాడ, 43. బిక్కునూరి రాజేశ్వర్, ఈదిగాం, ఆదిలాబాద్ జిల్లా, 44. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 45. రామకూరు నాగలక్ష్మి, శ్రీకాకుళం, 46. జి. ద్వారకానాథ్, ఎ.ఎస్. పురం, నెల్లూరు జిల్లా, 47. సిహెచ్. ఉమాబాల, దోమలగూడ, 48. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 49. ఆర్. రమాదేవి, అనంతపురం, 50. నేమాని సుబ్బలక్ష్మి, విశాఖపట్నం, 51. వాసా కృష్ణప్రసాద్, తగరపువలస, విశాఖ జిల్లా, 52. వానపల్లి వెంకట సత్య గంగరాజు, విశాఖ, 53. నందూరి నాగేశ్వరరావు, బేగంపేట, 54. కరణం సత్యనారాయణ, చెట్టుపల్లి, విశాఖ జిల్లా, 55. కాపుగంటి శ్రీదేవి, లక్కిడాం జంక్షన్, విజయనగరం జిల్లా, 56. బి. ప్రభాకర్, విజయవాడ, 57. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 58. ఎస్. అబ్దుల్ అజీజ్, వనపర్తి, 59. టి. హేమలత, మచిలీపట్నం, 60. ఎస్. పద్మావతి, రామచంద్రాపురం, తూ.గో.జిల్లా, 61. ముదిగొండ అరుణరేఖ, బెంగళూరు, 62. ఎం. శేషు, న్యూఢిల్లీ, 63. కె. నాగవెంకట ఆంజనేయులు, విశాఖపట్నం, 64. బైరపనేని రేవతి, గుంటూరు, 65. కె. ఉషాదేవి, నల్లకుంట, 66. బి. శాంతి, విజయవాడ, 67. కె.వి.జె. దాస్, సికింద్రాబాద్, 68. దేవులపల్లి లలిత, ఉయ్యూరు, 69. టి. శశికళ, గుంతకల్లు,

# చతురంగం - 18 ఆధారాలు

## అడ్డం

1. వెలుగు, ఆంధ్రకేసరి పేరు (3)
3. మదురుకు వ్యతిరేకం (2)
4. శ్రీరంగంలో ప్రవహించే నది (3)
7. సంపద (2)
9. ఆధారమే తడబడింది (4)
10. నాగచైతన్య, కాజల్ సినిమా.. భయం (2)
12. పాకం, తినడానికి ముందు దీన్ని చేయాలి (2)
13. భాజపా గుర్తు (3)
15. బ్రహ్మదేవుడు (3)
18. ఆడపిల్లలు జడ చివర ఉండేలా అందం కోసం దీన్ని అల్లుకుంటారు (4)
20. ఉల్లాసం కోసం షికారుగా తిరగటం (3)
22. నరక లోకాధిపతి (3)
23. ప్రముఖ చిత్రకారుడు, దర్శకుడు అటునుంచి (2)
24. సప్తస్వరాల్లో మొదటి రెండు అటునుంచి (2)
25. ముఖం (2)
26. రంగవల్లులు (3)
27. సమానం అటునుంచి (3)
29. క్షీరం (2)
30. ఆలస్యం అటునుంచి (2)
33. పెద్ద ఢంకా, చాటింపు (3)
35. అజ్ఞాతవాసంలో ద్రౌపదిని కామించిన వాడు (4)
36. సాహసోపేతులైన పోలీసులకు లభించేది (5)

## నిలువు

1. స్త్రీ (3)
2. సందేహం (2)
3. అడ్డం 7 కు వ్యతిరేకం (2)
4. తెలుగు టైం (2)
5. ఈ రాజు విశ్వనాథవారి ఓ నవల (4)
6. తలకిందులైన హద్దు, గీత (2)
8. నీరు.. గజిబిజి (3)
9. క్రీడ (2)
11. చివర.. కింద నుంచి (2)
12. విత్తనం (4)
14. మొసలి (3)
15. హల్లు కానిది (2)
16. తలకిందులైన పిల్లాడు (3)
17. ద్రవపదార్థాల్ని వేడి చేస్తే వచ్చేది (3)
18. గెలుపు, మహాభారతాన్ని ఇలా కూడా అంటారు (3)
19. వినాయకుడికి ఇష్టమైనవి (4)
21. నవ్వు (3)
23. అచ్చ తెలుగు పక్షి (3)
25. శోభన్‌బాబు, శ్రీదేవిల సినిమా (4)
28. 'నాకు' బహువచనం (3)
31. పుట్టిన బిడ్డకు జ్యోతిషుని చేత రాయించేది / పెళ్లిళ్లకు ఇది కలవాలంటారు కొందరు (3)
32. పేకలో రాజు, రాణి తర్వాతది, శోభన్‌బాబు చిత్రం (2)
34. 'గాలివాన' కథా రచయిత పాట్టిపేరు, చిన్నపిల్ల (2)

## నిబంధనలు

✦ చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు. ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# చతురంగం - 18

రూ.150/- బహుమతి

గడువు తేదీ : సెప్టెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 శ్వే | త | | 4 | 5 వే | 6 |
| | | 7 | 8 | | | 9 | | | |
| 10 | 11 | | | | 12 | | | | |
| | 13 | 14 | | | | | 15 | | 16 |
| 17 | | | | 18 | | 19 | | | |
| 20 | 21 | | | 22 యు | ఖు | రే | | 23 | |
| 24 | | | 25 | | | 26 | | | |
| | 27 | 28 | | | 29 పాం | బ | | 30 గు | 31 హ్రా |
| 32 | | 33 | గా | | | | 34 | | త్ర |
| 35 | | | | | 36 శా | | | | కం |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------------

------------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

